యనునది ధ్వనికి ప్రథమ స్పందన కారణరూపము. ఇదియే నాదము. పశ్యంతీ మహాబిందు తత్త్వము. ఈ శివశక్తి రూపకనాద బిందువులే తరువాత రానున్న కళకు (సృష్టికి) ఆధారము. వీనినుండియే త్రిబిందువు లుద్బుద్ధమగును. త్రిబిందు రూపక కామకళయే తంత్రశాస్త్రములందు కారణ త్రితయములని చెప్పబడెను. (the three fold causes) ఇవియే ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు, బ్రహ్మ, విష్ణు. రుద్రనామక, సృష్టి స్థితిలయ కారకశక్తులు. ప్రపంచమున ప్రతిభూతమున్ను తనకు సహజ రూపమగు నొక శబ్దమును గలిగియుండును. వీనినే బీజాక్షరములందురు (the seed sounds). బీజాక్షరములు మంత్రములకు మాతృకలు. సృష్టియందు ఈ శబ్ద బ్రహ్మమునకుగల మూలస్థానమును గ్రహించిన వారికి మంత్రముయొక్క ఆవశ్యకత లెస్సగా దెలియగలదు మాయ మంత్రమునకు వశీకృతము. మంత్రధ్యానము లేనివారికి అనుభవ జ్ఞానము ప్రాప్తించదని భావము.

శబ్దార్థముల సంబంధము : వీనినే నామరూపములందురు శబ్దము పరాశక్తి రూపము, అర్థము సర్వము ఈశ్వర స్వరూపము. శబ్దమునందే అర్థము గర్భితము. కనుకనే ఈశ్వరుడు మాయోపాధికుడని తెలియబడు చున్నాడు. నామరూపముల కేకత్వము చెప్పబడుటచే ప్రయోజనము. ఏకప్రయత్నము చేతనే రెండును అపవదింప సాధ్యపడుటయే.

ప్రతిష్ఠయన : ఏది లేనియెడల ఏది లేకయుండునో అది దానికి ప్రతిష్ఠ. వాచకము వాచ్యమునకు ప్రతిష్ఠ. శబ్దలక్ష్యమైన అర్థమునకు శబ్దము ప్రతిష్ఠ. అర్థస్వరూపుడగు ఈశ్వరునకు వాక్కు ప్రతిష్ఠ. శాక్తము బ్రహ్మను శక్తిత్వేన పరిగణించును (relativism.) అద్వైతము బ్రహ్మను స్వరూపత్వేన పరిగణించును (absolutism). కనుక శాక్తము ఉపాసనకుపక్రమించును. అంతవరకే పరిమితము. అనగా ఉపాసనాను

కూలముగ శక్తికి గుణ కల్పనజేసి బ్రహ్మగ భావించును. శక్తిని బ్రహ్మ యొక్క ఒక గుణముగనో, ధర్మముగనో పరిగణింతురు (Inseperable Co-existence) కనుక నిది విశిష్టాద్వైతమునకు సన్నిహితము. ఇందు విమర్శ, ప్రకాశములు సమ్మిళితములుగాని ఏకముగాదు (a harmoniously blended but not a single whole) అద్వైతమున విమర్శ ప్రకాశములు అవినాభావితములు; అనగా శబ్దార్థములకు, వాచ్య వాచకములకు, అభిధాన (శబ్ద) అభిధేయము (అర్థ) లకు కేవల ఏకత్వమే చెప్పబడినది. అనగా విమర్శ ప్రకాశములకు కేవల ఏకత్వమే చెప్పబడినది. (These are known as an inseperable integral whole)

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ । వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే । పార్వతీ పరమేశ్వరౌ ॥

శ్రీ శంకరునకు సాదృశ్యుడగు తత్త్వవేత్త కవిసామ్రాట్ దేవీ ఉపాసకుడు శ్రీ కాళిదాస ప్రోక్త పై శ్లోకము శబ్దార్థముల ఏకత్వమునకే ఆలంబన మిచ్చుచున్నది. "చిదేవశక్తిః" అను వాక్యము చిత్తే శక్తి అని తెలుపును గాని, చిత్ యొక్క శక్తి యని గాదు.

II. ఆరంభవాదము : కార్యమగు జగత్తు కారణమందుండదు. అసద్రూపము అణువులనుండియే సృష్టింపబడునని వీరివాదము. కనుక దీనిని అసత్కార్యవాదమనియు అందురు. The effect has no cause. ఈ వాద ప్రతిపాదకులు తార్కికులగు నైయాయిక వైశేషికులు. పరమాణువుల సంయోగమువలన ఈ మహత్పదార్థసృష్టి ఆరంభమగునని సిద్ధాంతీకరించినందున దీనికి ఆరంభవాదమని పేరువచ్చినది. పరమాణువులు ద్వ్యణుక, త్ర్యణుక, చతురణుక, పంచాణుకాది ద్రవ్యపరంపర

నారంభించునని తార్కికుల సిద్ధాంతము. కార్యము పుట్టినప్పుడే దానికి ఉనికి ప్రాప్తించుచుగాని పుట్టుటకు పూర్వము అదిలేనేలేదు. పరమాణువులు జడమగు అదృష్టముచేత (Some unseen agency which gathers these atoms) సంయోగము చెందునందురు. సంకల్ప సామర్థ్యముగల చైతన్యమే యీ సృష్టి చేయవలయునని నిర్ధరించి యీ వాదమును సేశ్వర వాదులు త్రోసిపుచ్చిరి. ఒక చైతన్యమున్నదని అంగీకరించునెడల పదార్థము - శక్తియొక్క ఆవిర్భావమే యగును. Primal matter must be primal as matter is a manifestation of sprit. మరొక విధానము : కొన్ని కారణములు కలసి, ఆ కారణములకంటే భిన్నమగు కార్యమును పుట్టించుననుట. ఉ॥ ఒక ఆభరణము అను కార్యము రూపొందించుటకు బంగార మొక్కటియున్న చాలదు. ఒక విశ్వకర్మ, కుంపటి, సుత్తె, సమ్మెట, మున్నగునవి యుండవలయును గదా! ఈ వాదమున కార్యకారణములు భిన్నములని చెప్పబడుటచేత పరమాత్మ జగద్విషయమున కారణము కానేరదు. పరమాత్మ జ్ఞానస్వరూపుడు, అద్వితీయుడు, సర్వమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణుడగుటచే—కార్యకారణములు భిన్నములని తెలుపు నీ వాదము త్రోసివేయబడెను. మరియు సర్వవ్యాప్త పరమాత్మ జగత్కారణమనియు, పరమాత్మ యందే జగత్తు ఉండుననియు చెప్పుటకు అనువుగ లేదనియు యీ వాదము నిరాకరింపబడినది. "ఏకమేవ అద్వితీయం" అని ఛాందోగ్య శ్రీవ పాఠమున జెప్పబడినట్లు పరమాత్మ ఒక్కడే, కారణమగుటకు రెండవదిలేదు అనగా ప్రపంచమను కార్యమునకు, నామరూపక్రియా రహితుడగువాడు పరమార్థమున జగత్కారణుడు కాజాలడని నిర్ధరింపబడినది.

Arambhavada is the theory that certain factors contribute for the shaping of an article; that the

effect comes to manifest, even without the 1St cause mentioned in metaphysics

III వివర్తవాదము (ఆత్మాధిష్ఠానకల్పితము: సాక్షివివర్తవాదము)

The Theory of illusion or superimposition : The illusion created by the self, on the self itself, as the substratum ఈ వాదహృదయమును గ్రహించుటకు ముందు వైద్య శాస్త్రమున చెప్పబడిన ఒక అంశమును విచారించిన విషయము సుగ్రాహ్యము కాగలదు. జడమగు ప్రకృతి (పరిణామి) పృథక్సత్తలేనిది. ఐనను రజస్తమస్సుల సంచలన (క్షోభ) ప్రభావముచే ప్రాకృతాప్రాకృతములు, దివ్యాదివ్యములు, శుభాశుభములు, మోదఖేదములు అను ద్వంద్వములు భాసించుచున్నవని శాస్త్రము తెలుపుట. ఆంగ్లమున consciousness derailed is the cause of duality అనగా చైతన్యము, ప్రసరించు స్రోతస్సుల పథము దప్పుటయే ద్వంద్వభావము లకు మిథ్యాభావములకు కారణము అని భావము. ఇది యెట్లన విచారింతము, వైద్యక్షేత్రమున (field of medicine) మానసికవ్యాధులు (psychological diseases) ఇప్పుడు బహుళా సంభవముగుచున్నవి. ఇంద్రియములు గ్రహించియున్న విషయజ్ఞానమును ఉద్వేగములద్వారా (through nervous impulses) ఒక కేంద్రమునకు (centre in brain) అందించవలసియుండ, మరియొక కేంద్రమున కందించుట వలన గలుగు మిథ్యాజ్ఞానముచే (messages sent to wrong tele. phone numbers) యథార్థముగలేని జబ్బులు నిజముగా యున్నట్లే బాధల కల్పించుచున్న స్థితి గలుగుచున్నది. ఉదాహరణకు అపస్మారవ్యాధిని (Hysteria, గమనింతము. ఈ వ్యాధిగలవారు యథార్థముగ పక్షవాతము వచ్చినట్లే ఒకప్రక్క కాలుచేయి పడిపోయి కదల్ప సాధ్యపడదు. కొందరికి మూగపోయినట్లు నోట మాటరాదు ఇట్టి స్థితులు.

కొన్నినెలలవరకుకూడ ఆట్లేనిలచియుండి వా రా యూ వ్యాధిపీడితుల మనియే విశ్వసించియుందురు. ఈ వ్యాధులకు నిదానము (pathology) డాక్టర్లు ఎన్నిపరీక్షలు చేసినను తెలియబడదు. పక్షవాతరోగికి దగ్గరలో ఒక తుపాకీగుండును ప్రేల్చిన ఆ శబ్దమునకు భీతిజెంది ఆమ్మోయని లేచి పరుగెత్తును. మాట పడిపోయిన రోగి కొబ్బరిచెట్టుక్రింద కూర్చొనియుండ ఒక కొబ్బరికాయ రాలి నెత్తినపడిన "అమ్మో ! కొబ్బరికాయయని, తల పగిలినదిరో" అని అరచుచూ చెప్పును. ఈ ఘోరవ్యాధులు మానసిక వికార జనితములేగాని నిజముగావు. అవయవములు పచ్చుబడినట్లు, మాటరాక మూగవోయినట్లుండుటయే మిథ్యా జ్ఞానకార్యములకు ఆత్మాధిష్ఠానభ్రమ కుదాహరణముగ చాలదా ? ఒకని కొక తుపాకిప్రేలుడు యింకొకనికి కొబ్బరికాయదెబ్బ ప్రబోధము గలిగింప, మిథ్యాభావములు పోవుటను మనము చక్కగా గ్రహించ సహకరించగలవు. అష్టాంగ హృదయమను వైద్యగ్రంథమున మంగళాచరణ శ్లోకమును వినండి.

శ్లో॥ రాగాదిరోగాన్ సతతానుషక్తాన శేషకాయ
ప్రసృతా న శేషాన్।
ఔత్సుక్య మోహారతిదాన్ జఘాన యోాఽ
పూర్వవైద్యాయ నమోస్తుతస్మై॥

శరీరమున వాతపిత్త శ్లేష్మముల వైషమ్యస్థితిచే శరీరవ్యాధులు గలుగునట్లు రాగద్వేష కామాదులచే మనస్సునకు మిథ్యా స్వరూపవ్యాధులు గలుగును. వాటి నివారణకు అపూర్వవైద్యుడగు పరమాత్మకు నమస్కరించుచున్నానని భావము. మన జ్ఞానేంద్రియములు లందించు మిథ్యాజ్ఞానమే రాగద్వేష కామాది వికారములకు, అందుచే జ్ఞానము పథముదప్పుటకు కారణమని గ్రాహ్యాంశము.

ఇక శంకరులచే ఉపనిషత్సమ్మతముగ చెప్పబడిన వివర్తవాద విచారణ జేయుదము : వివర్తమనగా వస్తువు ఒకటిగనే యుండ యింకొకటిగ స్ఫురించుట, ఇది యెట్లు సంభవము ? మన చూపులో దోషముండిననో. వస్తువును గోచరింపజేయు ప్రకాశమున హెచ్చుతగ్గులగు దోషముండిననో సంభవింప నవకాశమున్నది. లేక మన సంస్కార బలిమిచేత గూడ ఒకటి మరియొకటిగ భాసింపగలదు. అనగా అధిష్ఠాన వస్తువుయొక్క నిజరూపము చక్కగా తెలియబడక, అధిష్ఠాన సామాన్య జ్ఞానముచే విశేషాంశయొక్క అజ్ఞానము ప్రాప్తించి ఆ యజ్ఞానము మన సంస్కార బలిమిచే యింకొక వస్తువుగ పరిణమించి ప్రత్యక్షమగును. సంగాత్ సంజాయతే కామః కనుక యిచ్చట గ్రాహ్యాంశమేమన "మన అజ్ఞాన పరిణామ జనిత భ్రాంతి జ్ఞానమే మరియొక వస్తురూపమున స్ఫురించినదిగాని అధిష్ఠానముగు అసలు వస్తువునందు (the thing in itself) ఏ విధమగు మార్పునూలేదు" అజ్ఞాన పరిణామ జనిత భ్రాంతి జ్ఞానమే మిథ్యాజ్ఞానము. ఇది గీతయందు మోహశబ్దముచే చెప్పబడినది. ఇది అసలు వస్తువుయొక్క నిజరూపము తెలియబడినప్పుడు నశించును, కనుక "అసత్" అని వ్యవహారమునకు వచ్చినది. కనుక అద్వయవాదము అజ్ఞాన పరిణామ వాదముగానీ పదార్థ పరిణామ వాదముగాదు. ఈ భావమును దృఢపరచు కొనుటకు ఉదాహరణల దీసికొని పోల్చిచూచుకొందము. ఉపమానములకు కొన్ని, ఆధునిక వస్తువులు గలవుగాని శంకర భగవత్పాదులచే స్మరింపబడి, ఉచ్చరింపబడి అనాదినుండి శాస్త్రములయందు చెప్పింపబడినవి శుక్తి (ముత్యపుచిప్ప) రజ్జువు (త్రాడు). శ్రీరాముని కరస్పర్శచే రూపొందిన చారలు సుస్థిరములై అభిజ్ఞాయోగ్యములైన ఉడతవంటివి యీ శుక్తిరజ్జువులు. కనుక వీటినే ఉదాహరణము గ్రహింతము. శుక్తికి ఒకవైపు మెఱుపుగల తెల్లని రంగు మరియొకవైపున నలుపు. హెచ్చు ప్రకాశముగల సమయముల

యందు సూర్యకాంతి శుక్తియొక్క తెల్లని ఫలకముపై బడినప్పుడు మనకు వెండివలె గన్పించును. దీనిని శుక్తిరజత భ్రాంతి యందురు. ఇచ్చట వెలుగు అధికముగ నున్న దోషముచే శుక్తియందు వెండి భాసించినది. వెండియొక్క తెలుపు మన అనుభవమున నున్నదిగనుకనే రజతభ్రాంతి గలుగుట. అనగా సంస్కార ప్రాబల్యముకూడ అజ్ఞాన పరిణామ సామగ్రిగ నుపకరించునని తెలియనగును. అజ్ఞానమునకు రెండు శక్తులు గలవు. 1) తమోగుణ ప్రాబల్యముచే గలుగు ఆవరణ శక్తి (veiling property) అనగా బుద్ధిని ఆవరించుటచే వస్తువును మరుగు పరచు శక్తి 2) రజోగుణ ప్రాబల్యముచే వస్తురూపమును మార్పుతో గోచరింపజేయు విక్షేపశక్తి (distorting property) ఆవరణ శక్తి అధిష్ఠానమును కప్పి శుక్తిజ్ఞానము లేకుండ చేయును. విక్షేపశక్తి శుక్తి యందలి తెలుపును. వెలుగునందలి మెఱుపను దోషముచే వెండిగా భాసింపజేసి భ్రాంతి జ్ఞానమును గలిగించును. రజ్జువిషయమున: త్రాడును మసకచీకటిలో చూచి పామని భ్రాంతిజెంది భయపడుదుము. ఇచ్చట త్రాడు అధిష్ఠానము, మసకవెలుతురు దోషము. లేనిదియై యుండియు ప్రాతిభాసికముగ పాముగ అధిష్ఠానమగు త్రాడుపై ఆరోపింపబడి తెలియ పడుటనే అధ్యారోపమందురు. (Super imposition). అజ్ఞానము యొక్క ఆవరణశక్తిచే ద్రష్టకు త్రాడు కనిపించలేదు. విక్షేపశక్తిచేతను ద్రష్టయొక్క సంస్కార బలముచేతను అది కట్టుగాగాక పాముగనే త్రాడుపై ఆరోపింపబడినది. ఇప్పుడు మరికొంత వెలుగు సాయము చేతనో లేక వస్తుతత్త్వ జ్ఞానముగల మరియొకరు దృఢీకరించి చెప్పిననో ఆ భ్రాంతిజన్య జ్ఞానముపోయి (అపవదింపబడి) వస్తుతత్త్వ జ్ఞానము గలిగి, అధ్యారోపింపబడినది పాముగాక అధిష్ఠానమగు త్రాడే తెలియబడును. ఈ భావమునే వాసుదేవ మననమను గ్రంథమునందు "అధ్యారోపాప వాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" యను ప్రవచనముతో వాసుదేవ

యతీంద్రుడు తన గ్రంథమును ప్రారంభించెను. అనగా పైపై తోచి కల్పించిన పదార్థముల విచారించి, వస్తుతత్త్వము ఇది గాదని త్రోసి పుచ్చెడు ప్రక్రియతో ఆత్మతత్త్వమును స్పష్టీకరించుచున్నాను.

భ్రాంతిచే నింద్రియగోచరమైన కార్యమునకు, తాత్త్వికమగు పదార్థ మధిష్ఠానముగ తెలియవలెను. భ్రాంతికే, వేదాన్త విషయములకు వర్తించునపుడు అధ్యాసయని మరొక పేరు. ఈ యధ్యాసచే త్రాటి యందు భాసించు మిథ్యాసర్పము సత్యముగ తోచుచున్నది. శూన్యమను నెడల, శూన్యము దృగ్గోచరముగాదు. సత్యమని చెప్పునెడల, రజ్జు జ్ఞానము గలిగిన వెంటనే బాధింపబడగూడదు. సత్యవస్తువు త్రికాలాఽబాధితము. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల యందును అనుస్యూతము. కనుక నిది సత్ గాదు అసత్ను గాదు. అనిర్వచనీయమన నిట్టిదే. ఇది బౌద్ధుల అలీకమును గాదు సత్+అసత్ (సదసత్) అగును. It is a simultaneous is and is not. Maya is a comparetively gross form of the dynamic Sakti which appears in evolution. ఈ యుదాహరణలయందలి కార్యకారణముల వివరించి తెలిసికొన్నయెడల రజతమునకు శుక్తిని యూవరించిన యజ్ఞానము, పామునకు త్రాడును ఆవరించిన యజ్ఞానము, పరిణామ్యుపాదాన కారణములుగ తెలియబడుచున్నవి. వెండికి ముత్యపుచిప్పయు. పామునకు త్రాడున్ను వివర్తోపాదాన కారణములని గ్రహించవలయును. పరిణామి = కార్యరూపముగ మారి వచ్చిన పదార్థము + ఉపాదానము = మార్పుజెందిన మూలపదార్థము = పరిణామ్యుపాదానము. అసలు వస్తువు మారకుండా

* (1. అధ్యారోపము = పైనకల్పించి చూచినది; 2. అపవాదం= ఇదికాదు అని త్రోసిపుచ్చెడు ప్రక్రియ 3. నిష్ప్రపంచం = ఆత్మ తత్త్వమును 4. ప్రపంచ్యతే = స్పష్టీకరించుచున్నాను.)

మరియొక వస్తువుగా కనిపించుట వివర్తోపాదానము. అజ్ఞానము రజితముగ మారినదిగనుకనే పరిణామ్యుపాదానము. శుక్తి మారకయే వెండివలె కనిపించినది గనుక వివర్తోపాదానమని చెప్పబడెను. ఈ విజ్ఞానమును వేదాంతశాస్త్ర విషయమునకు వర్తింపజేసి విచారించిన ఉపమేయమగు జగత్తు బ్రహ్మను ఆవరించిన మూలాజ్ఞానము యొక్క పరిణామ ఫలితమని-అట్టి అజ్ఞానముచే ఆవరింపబడిన పరమాత్మ యొక్క వివర్తమనియు తెలియవలయును. జగద్విషయమున అజ్ఞానము పరిణామ్యుపాదానము పరమాత్మ వివర్తోపాదానమని అనగా వివర్తజ్ఞానమే ఉపాదానమని గ్రాహ్యాంశము. ఈ వివర ప్రక్రియను (process of super imposition as the result of a modification of nescience) విశ్వాసపూర్వకముగ గ్రహించిననేగాని అద్వయ సిద్ధాంతమునందు విశ్వాసము, శ్రద్ధ గలుగవు. దీనిని పరిపుష్టము జేయుటకే శఙ్కరులు మాయావాదమును ప్రతిపాదించి విపులీకరించిరి. 1-2-శ్లోకములయందు జగత్తుపై జీవునిపై మాయయొక్క ప్రభావమును, మాయా స్వరూపమును తెలుపబడినవి. 3-9-శ్లోకములయందు జీవులపై మాయా ప్రభావమును విపులీకరించి దెలిపిరి. ఈ మాయావాదము ననుసరించి సత్తాత్రైవిధ్యము అంగీకరింపబడు చున్నది. వీటివివరము యీ దిగువ సూచింపబడును. ఈ వివర్తవాదమున కనుబంధముగ స్వల్పభేదములతో మరిరెండు వాదములున్నూ చెప్పబడినవి. అవిరెండును అద్వైత సిద్ధాంత ప్రతిపాదకములే. విచారింతము :

4) సృష్టి దృష్టిప్రక్రియ; (వృత్తిప్రభాకరము) : ఇది ప్రమాతయగు చిదాభాసుని భ్రాంతిచే గలిగిన భావము. దీనిని అజాతవాదమనియు అందురు. అనగా ప్రమాతృ వివర్తము. ఇందు ముఖ్యమగు భావము దృశ్యమానమగు ఈ సృష్టియంతయు యిదివరకే (నీవు చూడకముందే) సిద్ధమైయున్నది. దీనిని మనము ఏ దృష్టితో జూచిన యెడల, దీని

ఉపాదాన, అధిష్ఠానముల తత్త్వమును (నిజరూపమును) తెలియగలమను విచారణయే ఇందలి విషయము. సూక్ష్మ గ్రాహులుగాని వారికి బోధనా సౌలభ్యమునకు ఉపాదానమును మూడు దృక్కోణముల నుండి జూచిన మూడు విధములుగ తెలియబడు సత్తలు గలవనితెలుపును.

i) ప్రాతిభాసిక సత్త : ప్రతిభాసయన భ్రమ, సత్తాయన ఉనికి. భ్రమకాలమున మాత్రమే సత్యముగ ఉనికియున్నట్లు గన్పించునది యీ సత్త. అంతరమగు స్వప్నజగత్తు బాహ్యమున నున్నశుక్తి రజతము దీనికుదాహరణలు భ్రమజ్ఞానమునకు కారణమగు దోషము తొలగిన తరువాత ఈ జగత్తు ఉండదు కనుక త్రికాలాబాధితమగు సత్య వస్తువుగాదు (Transitory appearance). సదసత్తులలో ఒకదానిని మరియొకటిగా భావించి విశ్వసించుట అధ్యాస. ఇది ఆరు విధములగు దోషములచే ప్రాప్తించును. కనుక నిది ఆ దోషముపోయిన పోవును గానీ బ్రహ్మజ్ఞానముచే తొలగదు. చిత్తవృత్తి యందలి మార్పుచేత మాత్రమే దీనికి నివృత్తి గలుగును. ఉ॥ శుక్తియందలి రజతము చిత్తమునకు శుక్తివృత్తి ప్రాప్తించిన, రజతవృత్తి తొలగును. కనుక రజతము ప్రాతిభాసికసత్త గలిగినది మాత్రమే యగును.

ii) వ్యావహారికసత్త : వ్యవహారమునందు గలుగు అవిద్యకు అంతఃకరణ వృత్తిచే అత్యంతనాశము (స్వరూపనాశము) ఉండదు. స్వరూప తిరస్కారము మాత్రము గలుగును. దీనికి ఉదాహరణ ఈ జగత్తు. దృష్టి సృష్టివాద సత్తను అంగీకరించలేదు.

iii) పారమార్థిక సత్త : ఎయ్యది త్రికాలబాధితమో, ఎయ్యది చిత్తవృత్తిచే మార్పునుగాని నాశముగానీ పొందదో, ఏది బ్రహ్మజ్ఞానముచే

మూలాజ్ఞానమను ముసుగును తొలగించుకొనిన మాత్రమే అనుభూతి పూర్వకముగ సాక్షాత్కరించునో అదియే పారమార్థికసత్త.

N. B. బ్రహ్మను, బహువిధ జడములను ఆశ్రయించియుండి అనాదియై. అఘటనాఘటన సమర్థమై, అనిర్వచనీయమగు భ్రాంతి కల్పనాహేతుశక్తియే మూలాజ్ఞానము.

ఈ సృష్టివాదము (1) పైనచెప్పిన త్రివిధ సత్తల నంగీకరించును. (2) బహు సంఖ్యాకులు జీవులని దెలుపును. (3) ఈ వాదమున మనసాక్షి బ్రహ్మ, జీవుడుగాదు. (4 ఇందు సృష్టికర్త జీవునికి భిన్నుడగు ఈశ్వరుడు.

5. దృష్టిసృష్టివాదము : (ప్రాతిభాసిక సత్తవాదము) ఇది సాక్షి వివర్తమును దెలుపు వాదము. దీనిని సాధుశ్రీ నిశ్చలదాసుగారు అంగీక రించిరి. వ్యావహారికమును కూడ స్వప్నతుల్యము అనగా జాగ్రత్తకూడ ఒక స్వప్నమువంటిదని నిరూపించుట. దీనిని సుజాతవాదమనియు అందురు. ఇది సూక్ష్మగ్రాహుల కుద్దేశింపబడినది. ఇందు ప్రధానసూత్రము "దర్శనంసృష్టిః-అదర్శనం లయః'' అనగా నీవు చూచుటకుముందు సృష్టి లేదు. నీవు చూచినప్పుడే ఆకార్యము సంభవమగును. చూడనప్పుడు ప్రళయ ముండును. దృష్టియన దృక్ లేక బ్రహ్మ. అది స్వప్రకాశము. అదియే స్వీయమాయచేత జీవదృష్టికి లోపల వెలుపల అవిద్యాకార వృత్తిరూప జ్ఞానముచే జగదాకారముగ భాసించుచున్నది. కనుక దృష్టియన అవిద్యా కార వృత్తిరూప జ్ఞానమనియే మనము గ్రహించవలయును. దృశ్యమునకు ఆత్మయే అధిష్ఠానము. దృష్టివాదులకు పరిపూర్ణాత్మ ఒక్కటియే పార మార్థికము, స్వప్న జాగరస్థితులు ప్రాతిభాసికములు. అందుచే ఒక్క పారమార్థిక సత్తను మాత్ర మంగీకరింతురు. జాగ్రత్కాలమున స్థూలసూక్ష్మసృష్టి, ఆత్మనుండి స్వీయమాయాశక్తిచే జరిగి జాగ్రత్కాలము

పోయిన తరువాత ఆ మాయాశక్తి ప్రభావముచేతనే, మరల ఆత్మయందే లయమగును. ఇదియే సుషుప్తి. జగద్విషయమునను ఇట్లే సృష్టి, స్థితి. లయములను సంభవమని తెలిసికొనవలెను. ఇక జీవుని విషయమున ఏక జీవవాదమును ప్రతిపాదింతురు. ఇది బ్రహ్మజీవవాదమనియు అందురు. జగత్తునందు బహుసంఖ్యాక జీవులుగ వ్యవహరింపబడువారు సాక్షియందలి ఆభాసులే. సాధనములగు ఇంద్రియముల అపేక్ష పొందకయే స్వాఽవిద్యా దృష్టిచే సాక్షాత్తుగ సర్వమును గనుమండును గావున జీవుడే (ప్రత్యగాత్మయే) సాక్షియగునుగాని బ్రహ్మసాక్షిగాదని వీరిమతము. మనస్సు ఆత్మయొక్క వివర్తము, శక్తియొక్క పరిణామమునై యున్నది. అనగా మాయావశమున పరిపూర్ణుడగు పరమాత్మయే మనస్సుగ. జగత్తుగ వివర్తము పొందుచున్నదని భావము. కనుక జగత్తుకు వివర్తోపాదానము, ఆత్మ. పరిణామోపాదానము మాయాశక్తియని తెలియవలయును. జ్ఞానమునందు గోచరించు వస్తువునకే ఉనికిని దృష్టివాదు లంగీకరింతురు. జ్ఞానమన సాక్షిజ్ఞానము అవిద్యాప్రతిబింబము జీవుడు. విషయములచే మలినసత్వ ప్రధానమగు అంతఃకరణవృత్తి, (అవిద్య) తదవచ్ఛిన్న చైతన్యమే జీవుడు. ఇతనికి అంతఃకరణ సంబంధము లేదు. కనుక స్వప్రకాశ స్వరూపముతో సాక్షాత్తుగ సర్వమునకు దృక్కుగ నున్నాడు. అంతఃకరణముతోజేరి ప్రమాత యగుచున్నాడు. అనగా కర్తృత్వ భోక్తృత్వముల బొందుచున్నాడు. జగత్తు : మాయచే బ్రహ్మ నుండి పుట్టిన జగత్తుకూడ అనిర్వచనీయమేగాని అలీకము గాదు. రజ్జు సర్పమునవలె ప్రాతిభాసికమున్నుగాదు. జీవునికి బ్రహ్మజ్ఞానము కలిగిననే జగత్తు నశించునుగాని అంతవరకు స్థిరముగనే యుండును. బ్రహ్మ జ్ఞానముచే నశించునది వ్యావహారిక సత్తాయని సృష్టిదృష్టి సిద్ధాంతము. ఇందు ప్రధానముగ రెండు సూత్రములు గలవు. 1. వ్యావహారికముగ

గోచరించు సకల పదార్థములు స్వప్నపదార్థములవలె అవిద్యాకార్యములు. అవిద్యోపహిత సాక్షివలన నివి ప్రకాశింపబడుచున్నవి. కనుక సాక్షిభాస్యములు 2. అవిద్యా పరిణామములైన సర్వజ్ఞాన జ్ఞేయములు ఏకకాలమందే ఉత్పన్నమైఏకకాలమందే నశించుచున్నవి. పదార్థము ప్రతీతియగుటకు ముందుండదు. ప్రతీతి గలిగినప్పుడే ఉత్పన్నమగును. పదార్థమునకు జ్ఞాతసత్త యుండునుగాని అజ్ఞాతసత్త ఉపపన్నముగాదు. సత్తలు రెండేయని దృష్టివాదుల మతము. 1. ప్రాతిభాసికసత్త, సకల అనాత్మ పదార్థముల సత్త; కనుక నివి సాక్షిభాస్యములు. ప్రమాత ఇంద్రియములు, విషయములు, వాటి జ్ఞానము, ఏకకాలమందే ఉత్పన్నమగును. పరస్పర విషయ విషయీభావము ఘటిల్లదు. ఆత్మకు భిన్నముగ దోచు సర్వమూమిథ్యామాత్రమే. క్షణమాత్ర స్వప్నమునందు బహుకాల ప్రతీతిగలుగునట్లు- జాగ్రత్తుయందు స్థాయి, బహుకాలభోగ ప్రతీతి గలుగును. కనుక జాగ్రత్పదార్థములకు, స్వప్నపదార్థములకంటే విలక్షణత లేదు.

2) పారమార్థికసత్త ; ఇది త్రికాలాబాధితమగు సత్యస్వరూప సత్త,స్వరూప ప్రకాశము. ప్రమాణ, ప్రమేయ, ప్రమాతల త్రిపుటి ఘటిల్లదు. ఇదిసర్వసాక్షి.

దృష్టివాదమున జగత్తునకంతకు జీవుడు ఒకేఒక ప్రత్యగాత్మ. ఆయన దృష్టియే సృష్టి. ప్రత్యగాత్మ సమష్టి స్వరూపుడవగు నీవే యీ సృష్టియంతకును. కనుక ప్రత్యక్ సృష్టి లేక సాక్షి సృష్టిగా మనము తెలియుటలేదు. అందుచే సిద్ధాంతరీత్యా నీకేదియు బంధముగా జాలదు. ఇది తెలిసిన వానికి "ఆత్మరతి రాత్మక్రీడః ఆత్మారామః" అను సత్యము వర్తించును. చంద్రుడు చంద్రిక (వెన్నెల) ఒక్కటియే అన్నట్లు ప్రత్యగాత్మ పరమాత్మ లనన్యములే.

పంచపాదికకు వివరణమనెడి వ్యాఖ్య గలదు. ఈ దృక్పథము నకు వివరణ ప్రస్థానమని పేరు. భామతీప్రస్థానమున వాచస్పతీ మిశ్రునిచే వివరింపబడెను. దీనికి వ్యాఖ్యానము కల్పతరు. దీనికి మరల పరిమళమను వ్యాఖ్యానము అప్పయ్య దీక్షితులవారిచే వ్రాయబడెను.

కాశ్మీర శైవులు వివర్తవాదము సంగీకరించరు. వీరికి జగత్తు ప్రాతి భాసికమేగానీ ఈశ్వర మాయా విలాసముగు కారణముచే సత్యప్రతి భాసమేయగుగాని, మిథ్యాప్రతిభాసముగాదు. These are non Sankarites. Their's is not Vivartha Vada. They are Triyambakites. This mode of Abhasa is mentioned here for contrast only.

శ్రీ శంకరుల వివర్త (మాయా) వాదమందలి వైవిధ్యము.

| సృష్టిదృష్టివాదము | దృష్టిసృష్టివాదము |
|---|---|
| ఇది వ్యావహారికసత్త నంగీకరించునది లేక వివర్తవ్యవహారము. వీరికి జాగ్రత్త వేరు స్వప్నము వేరు కనుక జాగ్రతిని ప్రాతిభాసిక మనరాదు. వీరికి జగత్తు సత్య ప్రాతిభాసికము. | వీరిది వివర్తప్రతిభాస. జాగ్రత్త కూడ. స్వప్నతుల్యముగ గ్రహించుటచే వీరికి ప్రతిభాస, మిథ్యాపూర్వకమైనది. |

సృష్టి దృష్టి – దృష్టి సృష్టి వాదములు రెండును జగత్తంతయు ఒకే బ్రహ్మమైన ఆరోపితమని అంగీకరించును. ఇందు సృష్టివాదము సద్వారకబోధ. అనగా ముందు జీవునికి ప్రత్యగాత్మ భావమును సిద్ధింప జేసి తరువాత పరమాత్మభావమును ప్రతిపాదించు విధానము. దృష్టివాద బోధ "స్వాత్మానమే వాద్వయం" అనగా ప్రత్యగాత్మ పరమాత్మల

అనన్యభావముతోడనే ప్రారంభమగును. ఇక వీరికి తత్త్వత్రయ విషయక భావము లెవ్వియన :

## సృష్టి దృష్టి వాదము

1. జగత్తుకు అజ్ఞాతసత్త లేక వ్యావహారికసత్త అంగీకరింపబడినది. అనగా ఈశ్వరసృష్టిపైననే నీకు భ్రాంతిజ్ఞానము గలిగినదందురు.

2. జీవుడు : ఈశ్వర ప్రతిబింబము లేక అవిచ్ఛిన్నాంశ (పరిచ్ఛిన్న or divided) అనియు కనుకనే జీవులు అగ్ని విస్ఫులింగములవలె నానాత్వాత్మకులని భావింతురు. నేను ప్రమాతను, జీవుడను అంతఃకరణాభిమానుడను అని ముందుతెలిపి, తరువాత వీనిని ప్రత్యగాత్మగా నిరూపించి, ఆ పైని బ్రహ్మతో ఐక్యమును చెప్పుదురు. అనగా ప్రత్యగాత్మమే పరమాత్మయను చరమస్థాయి బోధజేయుదురు గనుక వేదాన్తులచే ఈ వాద మంగీకరింపబడినది.

3. పరమాత్మ : మాయోపాధికుడు, జీవభిన్నుడందురు.

## దృష్టి సృష్టి వాదము

1. జగత్తుకు జ్ఞాతసత్త లేక ప్రాతిభాసికసత్త నంగీకరింతురు. ఈశ్వర సృష్టి యనబడునది ప్రత్యగాత్మవగు నీ చేతనే కల్పింపబడినదందురు. అట్టి ప్రత్యగాత్మను నేనని తెలిసికొనిన వ్యావహారికము (జాగ్రత్తు) స్వప్నమువలె ప్రాతిభాసికము మాత్రమే యగునందురు.

2. జీవుడు : పరమాత్మాభాసాంశ లేక ఏకాంశయనియు, ప్రత్యగాత్మ జీవునికి సాక్షియనిగాని, అంతఃకరణ సాక్షియనిగాని అంతఃకరణాభిమానియనిగాని చెప్పరు. పరమాత్మ జీవాత్మలకు ఏకత్వము లేక అనన్యత్వమునే బోధింతురు. (direct Identity)

3. పరమాత్మ మాయోపలక్షితుడు మాత్రమే; ప్రత్యగ భిన్నుడే అనగా ఉపాధి నభిమానించక అతీతుడుగనే యుండువాడు. కనుక మాయా సహితుడుగాడు.

## II జీవ వాదములు

i. ఆభాసవాదము : ఆభాసయన ఆవిర్భావము (manifestation). ఇది రెండు విధములు (1) శంకరుని వివర్త ప్రక్రియయందు మొదటిది శ్రీమదభినవ గుప్తాచార్య ప్రతిష్ఠితమగు సృష్టిదృష్టి ప్రక్రియ. ఇది కాశ్మీరు దేశమునందు శైవశాక్త మతకర్తలచే ప్రతిపాదింపబడినది. దీనికి ఆభాస పరమాత్మ వాదమనియు పేరు. (The theory that maintains that manifestation is truth). (2) రెండవ ప్రక్రియ శంకరుని దృష్టిసృష్టి వాదము లేక విపర్యాభాసవాదము. దీనిని కాశ్మీరీయులు వివర్తముగ పరిగణించక పారమార్థికముగనే విశ్వసించిరి. ఇందు శైవులు చిద్రూపుడగు శివునకు, శాక్తేయులు "చిత్ శక్తి" యని స్త్రీ పుమాది సర్వరూపమున భావింపబడిన ఆయన శక్తికిని ప్రాధాన్యము నిత్తురు. వీరు జగత్కారణమును శక్తి లేక శివ ఆభాస (manifestation of the Supreme) అందురు. అనగా దృశ్యములు "పరమాత్మ విభూతిమాత్ర ఐశ్వర్యములు." పరమాత్మ స్వరూప మాత్రము చేతనే ఉనికి కలది గనుక. అవి సత్యములే గానీ మిథ్యగాదందురు (They say that the manifester and manifestation are both essential truths). కనుకనే అద్వైతవాదమని తేలును. "భూరంభాంస్యనలోనిలోంబర మహర్నాథోహి మాంశుఃపుమా" అను శ్లోకతాత్పర్యః మీ వాదమును అంగీకరించును. అందు అద్వైతులు చెప్పుమిథ్యయే ఆభాస లక్షణమని తెలుపబడినది.

అందు ఈ విశ్వమంతయూ అనగా మూర్త్యష్టకము, జగత్కారణమగు పరమేశ్వరునికంటె అభిన్నమనియే సిద్ధాంతీకరింపబడినది. మృత్తుకంటె అన్యమగు ఘటము అసత్యమైనట్లే పరమేశ్వరునికంటె అన్యముగ దోచు నీవిశ్వముకూడ అసత్యమే యని (మిథ్యయే) భావము. అద్వైతులు చెప్పు ఆభాస, మిథ్యాత్వరూపము, శాక్తేయులు చెప్పు ఆభాస, విభూతి ఆవిర్భావమని తాత్పర్యము. జగత్కారణమును దర్శించుటకు పరమేశ్వర విభూతిరూపమగు మూర్త్యష్టక ముపకరించునని శంకరుల హృదయము. కనుక అష్టమూర్తులు పరమాత్మయేయైన సత్యమని భావము. ఐనను మిథ్యా భావమునకు విరుద్ధమైనదిగాదు. దృశ్యములు నిజాంతర్గతమనివివర్తవాదులు, ప్రాతిభాసిక సత్యములని శైవశాక్త ఆభాసవాదులు చెప్పుదురు. సూక్ష్మ గ్రాహులుగానివారికి సద్వారక బోధ జేయుటకే యీ విభూతి ఆభాస ప్రసక్తియని గ్రాహ్యమగుచున్నది. పై ఆభాసవాదము ఆవిర్భావరూపమున జగత్తునకుకూడ వర్తించునని గ్రహించితిమి.

వీని ప్రయోజనము సోఽహమా దాసోఽహమా యని దెలిసికొని తరువాత తన సాధనా విధానమును నిర్ణయించుకొనుటకు "కర్మణి ద్వైతినః భక్తౌవిశిష్టా ద్వైతినః జ్ఞానే అద్వైతినః యను సత్యమును గ్రహించుటయే యగును. ఈ సందర్భమున రామాంజనేయ యుద్ధ సమయమున శ్రీ ఆంజనేయ ప్రోక్తవచనము మననయోగ్యము. వేదాంత మును అనుభవ విరుద్ధము లేకుండ అనుష్ఠించుటకు సహకరించును.

దేహబుద్ధ్యాతుదాసస్తే జీవబుద్ధ్యాత్వదంశకః ।
ఆత్మబుద్ధ్యాత్వమేవాహం ఇతి మే నిశ్చితామతిః ॥

(2) అవచ్ఛేదము : అవచ్ఛేదమనగా అనంతమగు దానిని పరిమిత పరచుట (the theory which conditions or limits

the limit-less or the Infinite is Avacheda). విశాలాకాశము మనకు పరివ్యాప్తముగ భాసించుచున్నది. ఒక కుండ లోపలి భాగము నందంతయు ఆ యాకాశమే యున్నది. ఐనను కుండయొక్క పరిమితిని బట్టి అందు వ్యాప్తమైయున్న ఆకాశము పరిచ్ఛిన్నమైనదివోలె భాసించును. దానిని ఘటాకాశమను చున్నాము. చైతన్య మనంతము (Infinite), అంతఃకరణము కుండవలె చిన్నది. అందలి ఆకాశము పరిమితము (limited). ఆకాశమును పరిమితపరచు కుండవలె బ్రహ్మకు మనస్సు అవచ్ఛేదకము. కానీ, అంతఃకరణ సంబంధముచే చైతన్యముకూడ, ఘటాకాశమువలె, పరిచ్ఛిన్నమైనదివోలె భాసించును. కనుక ఈ అవచ్ఛేద వాదము బ్రహ్మను అంతఃకరణముతో జతపరచి ఆయనను పరిమితిగల వానినిగ రూపొందించి తెలుపు చున్నది.

అంతఃకరణమునకును చైతన్యమునకుగల మరొక విధమగు సంబంధమును బింబ ప్రతిబింబవాదమున మనము తెలిసికొందము. అది ఉపహితత్వము – అనగా కూడియుండుట. ఈ కూడిక ఎట్లు పొసగి నట్టిది? యథార్థమున తాత్వికముగ కూడియుండకున్ననూ కూడియున్నట్లే తెలియబడుట ఉపహితమందురు. ఉదాహరణకు "కాకవంతో దేవదత్త గృహః" అనగా కాకి వాలియున్నదే దేవదత్తునిగృహము అన్నప్పుడు- కాకి వాలిన సమయమందేగాక, ఉత్తృణత్వము ఉపహితమగును. అనగా అది లేనప్పుడును చెదిరి పైకి లేచియున్న తృణవిశేషణముచే అది సదా కాకవంతమై దేవదత్తుని గృహమేయని వ్యవహరింపబడును. కనుక కాకవంతమనగా కాకోపహితమైన గృహము అని శాస్త్రభాషలో వ్యవహారము గలదు. ఈ చైతన్యము అంతఃకరణమునకు సంబంధించి యున్నట్లు దోపింపజేయుటయే ఉపహితభావము. అవచ్ఛేద బింబప్రతిబింబ ఆభాసవాదములు మూడింటిని శఙ్కరులు ఆమోదించిరి. ఏలనన, యీ

మూడు వాదముల యందును బ్రహ్మచైతన్యమునకు-అంతఃకరణమునకు గల సంబంధ రీతులు వివరింపబడినవిగాని విషయము మాత్రమొకటియే. గనుక, అవి ప్రాతిభాసికములుమాత్రమేయని తెలుపబడి, యీ యంతఃకరణముతోగల సంబంధము నపనయించుకొన్నయెడల పర్యవసించునది శుద్ధచైతన్యమే యని తెలుపుటచేతనే యోగ్యములుగ గ్రహింపబడినవి. అనగా "త్వం" పదవాచ్యుడగు జీవుని స్వరూపమును వివరించి, శోధించి, అంతఃకరణమునకు చైతన్యమునకు గల సంబంధము తాత్వికము (వాస్తవము) గాదని దెలుపును. సాధారణముగ జగత్తును గురించిన వ్యవహారములన్నియు అంతఃకరణము ఇంద్రియములద్వారా (ప్రమాణములద్వారా) ప్రమను (విషయ జ్ఞానమును) పొంది ప్రమాత యగునంతవరకు విపులీకరించునుగాని, అంతఃకరణమునకంటె అతీతమగు (Supramental or transcendental Principle) తత్త్వముగ కూడ జీవుడు భాసింపగలడని విస్పష్టముగ దెలుపవు.

3. బింబ ప్రతిబింబ వాదము : ఇందు మన సాధారణ అనుభవమునందలి యొక చిన్నవిషయమును ఉదాహరణగ దీసికొని విచారించినయెడల నొక ప్రధానసూత్రము స్ఫురణకుదెచ్చి దానితో బ్రహ్మస్వరూపమును చిత్రించును. ఈ వాదమునందలి భావము చక్కగా మనసుకు పట్టినయెడల "విశ్వందర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం" అను శ్లోకభావము సుబోధకమగును. ఒక వెన్నెలరాత్రియందు ఒక నిర్మలమగు సరస్సుగట్టున కూర్చొనిచూచిన ఆ నీటి యుపరితలమున చంద్రుని ప్రతిబింబము మనకు గన్పించును. నీటిపైని ప్రతిబింబమును ఆకాశమునందలి చంద్రబింబమును పరికించిన అదేయాకారము, అదేరంగు, అదే శీతల భావము మనకు స్ఫురించును. మనము మరల యీ గట్టున కొలనుకు ప్రతిముఖముగ కూర్చొని చూచినయెడల ప్రతిబింబము

గోచరించదు. అప్పుడు చేతిలో నొక యద్దమును బట్టుకొని చంద్రున కభిముఖముగా నుంచినయెడల మరల నట్లే ప్రతిబింబము గన్పించును. దీనినిబట్టి మనము గ్రహింపదగిన దేమన! (1) అనువగు నొక యుపాధి యున్నప్పుడే ప్రతిబింబము గోచరింపగలదు. (2) అది ఆ యుపాధి యందే అంతర్గతముగాని దానికన్న వేఱుగాదు. (3) చూచుటకు రూప మున్నను అది ప్రాతిభాసికమేగాని పారమార్థికముగాదు. (4) అదిదేని ప్రతిబింబమో ఆ వస్తులక్షణములనే స్ఫురింపజేయుననియూ తెలియును. ఈ యుపమానమునందు చంద్రబింబమునకు జలము, అద్దము ఉపాధులుగ నుపకరించినవి. ఈ యుపమానమును శాస్త్ర విషయములకు వర్తింప జేసి చూచుకొందము. మన యంతఃకరణ మొకసరస్సు వంటిది లేక అద్దము వంటిది. అనగా ప్రతిబింబ గ్రహణ యోగ్యమైనది. దీనియందు శుద్ధచైతన్యము జీవచైతన్యముగా ప్రతిఫలించినదని శాస్త్రము జెప్పు చున్నది. ఈ ప్రతిబింబమునే అంతఃకరణోపహిత చైతన్యమనియు లేక అందఱికి తెలియు పదము జీవుడనియు అందురు. కాని యొక చిన్న చిక్కుప్రశ్న నెదుర్కొనవలసి వచ్చుచున్నది. ఏమనగా ! చంద్ర బింబము మనకు కనిపించుచున్నది. గనుక అద్దమందు గన్పించినది చంద్రుని ప్రతిబింబ మనుకొన్నాము. కాని యీ యంతఃకరణ దర్పణము నందలిది, ఎవరి లేక దేని ప్రతిబింబ మనుకొనవలయును ? అని మనము ఎట్లు జూచినను బింబమేదియు గన్పించుటలేదే ? బింబము గోచరించక ప్రతిబింబమనునది భాసించుటనే భ్రమయందురు. ఇచ్చట తెల్లని స్ఫటిక మున్నదని, దానికి కొంచెము దూరమున నొక ఎఱ్ఱని గులాబి యున్నదను కొనుడు. ఆ గులాబియొక్క వర్ణవిశేష ప్రభావముచేత ఈ స్ఫటిక మెఱ్ఱగా గన్పించును. ఒకటి దాని రంగు మరియొక దానియందు భాసించుటనే అన్యథాఖ్యాతియందురు. గులాబీని తీసివైచిన స్ఫటికము స్వస్వరూపముననే గోచరించును. పూవు నచ్చటనే యుంచి దానికొక మరుగు నేర్పాటుజేసి,

వెట్టని పువ్వొక్కటి యున్నదను భావము మనకు స్ఫురింప కుండునట్లు జేసిన స్ఫటికమునందలి యెఱ్ఱదనము ఆ స్ఫటికమునకు నైసర్గికమే యని మనము భ్రాంతినొందుదుము గదా! ఇది యిట్లుండ బింబమగు శుద్ధ చైతన్యము మనకు కనిపించినదనే అనుకొందము. అప్పుడు యీ బింబము, అహా! సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, మాయాశక్తిని తన వశము నందుంచుకొని సృష్టి స్థితిలయములకు సమర్థుడుగ నున్నాడు— ఈ ప్రతిబింబించిన చిన్నదేవుడు లేక జీవుడు దేశకాలములకు పరిమితుడు, కించిజ్ఞుడు, పుట్టుమన్నాను చచ్చుచున్నాననుకొనుచున్నాడు, సుఖదుఃఖ భోక్తగానున్నాడు— ఆ బింబమునకి విరుద్ధ గుణసంపన్నుడగు ప్రతి బింబమేమిటయ్యా? అనిపించును. అయితే ప్రతిబింబమునకు ఆధారము ఉపాధియని గ్రహించినాము గదా! మరి ఈ ప్రతిబింబమును ప్రకాశింప జేయు ఉపాధి అగుఅంతఃకరణము రాగద్వేషయుక్త మలిన సత్వరూప మగునది గదా! ఈ మలినములో కాలుపెట్టు చిన్నదేవుడు, కొన్ని జన్మల వాసనలు, సంస్కారములు, మూటగట్టుకొని వాటిని ప్రారబ్ధ రూపమున ననుభవించుటకుగదా ఈ ఊబిలో కాలుపెట్టుట? కనుక ఈ యుపాధియే ఈయనకు గిరి గీయుచున్నది గాని, లేనియడల ఆయనంత (బింబమంత) బ్రహ్మాండ నాయకుడే, విశ్వనాథుడే, యీయన కూడను. కనుక యిక్కడ విశేషమేమన యీ ప్రతిబింబముగా మనము పోల్చి తెలుసుకొన్నది బింబాంతర్గతమే, చైతన్యమగు సత్య వస్తువేగాని ప్రాతిభాసికముగాదు. అది ఆత్మయే-సర్వాత్మయే. అద్దమునందలి, జలము నందలి ప్రతిబింబములు ప్రాతిభాసికములేగాని సద్రూపములుగావు. ఇదియే మనము గ్రహించవలసిన సత్యము. ఏలయన యిచ్చట మనకు కనిపించని సర్వవ్యాప్త బింబము గలదు. ఈ స్ఫురించు ప్రతిబింబము యొక్క గుణములు నైసర్గికములుగావు. అనగా ఈ చిన్నదేవునికి (జీవుడు) ఆ పెద్దదేవునికి (ఈశ్వరుడు) గల అంతఃకరణ, మాయ

యను ఉపాధులచేత భేదభావము స్ఫురించునుగాని వస్తుతత్త్వ రీత్యా భేదభావములు లభింపవు. ఈ యుపాధులునూ ఆరోపితములేగాని పారమార్థికములుగావు. ఇది ప్రబోధచే గ్రహించిన వారికి చిన్నదేవుడూ లేడు, పెద్దదేవుడింకొకడు లేడు. అంటే బింబము ప్రతిబింబము, ఒక్కటే. పూర్ణముగ, నిద్వైతచైతన్యముగనే తెలియబడును. తత్త్వమసి వాక్యార్థమే సిద్ధించును. ముఖ్యభావము : ఉపాధియందున్న జీవచైతన్యము ప్రతిబింబమని మనము బోధనా సౌలభ్యము కొఱకు చెప్పకొన్న, ఉపాధి రహిత సర్వాత్మక చైతన్యముకన్న అది వేరుగాదని తెలియుటయే. అజ్ఞాన దోషమున్నంతవరకే భేదభావము స్ఫురించును. రేడియో ప్రసారములలో అప్పుడప్పుడు వినవస్తూ ఉంటుంది. ఈ చిన్నపాటను పాడుకుంటూ ఉందాము.

శ్లో॥ యద్వత్తోయే చంద్రద్విత్వమ్ ।
తద్వద్బ్రహ్మాణిఖిలు జీవత్వం ।
యద్వన్మనసే ప్రతిబింబత్వమ్ ।
తద్వద్బ్రహ్మాణిఖిలు జీవత్వం ॥

God reflects himself (in His Universal mind) as eeva. If you rise above the mind (నీవు దక్షిణామూర్తి వైన) ou are He in his entirity.

ఈ అవచ్ఛేద, బింబప్రతిబింబ, ఆభాసవాదములు జీవుడు ప్రమాత ాత్రమేగాదు - ఒక భూమికయందు అంతఃకరణ కంటే విలక్షణుడగు క్షచైతన్య తత్త్వముగ భాసింపగలడని తెలుపును. ఆ యంతఃకరణము ం చైతన్యమునకు [illegible] సంబంధ మున్నట్లు తెలియబడినను స్తవముగ అట్టి సంబంధము లేనిదియే యగునని యీ వాదముల

యందలి భావము. కనుక జీవునియందలి జీవత్వము అనిర్వచనీయ తత్త్వమే యగును. వాస్తవముగ జీవుడు శుద్ధచైతన్య రూపమగు సత్తత్త్వమే యనియు, చైతన్యమునందు గల్పింపబడిన జీవత్వమపవదింప బడిన తెలియబడునది అద్వితీయ చైతన్యమేనని యు సారాంశము. జీవునకు అంతఃకరణమునకు గలది ప్రాతిభాసిక సంబంధమేగాని పారమార్థికము గాదు. ఆ సంబంధమును తొలగించుకొనిన ప్రమాతపరమాత్మయే యగునని గ్రహించుట కీ వాదము లుపకరించును. కాశ్మీరులు కూడ జీవుని ఈశ్వర ప్రతిభాసమనియే (appearance) అంగీకరింతురు. కాని, ఇది విభూతి పూర్వకము. వేదాంతులన్ననో మిథ్యా ప్రతిభాసమందురు. కనుక వీరికి అభేద ప్రతిపత్తి కుదురును. కాశ్మీరులకు భేద ప్రతిపత్తి ముందుగా ఏర్పడి పిమ్మటగాని అభేద ప్రతిపత్తి కుదురదు. కనుక వారిది భేదాఽభేద అద్వైతవాద మందురు. అందుచేత జగత్ప్రక్రియలోని ఆభాస వాదమున విభూతి (manifestation) అని కాశ్మీరు లెట్లు భేదించిరో జీవప్రక్రియ లోని ఆభాసవాదమున సైతము వారిది పృథక్ దృష్టియే. కాశ్మీరులది స్వాతంత్ర్య వాదమందురు. ఇది వివర్తమూగాదూ పరిణామమూగాదు. భాస్కరుని భేదాఽభేద వాదమును నింబార్కుని ద్వైతాఽద్వైతమును ఒకే వర్గమునకు చెందినవి. కాని నింబార్కుని బ్రహ్మము సగుణము, సవిశేషము. భాస్కరుని బ్రహ్మము, నిర్గుణము, సవిశేషము. ఏది ఎట్లున్నను ఈ భేదాఽభేదవాదము అద్వైత పరమగు భావములకును, ద్వైతపరములగు భావములకును కొంత సామరస్యమును కల్పించి సమర్థించినట్లే దోచుచున్నది. బ్రహ్మయును జీవుడును భిన్నాఽభిన్నులను భావముచే భేదాభేదాఽద్వైతము సిద్ధించుచున్నది. మరియు బ్రహ్మ సగుణమును నిర్గుణమును అగుటచే ద్వైతాద్వైతమను పదము సిద్ధించు చున్నదీ.

2 వ వి భా గ ము

## జీవతత్త్వ ఈశ్వరతత్త్వవాద సమీక్ష

జీవతత్త్వ విషయమున పై చెప్పబడిన ఆభాసవాదము, అవచ్ఛేద వాదము, ప్రతిబింబవాదములు అద్వైత సిద్ధాంతాను గుణములే. జీవునకు ప్రమాతృత్వము మిథ్యయనియు, ప్రత్యగాత్మత్వము తథ్యమేననియు, గాన, ప్రత్యగభిన్నబ్రహ్మత్వము జీవునకు పారమార్థికమనియు పై వాద ప్రతిపాదకులు మువ్వురును అంగీకరించి యుండిరి. ప్రమాతృత్వ నిరూపణమున మాత్రము వీరికి భంగిభేదము కలదు. మాధ్వరామానుజీయ వాల్లభ నింబార్కాది సాంప్రదాయక భేదవాదులన్ననో జీవతత్త్వ విషయమున ప్రత్యేక వాదమును లేవెత్తించిరి. (1) జీవుడు పరమాత్మయొక్క స్వరూపాంశము గాదనియు (2) అస్వరూపాంశముగాన పృథక్చేతన మనియు (3) అణుపరిమాణుడేగాని మహత్పరిమాణుడు గాదనియు మోక్షావస్థలో కూడ నితడు అణుమాత్రుడేయనియు (4) సహయుజ్యోర్భావ స్సాయుజ్యమ్' అనిన చొప్పున ఇతనికి పరమాత్మతో భోగమాత్ర సామ్యరూపమైన సాయుజ్యమేదప్ప, ఏకీభావాత్మక సాయుజ్యము పొసగ దనియును ఈ భేదవాదులందరును ఏకకంఠముతో వాదింతురు. (సహయుజోర్భావమన ఇద్దరు కలిసి తుల్య భోగమును అనుభవించుట).

ఈ భేదవాదుల భావము లిట్లుండ జైనమతస్థులు జీవునకు మధ్యమ పరిమాణమును మన్నించెదరు. అనగా శరీరమాత్ర పరిమాణమును జెప్పుదురు. ఎంతటి శరీరమున అంతటి పరిమాణము గలవాడై యుండు నందురు.

జీవుని ప్రత్యగాత్మనుగా, కనుకనే మహత్పరిమాణుడుగ అంగీకరింపని పై వాదులు భ్రాంతులనియు, వీరి నిర్ణయముల ప్రతిష్ఠితములనియు, "దేహం ప్రాణ మపీంద్రియాణ్యపి చలాంబుద్ధించ శూన్యం విదుః స్త్రీ బాలాంధ జడోపమా స్త్వహమితి భ్రాంతాభృశంవాదినః మాయా శక్తి విలాస కల్పిత మహావ్యామోహ సంహారిణే" అనెడి పద్యమునందు నిరసింపబడినవి. జీవుడు ప్రత్యగభిన్న బ్రహ్మమేగాక మహత్పరిమాణుడే యని సిద్ధాంతము.

## ౩ వ. వి భా గ ము

## జాతీశ్వర - నియతేశ్వర వాదములు

ఇక ఈశ్వరతత్త్వ విషయక వాదభేదములగూడ ఇంచుకంత విచారింతము. పూర్వోక్తభేదవాదులు జీవేశ్వరులకు అత్యంత భేదమును అంగీకరింతురు, ఈ భేదము కేవలము తాత్వికమైనదేగాని మిథ్యాభూతమైనదిగాదు. కనుక జీవేశ్వర చేతనములకు వైజాత్యమేగాని సాజాత్యమెంతమాత్రమును కుదురదు. అనగా చేతన తత్త్వమునందు జీవజాతియొకటియు, ఈశ్వరజాతి యొకటియు గలదను ద్వైవిధ్యము ప్రాప్తించుచున్నది. ఇట్టి ఈశ్వరుడే జాతీశ్వరుడని భావింపబడినాడు. ఈ భేదవాదులు తమ జాతీశ్వరుడు సర్వదా మూర్తిరూపుడనియు, ఈ మూర్తి సైతము శివకేశవాది రూపమున నియతరూపుడేగాని యథేష్టముగ భావింపదగినవాడు కాడనియు వీరి మతసరణి కనుకనే భేదవాదులందరి శైవులు శివమూర్తిని, వైష్ణవులు విష్ణుమూర్తిని, ఇట్లే శాక్తులు, సౌరులు వైనాయకు[illegible] [illegible]గువారు వారివారికి అభిమతులైన నియత మూర్తులనే

ఈశ్వరజాతి మూర్తులుగ, తదితర మూర్తులను జీవజాతి వారినిగను నిర్ణయించుకొనిరి. ఇట్టి వీరి సాంప్రదాయములకు జాతీశ్వర వాదమనియు నియతేశ్వర వాదమనియు కోవిదులెన్నెదరు.

మరియును భేదవాదులు తమ ఈశ్వరుడు సగుణుడు నిర్గుణుడును కూడనై యున్నాడందురు. కళ్యాణగుణ సహితుడుగాన సగుణుడనియు, ప్రాకృతగుణ రహితుడుగాన నిర్గుణుడనియు చెప్పుదురు. ఈ సరణిని ఉభయలింగత్వ మందురు. అనగా ఉభయలక్షణ లక్షితుడని భావము.

ఇంకనూ భేదవాదులు కొందరు తమ ఈశ్వరుని, జగత్తునకు కేవలము నిమిత్త కారణునిగా అంగీకరింతురు. కొందరు నిమిత్తో పాదాన ఉభయ కారణునిగా అంగీకరింతురు. మొదటి పక్షము తటస్థేశ్వర వాదమనియు రెండవ పక్షము ఉభయకారణ వాదమనియు జెప్పబడు చున్నవి.

ప్రకృతము శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమున ప్రతిపాదింపబడిన ఈశ్వరతత్త్వము పై భేదవాదుల ఈశ్వర తత్త్వముకన్న విలక్షణ మైనది. ఈయన ప్రత్యగాత్మయే గాన జీవాభిన్నుడే. కనుక జాతీశ్వ రత్వము ఈయనకు లేదు. అఖండాద్వితీయ చైతన్య స్వరూపుడు. కనుకనే ఏతదభిన్నుడగు జీవుడు అణుపరిమాణుడుగాని మధ్యమ పరిమాణుడుగాని కానేరడు. మహత్పరిమాణుడే యగును. మరియును ఇతడు ప్రధానముగ అమూర్తియు నిర్గుణుడును— "సాక్షిచేతా కేవలో— నిర్గుణశ్చ" అనిగదా చెప్పబడినది. మాయావీవ (వత్రె) మహాయోగీవివ, దేశకాల కలనా వైచిత్ర్యాచ్చిత్రీకృతం జగత్ విజృంభయతి" అని మాయా వశమున నితడు సగుణుడుగాను, సాకారుడుగను, భాసించునేగాని పరమార్థతః నిర్గుణుడు నిరాకారుడును. "స్ఫురణం సదాత్మకమ్,

మహాదీప ప్రభాభాస్వరం, జ్ఞానమ్" అనినట్లు ఈయన స్వరూపము కేవలము ప్రజ్ఞానాత్మకమైనదే అగును. కనుక ఈయన ఉభయలింగి యనుట ఉపపన్నముగ లేదు. పారమార్థిక మూర్తిత్వము లేదు. గాన నియతమూర్తి వాదము వర్తించదు. శ్రీ దక్షిణామూర్తి యను పదమున కిట్లు పరమార్థ దృష్ట్యా నిర్వచనము చెప్పబడినది చూడుడు:- 1. శ్రియా= అనాద్యచింత్య మాయాశక్త్యా: దక్షిణః = సృష్టిస్థిత్యంత, విరచనా నిపుణశ్చ; 2. అసౌపరమార్థతోఽమూర్తిశ్చ ఆకార విశేషరహితః— అస్థూలమనణు ఇత్యాదిశ్రుతేః॥ అని. అనాద్యచింత్య మాయాశక్తి యుతుడై, నియతమైన యెట్టి మూర్తియునూ లేనివాడై, సృష్టిస్థితి లయములను నిర్వహింపజాలిన అఖండ నైపుణ్యము గలవాడు అని భావము. కనుకనే అద్వైత పరబ్రహ్మమున కెట్టి నియతమూర్తియు లేదు. "స్యాత్ పరమేశ్వర స్యాఽపి ఇచ్ఛావశాత్ మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్"॥ అని స్వేచ్ఛానుసారము సాధకుల ననుగ్రహించు టకై ఆ యా మూర్తుల నీశ్వరుడు తాత్కాలికముగ పరిగ్రహించునేగాని, ఆయనకు నియతమూర్తిలేదు అనియే వేదాన్త సిద్ధాన్తము.

మరియు జగత్కారణత్వ విషయములో అభిన్న నిమిత్తోపాదానత్వ మునే ఈశ్వరునకు వేదాన్తులు నిర్ణయించిరి. కాని ఈ ఉభయకారణత్వము విశిష్టాద్వైతులు భావించునట్టిదిగాదు. వారు, మాయను ఉపాదానమనియు, ఈశ్వరుని నిమిత్తమనియు, ఈ ఉభయ తత్త్వములును ప్రత్యేకములే యైనను అపృథక్సిద్ధములు, పరస్పరానపేతములును గాన, ఈశ్వరుడు ఉభయకారణుడగు నందురు. వేదాన్తులు ఈశ్వర మాయలు పృథక్తత్త్వ ములు గావనియు, మాయ పరమాత్మయొక్క స్వరూపశక్తియే యనియు, కనుక ఉభయవిధ కారణత్వ మీయనపట్ల కేవలమొక్కనితే చెల్లుననియు పరిష్కరించిరి. "తమేవభాన్త మనుభాత్యే తత్సమస్తంజగత్" —

వ్యావృత్తాస్వను వర్తమానమ్" కార్యకారణతయా మాయాపరిభ్రామితః"-నాన్యత్కించన, విద్యతే విమృశతాం యస్మాత్పర స్మాద్విభోః" అని బహుధా ఏకాత్మకమైన ఉభయ కారణత్వము నిర్దేశింపబడినది.

సారాంశమేమన— వేదాన్తుల పరమేశ్వరుడు అద్వితీయుడు, అగుణుడు, అమూర్తి, కార్యకారణ భావాతీతుడు. ఇతడే ప్రత్యగాత్మ— సర్వద్వైతరూపుడు ఇది ఈతని అచింత్య మాయా వైభవము.

శ్లో॥ నిధయే సర్వవిద్యానాం భిషజే భవరోగినామ్
గురవే సర్వలోకానాం దక్షిణామూర్తయే నమః॥

---

## అద్వైత సిద్ధాన్త ప్రముఖ సూత్రములు

పరబ్రహ్మ ఔపనిషదతత్త్వము. ఐనను, ప్రత్యక్షానుమానాది ప్రమాణములు ఉపనిషత్ప్రమాణోపజీవ్యములు మాత్రమే గనుక "తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి ఇతి" అనగా ఉపనిషత్ప్రతిపాదిత పురుషని గూర్చి అడుగుచున్నాను చెప్పుడని మైత్రేయి యాజ్ఞవల్క్య మహర్షి నడిగెను. ఆయన యిట్లు చెప్పెను.

(1) జగన్మిథ్యాత్వం— "మాయామాత్ర మిదం ద్వైతం। అద్వైతం పరమార్థతః" (మాండూక్యము). స్ఫురించునది బ్రహ్మ (ద్వైతము), నామరూపములు మిథ్య. ముందు మిథ్యాత్వమును దెలిసికొని, స్ఫురణ మును త్రోసిపుచ్చిన, అభాసగా గోచరించునది వివర్తమని తెలిసి ఆ స్ఫురణ బ్రహ్మగా గ్రహింపనగును.

(2) బ్రహ్మము అపరిణామి— గనుక బ్రహ్మేతరమగు జడ ప్రకృతి అవస్తువుగను గ్రహించిన విశ్వప్రతీతి, వివర్త వికారమనియే తెలియనగును.

(3) శూన్యము జగత్కారణము గానేరదు. నిరధిష్ఠాన భ్రాంతి ఉపపన్నముగాదు. రజ్జుసర్పాది భ్రాంతి సాధిష్ఠానముగనే యున్నది. ఇట్లే జగద్విషయక భ్రాంతియు సాధిష్ఠానమే. ఈ యధిష్ఠానము బ్రహ్మయే.

(4) "జీవో బ్రహ్మైవనాఽపరః" ఇది బ్రహ్మజీవవాదము. "జీవయతి ఉజ్జీవయతి దేహాది సంఘాతమితి. జీవః" అనెడి వ్యుత్పత్తితో పరమార్థ చైతన్యమే జీవసంజ్ఞతో గ్రహింపనగునని నిర్ధరింపబడెను.

(5) "ఆత్మాహి బ్రహ్మ" మన స్వస్వరూపమే బ్రహ్మము. స్వస్వరూపమును దేహేంద్రియ బుద్ధ్యాదికముగ తాదాత్మ్య ధ్యాసవలన ప్రమాదపడుటచే, ఆత్మయే బ్రహ్మమన అవగతముగాదు. దృశ్యదేహమున కంతకును జ్ఞాతగా నుండెడి చైతన్యమును ఆత్మగా గ్రహించితిమేని జ్ఞాతృత్వముకూడ అచింత్యమని బోధపడును. అపుడు జ్ఞేయమైన ఉపాధి మిథ్యగా తెలియును. జ్ఞానము మాత్రమే స్వాత్మయని అనుభూతమగును.

(6) "నవయం కార్యకారణయో రభేదం బ్రూమః । కింతు భేదం వ్యాసేధామః" అనగా అద్వైతమున కారణమొకటే సత్యము. కార్యమసత్యము కనుక జగత్తుకు కార్యకారణ భావముపపన్నముగాదు; అది మిథ్య. కనుక ఈ రెంటికి భేదమును నిషేధించి, కారణ రూపమున నున్న దొకేటక పదార్థమని నిర్ధరించుట.

(8) వివర్తమున నొక సునిశిత విషయము గమనించుటావశ్యకము. అది ప్రమాతృ వివర్తము, సాక్షి వివర్తముల యందలి సునిశిత భావము. ప్రమాతయన అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యము, ఇదియే జీవసంజ్ఞ. ఈ జీవుడు అవిద్యాదశలో శుద్ధచైతన్యమును దేహేంద్రియాదులుగ గోచరించు కొనును. ఇది ప్రమాత్రాఽధ్యాస లేక ప్రమాతృ వివర్తము. సాక్షి యన అంతఃకరణమునందలి ప్రతిబింబమునకు బింబము. దీనికి సంజ్ఞ ప్రత్యగాత్మ లేక సాక్షి. శుద్ధచైతన్య రూపుడగు నీసాక్షి దృష్ట్యా దేహేంద్రియ బుద్ధ్యాదులు కేవల స్వవివర్తమే; యోగి తనయందలి కల్పించుకొనెడి ఆవరణము వంటిది. ఇది స్వాతంత్రావరకము లేక స్వాతంత్ర్యాధ్యాస లేక స్వతంత్ర వివర్తము అనబడును.

సూత్ర వివరణ : వేదాన్త శాస్త్రమునకు వస్తువు జగత్తు-జీవుడు-పరమాత్మ, మూడుగా తెలియబడుచున్న ఈ తత్త్వములకు గల పరస్పర సంబంధము, లేక కార్యకారణ సంబంధము, ఈ విషయముల విమర్శించి గ్రహించుటకు ప్రముఖ సిద్ధాంతములు మూడు గలవు. అవి ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము.

అద్వైతము : బ్రహ్మతత్త్వము నుండి జీవజడ తత్త్వములను విడదీసి తెలియవచ్చుననుప్రసక్తిలేని సిద్ధాంతము. ద్వైతము : ఈశ్వరున కతిరిక్తముగ (అంటనివై) జీవజడములున్నవి గనుక వానిని విడమరచియే గ్రహించవలెనను సిద్ధాంతము. విశిష్టాద్వైతము : జీవజడములనునవి ఉన్ననూ పరమాత్మను **అంటియుండి** విడిపరచి చెప్ప వీలులేదను సిద్ధాంతము. అనగా జీవజడ విశిష్టుడు పరమాత్మ అని చెప్పు సిద్ధాంతము.

భూమిక : పరమాత్మ విషయమున శ్రుతిని ప్రమాణముగ* నంగీకరించి— ఆయన అనంతుడు (Infinite) కేవలుడు అద్వయుడు

(The only one without a second) అనగా ఏకైక తత్త్వమని విశ్వసించవలయును. "నేహ నా నాస్తి కించన" అను శ్రుతియే యిందుకు ప్రమాణము. ఆ తత్త్వము త్రికాలాబాధ్యము. అనగా తాత్త్విక సత్యము ఇదియే చైతన్యము అనగా జ్ఞానము. అందుచే దృక్; కనుకనే స్వభావము ఆనందము. ఈ ఆనందానుభూతియే తత్త్వశాస్త్ర పఠనమునకు లక్ష్యము. అందుకు సాధన అత్యంతావశ్యకము.

(I) విశ్వము : అనగా దృశ్యము (భూగోళ సూర్యచంద్ర నక్షత్ర గ్రహాదులు). ఈ విశ్వమంతయు శుద్ధచైతన్య వివర్తము. వివర్తమన విశేషముగ భాసించునది: చైతన్యాంతర్గతమే (Immanent). చైతన్యమే అధిష్ఠానముగ, దానియందే విమర్శగ భాసించునది. విమర్శయన భిన్నత్వమును భాసింపజేయు అనాదియగు అజ్ఞానము. ఇదే పరాశక్తి— పదార్థగుణ, క్రియాత్మకము. ప్రకాశమన ఈ పదార్థ, గుణ, క్రియలనబడు వాని కేవలానుభూతి. ఈ విశ్వమంతయు చైతన్య తత్త్వాంతర్గతమే. అయినను, శక్తి ప్రభావముచే ఆ పరమాత్మకు బహిర్గతములుగనున్నట్లే స్ఫురణ నిచ్చుచున్నవి. అందుచే జగత్తు మిథ్య యందురు. మిథ్యయన అనిత్యమగు దానియందు నిత్యత్వబుద్ధి. ఇందుచే జగత్తుకు మిథ్యాత్వము ఔపచారికము మాత్రమే. ఔపచారికమన ఒకరి లక్షణములు మరియొకరి యందు జూపట్టిన, అసలువాని పేరు ఈ లక్షణ యుక్తునికి ఆరోపించుట. ఉ॥ వాడు సింహమయ్యా! అనగా సింహముయొక్క సత్త్వము, స్థైర్యము, గాంభీర్యము గలవాడనుటయే. అందుచే ఔపచారికముగ మాత్రము జగత్తుకు మిథ్యాత్వము జెప్పబడినది. వ్యావహారికమున సత్యముగనే అంగీకరింపబడుటచే — జగత్తునందు నిత్యత్వ బుద్ధికి శాస్త్ర దృష్ట్యా మిథ్యాత్వము జెప్పబడెను. జగత్తు బ్రహ్మకంటే అన్యము గాదు. గనుక, బ్రహ్మకు జెప్పబడిన స్ఫురణమను లక్షణము జగత్తుకు

అన్వయించి జగత్తు స్ఫూర్తియనియు జెప్పనొప్పును. జగత్తునందు సత్యత్వ బుద్ధి (మిథ్య) ఆత్మాధిష్ఠానకభ్రమచే గలుగు నందురు. దీనిని ఆత్మాశ్రయ భ్రమయనుట యుక్తముగ దోచుచున్నది. మననముజేసి, ఏ పదమున కౌచిత్యము గలదో నిర్ణయించుకొనుడు. వివర్తమన అధిష్ఠాన మొకటియైయుండ— దృశ్యవస్తువు నందలి దోషము చేతనో, ఇంద్రియ శక్తుల యందలి దోషము చేతనో అజ్ఞానము పరిణమించి అధిష్ఠానముపై నొక అసత్య అనిత్యవస్తు స్ఫూర్తి గలుగుట యని విపులముగ గ్రహించనగును.

N. B. :- మహాభారతములోని కర్ణుడు భ్రమ. ఈయన ఒక దశలో సూతపుత్రుడు, మరొక దశలో అంగరాజు. సూతపుత్రుడుగ ఆత్మాధిష్ఠానక భ్రమ యుండుండును. ఇందు ఆత్మ అధిష్ఠానముగను ప్రమాత ఆశ్రయముగ నుండును. (ie) Ignorence not self evolved but super imposed by the Pramaata. అంగరాజుగ శాసించ గల సమర్థుడు. ఇది ఆత్మాశ్రయ భ్రమకు సామ్యము. ఇందు ఆత్మ అధిష్ఠానము. భ్రాంతి ఆశ్రయము. (This is self enolved and ordered to be super imposed by the self itself.) ఈ అధిష్ఠానక ఆశ్రయక పదములందు ఇంచుక భేదభావ ద్వైవిధ్యము గమనీయము, గణనీయము, గనుక ప్రమాతృ సాక్షి, వివర్తముల గ్రహించుటకు లాభపడును.

విశ్వము బ్రహ్మయందలి శక్తి పరిణామమేగాని కేవల పదార్థ పరిణామముగాదని తెలియుచున్నది.

శ్లో॥ ఆత్మన ఆకాశస్సంభూతః । ఆకాశాద్వాయుః ।
వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథ్వీ ।
పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోన్నం । అన్నాత్పురుషః॥

అని యిట్లు కార్యకారణముల క్రమముటంకించబడినది. కనుక సర్వాధిష్ఠాన మగు ఆత్మకంటె కార్యకారణములు భిన్నములు గావు. అద్వితీయ బ్రహ్మయే కార్యము, అదియే కారణము అని అభిన్న నిమిత్తోపాదాన కారణమను పదముతో (Intelligent cause immanent in the material cause) స్ఫుటీకరించిరి. జగద్దృష్ట్యా కార్యకారణములు భిన్నములు. ఆత్మదృష్ట్యా అభిన్నములు లేక అనన్యములు. కనుక జగద్విషయమున అజ్ఞానము పరిణామ్యుపాదాన కారణము. పరమాత్మ వివర్తోపాదాన కారణము అని సిద్ధాంతము; కనుకనే పరమాత్మ నిర్వికారుడు—(the changeless eternal principle,)

రెండు సత్యవస్తువులను అభేద రూపమున అంగీకరించుట ముఖ్య సామానాధి కరణ్యమందురు. రెంటిలో నొకదానిని మిథ్యగ తెలిసికొని అపవదించి ఒకేవస్తుతత్త్వము నంగీకరించుట బాధసామానాధి కరణ్యము. (what you perceive as effect is nothing other than the cause itself.) అనగా జగత్తు మిథ్యగా త్రోసిపుచ్చి బ్రహ్మనే ఏకైక సత్యపదార్థముగ అంగీకరించుట

శూన్యమునుండి సృష్టి జరుగదు : సర్వము సదాత్మకమే "యస్యైవ స్ఫురణం సదాత్మకి మసత్కల్పార్థగం భాసతే." దృశ్యము ననువదించి తరువాత అపవదించిన పర్యవసించునది శూన్యముగాదు, అధిష్ఠానమే— పరమాత్మయే. పరమాత్మ సర్వమున కధిష్ఠానము. ఈ సర్వమనబడున దంతయు ఆ పరమాత్మ యందారోపితము (Super imposition) అధిష్ఠానము లేనిదే ఆరోపమను పదమర్థవిహీనము. అధ్యారోపము, మాయాశక్తియందలి రజస్తమోగుణ ప్రభావములగుఆవరణ (veiling), విక్షేపపూర్వకము, the projection of a distorted thought అధిష్ఠానమును పరిగణించని హీనయాన బౌద్ధులు మాత్రము పర్యవ

సించనది శూన్యమని చెప్పుచురు. అద్వైతమునందు పరాఽపరాప్రకృతుల ననువదించి, ఒకటిగ భావించి తరువాత అపవదించిరి. కనుక అద్వైత స్థాయియందు ప్రకృతి యుండదు.

II) జీవుడు : వేదాన్తులు జీవుడు మహత్పరిమాణుడందురు. ఇది ఏకజీవవాదము. జీవుడు ఒక భూమికయందు ప్రమాతగ పరిగణింప బడినను మరొక భూమికయందు అంతఃకరణమునకన్న విలక్షణుడగు శుద్ధచైతన్య తత్త్వముగ భాసించు సదాత్మకుడే యని సిద్ధాంతము. అన్యోన్యాపేక్షవలన సత్తా, కారణకార్యములు రెంటియందును తెలియబడు చున్నది. ద్వైతులు అణుపరిమాణులగు బహు జీవవాదులు. జైనులు ఎంత పరిమాణముగల శరీరమున కంతపరిమాణుడగు జీవుడు ఉండు నందురు; ఇది మధ్యమ పరిమాణము. జీవుడు మహత్పరిమాణుడగు పరమాత్మయనిన భ్రమ ఎవరికి గలుగును? ఎవరికి నివర్తించి మోక్షము గలుగునన, అది ఆత్మాశ్రయక భ్రమయే గావున ఆత్మయందే అంతర్గత ముగ నుండి ప్రకాశింపబడుచు, నివృత్తి బొందుచుండును. స్వప్నావస్థకు వేదాంత శాస్త్రమున గల ప్రముఖపాత్ర ఈ సత్యమును హృదయంగమము జేయుటకేనని తెలియవలయును. *అద్దము జడము గనుక ప్రతిబింబ ప్రాప్తికొక బింబము నపేక్షించును. శంకరులిచ్చిన దర్పణము కేవల చైతన్య స్వరూపమే గనుక ప్రత్యేకమగు నొక బింబములేకయే, తన యందే, తన విమర్శ శక్తిచే ఆభాసను (a reflection like state) కల్పింప సమర్థము. తన ప్రకాశశక్తిచే వస్తు, గుణ, క్రియాత్మకమగు సద్దానిని ఎరుంగనూ శక్తుడే.

III) ఆత్మ : అద్వైతులు ప్రకృతిని ఒక తత్త్వముగ నంగీక రింపరు. పర-అపరా ప్రకృతులు రెంటిని ఒకే తత్త్వముగ అనువదించి

ఆ తత్త్వమును అపవదింతురు. "నిర్దోషంహి సమం బ్రహ్మ" అనగా సజాతీయ, విజాతీయ, స్వగత (Homogeneous, hetrogeneous, and ingrained) భేదముల పరిత్యజించి ఈ దోషములు లేని "సమ" శబ్దవాచ్యుడే బ్రహ్మయందురు. ఈ సమమే ఆధేయము, ఉపాధులాధార ములు. "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహ స్తిని శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః॥ (గీత V-18) అనగా సకలోపాధులయందును బాహ్యదృష్టికి తెలియబడనట్టియు, పండితునిచే మాత్రమే తెలిసికొనబడు నట్టిదియు అగు సమమను ఒకే వస్తువు బ్రహ్మ. అంతియగాని ఉపాధుల నన్నిటిని సమతత్త్వముగ మన్నించ వలయుననుటగాదు యిందలి భావము.

శ్లో॥ ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ
జగత్యాం జగత్ । తేనత్యక్తేన భుంజీథా ।
మాగృధః కస్యస్విద్ధనమ్ ॥

ప్రకృతి సర్వము పరమాత్మునిచే కప్పబడియున్నది; కనుక తేనత్యక్తేన భుంజీథాయన నామరూపముల నిషేధించిన శిష్టమగునది ఆత్మేశ్వరతత్త్వమే. అట్టి సత్ శబ్దవాచ్యమగు దాని అనుభూతి పొందుము. జగల్లక్షణములగు నామరూపముల త్యజించి అస్తి - భాతి - కనుక ప్రియం అను ఆత్మ లక్షణములుగల దాని అనుభూతి పొందుము. అన్యోన్యాపేక్షచే కార్యకారణములు రెంటికిని సత్తాసిశ్చితమే. ఎట్లన :

"చిదేవశక్తిః" అను దానిలో చిత్ యే శక్తి అని భావము, చిత్ యొక్క శక్తియని గాదు. శక్తి శక్తిమంతుల కనన్య బోధయే అద్వైతబోధ. ఇదియే కార్యకారణముల కనన్యతా భావము లేక అభిన్న నిమిత్తోపాదాన కారణము.

## ద్వితీయ భాగము

# జ్ఞానాష్టక స్తోత్ర శ్లోకములు : వివరణ

భూమిక : శ్రీ శంకర భగవత్పాదులు సమస్త మానవలోక సముద్ధరణ నుద్దేశించి అపార వేదాన్తశాస్త్ర హృదయమును గ్రహింప నాకాంక్షించు ముముక్షు జనప్రయోజనమునకునై "విశ్వందర్పణదృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం" అను శ్లోకముతో నుపక్రమించి "భూరంభాంస్యనలో నిలోంబర" మను శ్లోకముతో నుపసంహారముజేసి తొమ్మిది శ్లోకములతో, వేదాన్తగ్రంథకోటియందు చర్చింపబడిన విషయములు : జీవేశ్వర జగత్తత్త్వముల తాత్త్వికస్వరూపమును, వీటిపై మాయాశక్తికిగల ప్రభావమును, మాయాశక్తియొక్క విలాస, విలసన, ఆభాసలను మాయాప్రభావజనిత వృత్తిజ్ఞానముల లయింపజేయ, ప్రాప్య స్వరూపజ్ఞానము, సదాత్మకర ప్రజ్ఞానపూర్వక ఏకైక పదార్థానుభూతియు, సుస్వరూపజ్ఞానము, సదాత్మక ప్రజ్ఞాపూర్వక ఏకైక పదార్థానుభూతియు, సుస్పష్టముగ బోధింపబడెను. పూజ్యపాదు లీబోధల జేయునప్పుడు అచ్చట పరివేష్టించియున్న శిష్యులు, ఋషిగణము ఆ బోధలయందలి గంభీర భావముల తెన్నుగ గ్రహించియు నిష్ప్రతియోగిక బ్రహ్మాకారవృత్తిని ప్రాప్తించుకొనజాలనందున పరబ్రహ్మతత్త్వానుభూతిలేక యుండిరి. అందుచేత "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" అను ఉపనిషద్వాక్యభావమును బోధించుట కుపకరించు మౌన వ్యాఖ్యను ప్రదర్శించి జూపెను. అనగా మనస్సు, తన కల్పనా సామర్థ్యమును వాక్కుతో ఎంతవరకు ప్రస్ఫుటించి, తార్కికశక్తి కుంటుపడి, యిక నిస్సహాయముగ నిలిచిపోవునో — ఆ స్థాయియందు కేవల అనుభూతివలన మాత్రమే పరబ్రహ్మతత్త్వ సాక్షాత్కారము (అనుభూతి) అగునని

తెలుపుటకు మౌనవ్యాఖ్యను ప్రదర్శించెను. ఇచ్చట మౌనమన మానసిక, కాయిక, వాచక వ్యాపారరహిత పూర్వక సర్వేంద్రియమౌనమని తెలియ వలయును. వ్యాఖ్యయన వి + ఆఖ్య = వ్యాఖ్య, వి=విశేషముగ, ఆఖ్య = తెలియునట్లు, ప్రకటితం = వెలువరించుట. బ్రహ్మనుగూర్చి చెప్పుటకు శబ్దములుగాని, భాషగాని లేదని కేవలాఽనుభూతిచే మాత్రమే తెలియబడ గలదనియు సూచించుట. కేవల నిస్సంగత్వపూర్వక మగునదియే పర బ్రహ్మతత్త్వమని సూచించుటకు ప్రదర్శించిన ఒక దివ్యసమాధిస్థితియే ఈ మౌనవ్యాఖ్య. ఇది ఆవరణశక్తి తొలగకయే గలుగు జడసమాధిస్థితి (a trance of a higher order) గాదు. బ్రహ్మజ్ఞానముచే, మూలా జ్ఞానము నశించగా. తత్కార్యములగు జీవభావములు తొలగిపోవగా లభించు దివ్యసమాధిస్థితి. ఈ స్థితియందలివాడే ఆచార్యేంద్రుడు.

ఈ స్థితియందు మాత్రమే - పంచక్లేశములును తొలగిపోయి; చిత్తశుద్ధి పొందియున్న ముముక్షువులకు అనుగ్రహపూర్వకముగ (through divine grace) పరా వాక్ప్రసారముచే మాత్రమే మౌన వ్యాఖ్యాపూర్వకబోధ ఉపపన్నము అని నిశ్చయముగ గ్రహింపవలసి యున్నది. పంచక్లేశములన ;- అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశాః క్లేశాః" (యో।ద। 2—3) The five miseries are ignorence, egoism, attachment, aversion and clinging to life. These are to be conquered, only by their respective opposite concepts ఇవి ప్రతిపక్ష భావనాబలముచే మాత్రమే జయింపబడగలవు.

ఈ విధమగు మౌనవ్యాఖ్యచే ఉద్దిష్టబోధను గ్రహించి బ్రహ్మను భూతిని పొందినశిష్యులు తమ గురుదేవులగు శ్రీ శంకర భగవత్పాదులను. ముముక్షువుల తరింపచేయు దాక్షిణ్యవృత్తి స్వరూపుడగు పరమశివునిగ

దర్శించి శ్రీ దక్షిణామూర్తి యనిరి. వారికిగలిగిన అనుభూతిని "మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం" "సర్వాత్మత్వమితి స్ఫుటీకృత మిదం" అను శ్లోకములయందు పొందుపరచి, తమకు బోధింపబడిన తొమ్మిది శ్లోకములతో జతపరచి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రరూపమున మనకనుగ్రహించిరి. ఇందుచేతనే, బ్రహ్మవిద్యా హృదయగ్రహణమును, బ్రహ్మానుభూతిని ఆకాంక్షించు శిష్యులు ఉదాత్తమగు వృత్తిజ్ఞానముచే. తమతమ గురువులను శ్రీ దక్షిణామూర్తి తత్త్వముగనే సందర్శించి "నగురోరధికం - శివశాసనతః" అని నాలుగుమారులు ప్రవచించి తమ శాస్త్రపాఠముల నుపక్రమించుట సంప్రదాయమై స్థిరపడినది.

గనుక ముముక్షువులమగు మనమును మన చిత్తభాండముల శుద్ధి పరచుకొని మనగురువులను దక్షిణామూర్తి స్వరూపులుగ సందర్శించి శ్లోకభావములను ఆత్మ పంచన జేసికొనరయే, విశ్వసనీయముగనే గ్రహించి, సాధనలేనివారికి సిద్ధిమృగ్యమని విశ్వసించి, సాధన నుపక్రమించి. వేదాన్తమున చరమస్థాయిబోధగా శ్రీవారి శిష్యులు గ్రహించిన "మౌనవ్యాఖ్యను" "చిన్ముద్రను" మనమును గ్రహించి, అందుచే ప్రాప్యమగు సర్వాత్మత్వమును, సగుణ నిర్గుణపూర్వక బ్రహ్మానుభూతిని పొంది తరింప దీక్షను దీసికొందము.

మంగళాచరణము :

శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వంయువానం।
వర్షిష్ఠాన్తే వసదృషి గణై రావృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే॥

టీక :- బ్రహ్మనిష్ఠైః = బ్రహ్మవిచారణాశీలురగు; వర్షిష్ఠాన్తే వస దృషిగణైః = వృద్ధశిష్య మునిబృందములచే; ఆవృతం = పరివేష్టింప బడిన (చుట్టును కూర్చుండబడియున్న); మౌనవ్యాఖ్యా ప్రకటిత పర బ్రహ్మతత్త్వం = మౌనము అనెడి వ్యాఖ్యచే పరబ్రహ్మ పరమార్థ స్వరూపమును ప్రకటించుచున్న; యువానం = యువకుడగు; ఆచార్యేంద్రం = ఆచార్యశ్రేష్ఠుడు అగు; కరకలిత చిన్ముద్రం = హస్త మున జ్ఞానముద్రను ధరించినవాడును; ఆనందమూర్తిం = ఆనందమే స్వరూపలక్షణముగ గలవాడును; స్వాత్మారామం = తన ఆత్మస్వరూపము నందే తాను ఆనన్ద మనుభవించునట్టి; ముదితవదనం = సంతోషముతో వికసించిన ముఖము గలవాడును; (అగు), దక్షిణామూర్తిం = దక్షిణ దిగభిముఖుడగు పరమేశ్వరుని; ఈడే = (ప్రబోధ ప్రాప్తి కొరకు, ఆత్మానుభూతికొరకు) స్తుతించుచున్నాను.

తా॥ బ్రహ్మవిచారణా శీలురగు వృద్ధులైన మునిగణము చుట్టును కూర్చుండియుండి పరబ్రహ్మతత్త్వమును తెలియగోర, చిన్నవయసు వాడు, పరమేశ్వర జ్ఞానావతారమూర్తియునగు దక్షిణామూర్తి గురు దేవుడు, ఆత్మానన్దసంతుష్ట ముఖారవిందముతో, మాట్లాడకయే, ఉపనిష దర్థపరబ్రహ్మతత్త్వమును వివరించుచుండెను. జీవబ్రహ్మైక్య సూచకమగు అఙ్గుష్ఠతర్జనీ సంయోగరూప జ్ఞానముద్రను చేతధరించి చూపుచున్న అట్టి సర్వలోకగురుండు విద్యానిధియగు ఆ శ్రీ దక్షిణామూర్తిని జ్ఞానసముద్భవ మునకు స్తుతించుచున్నాను.

ఈ శ్లోకభావమును హృదయంగమముగ గ్రహించుటకు మననము జేయవలసిన ప్రధాన పదములు : 1. మౌనవ్యాఖ్య 2. ఆచార్యేంద్రం 3. చిన్ముద్ర.

వివరణ : బోధనా సౌలభ్యముకొరకు విషయమును గురుశిష్య బోధ్యబోధక ధర్మమును పెద్దలు పరిపాటించుట మనభారతీయ సంప్రదాయము. తదనుసారముగ ఈ స్తోత్ర ముపక్రమింపబడినది. దక్షిణాభిముఖుడై కూర్చొనియున్న యువకుడు దక్షిణామూర్తిగ, ఆయనచుట్టు వయస్సుచేతను విషయ పరిజ్ఞానముచేతను గొప్పవారు బ్రహ్మనిష్ఠులగు ఋషులు కూర్చొనియున్నట్లు, పరబ్రహ్మతత్త్వమును దెలిసికొన వారాకాంక్షించుచున్నట్లు, మానసిక చిత్రరచన జేయబడెను. ఆ చిత్రమున గురుస్థానము నలంకరించియున్న శ్రీ దక్షిణామూర్తి ఆచార్యేంద్రుడనియు, కేవలమౌనముతో, చిన్ముద్రతో మాత్రమే సూచనాపూర్వకముగ (Symbolic and suggestive method) గంభీరార్థ ప్రతిపాదకమగు నిగూఢతత్త్వమును బోధించినట్లు జెప్పబడెను. మౌనవ్యాఖ్యనుగురించి పైనవ్రాసిన భూమికయందు చర్చించి గ్రహించితిమి. ఇక ఆచార్యేంద్రుడన :- ఇంద్ర శబ్దమునకు ఇంద్రియదత్త జ్ఞానమును గ్రహించువాడనియు (జీవుడు), అట్టి ఇంద్రియ సంజనిత జ్ఞానమును నియమించి ఆయా ఇంద్రియముల జయించినవాడే "ఆచార్యేంద్రుడు" లేక గీతయందు పేర్కొనబడిన "స్థితప్రజ్ఞుడు" అనియు తెలియనగును.

ఇక చిన్ముద్రయన :

శ్లో॥ అంగుష్ఠ తర్జనీ యోగముద్రా వ్యాజేన దేహినాం।
శ్రుత్యర్థం । బ్రహ్మజీవైక్యం దర్శయన్నోఽ
వతాచ్ఛివః ॥

శ్లో॥ అంగుష్ఠం శాంభవం ప్రోక్తం తర్జనీ త్వంపదే స్థితం।
తయోరైక్యం తు యోగస్సంధి శ్చిన్ముద్రా
సా ప్రకీర్తితా ॥

అంగుష్ఠముతో (చేతి బొటన వ్రేలు) తర్జనిని (చూపుడు వ్రేలును) కలిపిచూపు ముద్రావిశేషమును చిన్ముద్రయందురు. "ముదం ద్రాతీతి ముద్ర" అనగా ఆనందభావ ద్యోతకమగు శారీరకచిహ్నము ముద్ర ఇట్టిదే నాట్యమునందలి భంగిమయును. నమస్తే ! అనినప్పుడు చేతులు ముకుళించిచూపుటచే ముదము గలుగుచున్నదిగదా ! ముద్రలన ఇట్టి ప్రమోదకారక శారీరక భంగిమలు. చిన్ముద్రయన జ్ఞానముద్ర. దీనిచే దేని విషయక జ్ఞానము ద్యోతకమై ముదము గలిగించుచున్నది ? అంగుష్ఠము "తత్" అనగా బ్రహ్మమును సూచించును తర్జని "త్వం" పదమును (శరీరధారియైన జీవుని) సూచించును. ఈ రెంటికలయిక పూర్ణభావస్ఫోరకము. అనగా సమస్త శ్రుతులకు జీవబ్రహ్మైక్యము నందే తాత్పర్యమని గ్రాహ్యము. ఈ కలయికతో లభించు పుచ్ఛము ఏకాత్మసూచకము మధ్యమనుండి చిటికెన వ్రేలువరకు గల మూడువేళ్ళు సచ్చిదానంద లక్షణ సూచకములనియు జెప్పుదురు. కనుక నీ చిన్ముద్ర తత్త్వమసి మహావాక్యమునకు రేఖారూపమగు భంగిమయని గ్రహింపవలయును. (A graphic representation of the identity of the ego and the Supreme principle). ఇది పంచకోశాఽతీతమగు తత్త్వసూచకము. చార్వాకులు అన్నమయకోశము వరకే పరిమితులు. దివ్యజ్ఞాన సమాజమువారు విజ్ఞానమయకోశమువరకు తత్త్వదర్శనమును జేసిరి. విశిష్టాద్వైతు లానందమయకోశమువరకు తత్త్వమును విస్తరించి గ్రహించిరి. శంకరు లానందమయకోశము నతిక్రమించి కోశరహితతత్త్వమును బోధించిరి.

వైదికవాఙ్మయమున జ్ఞానప్రబోధమునకు నాల్గు రీతు లున్నవి. 1 పదము 2 బీజము 3 సంఖ్య 4 రేఖ. దృశ్యమంతయు నామ రూపములనబడు రెండుతెఱగులుగ వ్యవహరింపబడును. అందు నామము

పద, బీజ, సంఖ్యాత్మకము, రూపము రేఖాత్మకము (graphic representation). 1. పదముచే చతుర్వేదములు, స్మృతులు, దర్శనములు గ్రహింపవలయును. అనగా నిది శబ్ద ప్రమాణ రూపము. ఇందుకు సంజ్ఞ "ఓం". 2. బీజము : అర్థసృష్టికి పూర్వము శబ్దసృష్టిజరుగునని శాక్తేయులు చెప్పుదురు. ఈశబ్దము (శబ్దమన నిచట అనాహతధ్వని యని గ్రహింపవలయును; వేదముగాదు) బీజాక్షరరూపమున నుద్భుద్ధమగును. ఇవియే మంత్రములకు మంత్రశక్తులకు మూలము. ఈ ధ్వనియే కుండలినిగా, మూలాధార చక్రమునుండి ప్రసరించి వర్ణమాల (అక్షర సముదాయము)గ రూపొందును. వీనినుండియే జ్ఞానము వటవృక్షముగ వర్ధిల్లును. వటవృక్షము అపారముగ విస్తరించగలదు. గనుక మనస్సుకు జ్ఞానమునకు లింగముగ (Symbol) పరిగణించిరి. శౌనకాదులు వట వృక్షముక్రిందనే తత్త్వబోధలు చెప్పినట్లు గ్రంథములయం దుదహరింపబడుచున్నది. కనుక బీజమనునది ఉపాసన కుపకరించు మంత్రమే. వీటినుండియే విజ్ఞానవికాసము ప్రాప్తించును. గనుక వీటిని బీజములని, యిందలి యక్షరముల బీజాక్షరములని వ్యవహరించుచున్నారు. 3. సంఖ్య ఇది బీజాంతర్గము. ఇది పదమునకు బీజమునకు అనుసంధానముగ నుపకరించును. వైదిక వాఙ్మయమునకు, సంఖ్యకు అవినాభావ సంబంధము గలదు. సంఖ్యచే తెలియబడునదే "ఛందస్సు". 1 నుండి 9 వరకుగల సంఖ్యలకు, వృత్తము నకు అతీతమగు సంఖ్యయే అనంతము (Infinite) దీనినే 'పర' యందురు. పరబ్రహ్మయన అనంతుడు.

4. రేఖ : ఒక పవిత్రభావమునకు, కాగితమ్ముపై, రూపము రేఖలతో (గీతలతో) వ్రాయుట (graph or a geometrical representation of a holy thought) ఈ రేఖలవలననే యంత్రములు, చక్రమువంటి చక్రములు సిద్ధములై, గంభీర భావస్ఫోరకములై

సాంకేతికములుగ నుపకరించుచున్నవి. శ్రీకృష్ణుని చక్రము అజ్ఞానమును భేదించునది. మంచి తాత్త్వికదృక్పథమును జూపునది గనుకనే "సుదర్శన చక్రమని ప్రశస్తికి వచ్చెను. కనుకనే మంత్రములచే ప్రభావితములై ఉపాసన కుపకరించు ఈ చక్రములు, యంత్రములు పవిత్రభావములకు, రూపకల్పన జేయబడిన ప్రతినిధులు. పద, బీజ, సంఖ్యలు నామమును. రేఖలు రూపమును స్ఫురింపజేయును. పై నాల్గురీతులలో రేఖావిధాన బోధకు ప్రాధాన్యము, ప్రాశస్త్యము గలదు. (తైత్తిరీయోపనిష దంతర్గత భావము.)

ప్రకృతము : దక్షిణామూర్తి యీ నాలుగురీతులలో నే రీతిని బోధింపగడంగెను ? నేను గ్రహించిన మేరకు 1. సమాధిస్థితిని సూచించు సర్వేంద్రియ మౌనముద్రతోను 2. అంగుష్ఠ తర్జనులు రేఖలుగా రచించిన చిన్ముద్రతోను. రేఖారీతిననే తెలుపవలసిన భావమును బోధించెను. ఇందు మొదటిది సాధనావిధానము. రెండవది జీవేశ్వరుల కభేదభావముతో తత్పద – త్వంపదముల కనన్యతను సూచించు పూర్ణభావ స్ఫోరకముద్ర. "పూర్ణమదః, పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే" యను సత్యమును రేఖారూపముగ బోధించెను. ఇదియే మౌనవాఖ్యా ప్రకటితమగురీతి గానిచో కేవల మౌన "వ్యాఖ్య" యెంత సునిశిత బుద్ధికిని ప్రయోజనము సమకూర్పజాలదేమోనని తోచుచున్నది. "It was a symbolic and geometrical representation that was pressed into service to convey the idea of Para-Bramha Tatwam and was known as maunavyakhya prakatitam. నామ, రూప, క్రియా వాచకములచే చెప్పసాధ్యపడని విషయముగనుక సమాధిస్థితి ప్రదర్శనతోనూ, చిన్ముద్రతోనూ బోధించెనని గ్రహించవలసియున్నది. పెదవివిప్పి చెప్పినయడల విశిష్టాద్వైతమే

సిద్ధమగునుగనుక అద్వైత బోధకు లక్ష్యమగు అపరోక్షానుభూతికి ఆచరణ యోగ్యము మౌనవ్యాఖ్యయే.

ఈ భావము నిక మననముచేతము. జ్ఞానసముపార్జనతో, స్వాధ్యాయముతో, సాధనతో కాలచక్రము పరిభ్రమించి పోవుచుండ, గడ్డములు పెరిగియు నెరసియు జడలుగట్టిపోయిన విద్వద్వరిష్ఠులగు ఋషులు, యువకుడగు దక్షిణామూర్తి చుట్టూ నేలచేరిరి? కాలచక్రము పరిభ్రమించి పోవుచున్ననూ ఆయన యువకుడుగనే యెట్లుండెను? విత్యకర్మాచరణకైనను, ప్రశస్తముగాదని చెప్పబడు దక్షిణదిక్కు కభిముఖుడై ఏల కూర్చుండెను? పెద్దలు యువకులచే నుపదేశమును గోరుటయం దర్థమేమి? వారికి గురు దక్షిణామూర్తి యెట్లు యేమి యుపదేశించెను? అను విషయముల మన మాలోచించినయెడల, జుట్టునెరసి, జడలుగట్టిననూ, దేహమున వలీపలితములు గన్పించిననూ, విషయపరిజ్ఞానము మెండుగ నుండిననూ, ప్రయోజనము గలుగదు. వారి యంతఃకరణము, సంపూర్ణముగ అంతర్ముఖమై, యింద్రియార్థముల సంపర్కమునుండి నివృత్తి బొంది, ఏకాగ్రమై కేవల బ్రహ్మాకార వృత్తినిపొంది, అనగా అపరోక్షానుభూతి పొందినప్పుడే, పరబ్రహ్మతత్త్వము బోధపడగలదని భావము. అది చిన్ముద్రచే సూచింపబడుచున్నదనియూ, గ్రహింపవలసియున్నది. సర్వేంద్రియ మౌనపూర్వకమగు సమాధిస్థితి నధిగమించినవారికే పరిపూర్ణుని ప్రాప్తప్రాప్తి తెలియబడునని భావము. దక్షిణదిక్కునకధిపతియగు యముని నిర్జించి మృత్యుంజయుడై త్రికాలాబాధిత సత్యరూపుడని తెలుపుటకే దక్షిణాభిముఖుడాయెను. అప్పుడు మాత్రమే స్వాత్మారామము నిరతిశయానందముతో గలుగు ముదితవదనము, దేశకాలముల భావముల కతీతుడు గనుక, సదా, యౌవన యువక స్థాయీభావములు సంభావ్యములు. సాధకునకు ఈ శ్లోకమున మననయోగ్యపదము "ఆచార్యేంద్రం"

అనగా ఆసన ప్రణాయామములచే ఏకాగ్రతనొంది, ప్రత్యాహారముచే యింద్రియముల సమీకరించుకొని, ధారణ, ధ్యాన, సమాధులచే తురీయావస్థను పొంది మనోలయముపొంది. సర్వేంద్రియములు మౌన స్థితికి వచ్చిన ఆచార్యేంద్రునకే అపరోక్షానుభూతి, బ్రహ్మానందప్రాప్తి యని భావము. ఇదియే అమృతత్వము నొందుట. "అమృతత్వమానశుః" అను వాక్య లక్ష్యార్థము.

కేవల జ్ఞానయోగమునే అంగీకరించు కొందరు, సాధనకు అష్టాంగ యోగమవసరముగాదు లేక అంగీకార యోగ్యముగాదు, ఉపాసనతో చిత్త శుద్ధి ప్రాప్తించిన పిమ్మట శ్రవణమనన నిదిధ్యాసలచే బ్రహ్మభ్యాసము జేయుటయే ఋజుమార్గమని వక్కాణింతురు. బ్రహ్మాభ్యాసమనః-

శ్లో॥ తచ్చింతనం తత్కథనం। అన్యోన్యం తత్ప్రబోధనం।
తదేవైక పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

ఇంకనూ నిర్గుణ బ్రహ్మోపాసనను జెప్పుదురు. అహంగ్రహోపాసనను జెప్పుదురు.

ఎట్లనిన :—

శ్లో॥ అహంబ్రహ్మ, పరంబ్రహ్మ। వాసుదేవార్చ్యమవ్యయం।
నారాయణోఽహం నరకాంతకోఽహం।
స్వయంబ్రహ్మ స్వయం విష్ణుః
స్వయందేవ స్సదాశివః ॥

శక్తిభేదమును రుచిభేదమునుబట్టి యోగ్యమని తోచిన భంగి అనుష్ఠించనగును. వ్యక్తిగతముగ నాకు మాత్రమష్టాంగయోగ సాధనయే

అభిలషణీయము. ఇందు అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహ విధానములు, ప్రాణశక్తిని పెంచి నియమించు విధానములు, కేవల బ్రహ్మాకార వృత్తి ప్రాప్యమగు సంయమన విధానము బోధింపబడి యుండుటయే యోగము నాకు గల్పించిన ఆకర్షణ. మహాతపస్సంపన్నుడై సాక్షాత్పరమశివసాక్షాత్కారానుభవము లభించిన భస్మాసురుడు, తాను అర్థించిన క్షుద్రాతిక్షుద్రవరము, తరువాత ఆ వరసిద్ధిచే పొందిన ప్రయోజనము యమనియమముల నభ్యసించని నందుననేమో యని నాకు స్ఫురించుచున్నది. (The rays of the midday sun can exercise the effect of heat only when passed through a double convex-lense and concentrated to form a speck of intensive heat; disseminated—they will be ineffective.)

చిన్ముద్రతో జీవబ్రహ్మైక్యబోధ జేయుటన అద్వైతసిద్ధాంతరేఖారూపబోధయే. కనుక నీస్తోత్ర మద్వైతసిద్ధాంతపరము. ఈ సిద్ధాంతమునకు "కార్యకారణవస్తువులకు అనన్యత దెలుపుటయే" లక్ష్యము. ప్రయోజనము జీవబ్రహ్మైక్యభావ స్ఫుటీకరణము. ఇందుకు శంకరులు వివర్తవాదమును ప్రతిష్ఠించి దానిని విపులీకరించుటకే మాయావాదమును ప్రతిపాదించిరి. ఆ మాయస్వరూప స్వభావములను దర్పణమునందలి ప్రాతిభాసిక ప్రతిబింబమును, ఇంద్రజాలికసృష్టిని, బాల్యయౌవనాది దశలను, బీజమునందలి అంకురము విస్తరించు విధానమును ఉదహరించి తెలిపిరి. సదాత్మకతత్త్వమును శాస్త్రీకదీప ఛిద్రఘటము నుపమానముగ నుదహరించి బోధించిరి. ప్రతిశ్లోకమునందును మాయాస్వరూపమును స్పృశించి జూపించిరి. చూడుడు :-

1. పశ్యన్నాత్మని మాయయా యని 1 వ శ్లోకమునందున
2. మాయావివ విజృంభయత్యపియని 2 వ శ్లో॥న

3. అసత్కల్పార్థగంభాసతే యని 3 వ శ్లో॥న
4. మాయాశక్తి విలాస కల్పిత మహావ్యామోహమని 7 వ శ్లో॥న
5. రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్. అని 8 వ శ్లో॥న
6. వ్యావృత్తాస్వను వర్తమాన మహమిత్యంత స్ఫురంతం. అని 9 వ శ్లో॥న
7. స్వప్నేజాగ్రతి వాయ ఏష పురుషో మాయాపరిభ్రామిత. అని 10 వ శ్లో॥న

ఇదియంతయు గమనింప కర్ణుడే లేని భారతమా యన్నట్లు-మాయకు వివరణ లేని వేదాంతశాస్త్ర మేమిటనిపించును. ప్రతి శ్లోకము నందును మాయయొక్క ప్రసక్తిని దెచ్చి దాని కార్యముల సూచించి నందున ఈ మాయను గురించి విశేషముగా గ్రహింపవలసిన అవసరము సుస్పష్టమగుచున్నదనుట ప్రధాన విషయము. ఈ విషయమున గ్రమించి ఆ మేలిముసుగును తొలగించిన ప్రత్యగాత్మవగు నీవే పరమాత్మవు, నీవే పశుపతివి అను రెండవ ప్రధానాంశము సుస్పష్టమగును.

ఈ భావమును చిత్తశుద్ధితో గ్రహించిననే భ్రాంతి యననేమో, దానిని తొలగించుకొని తన్నుతాను సాక్షాత్కరించుకొనుట యెట్లో తెలిసి అద్వైత సిద్ధాంత భావము స్థిరపడును. చరమ శ్లోకమున ఫలశ్రుతియందు "సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వం స్వతః" అను వాక్యమునగల "సర్వాత్మత్వము" అను పదమే నాలుగు మహావాక్యములకు యీ స్తోత్రమునకును లక్ష్యము. ఈ స్థితిని బొందుటకు సాధకుడు ఆచార్యేంద్రుడు గావలయును. అట్టి ఆచార్యేంద్రుడగు దక్షిణామూర్తిని అంతర్ముఖత కొఱకు, ఏకాగ్రతకొఱకు, బ్రహ్మాకారవృత్తి ప్రాప్తికొఱకు స్తుతించుచున్నాను. ఇక విషయ విచారణ కుపక్రమింతము.

# విషయ ప్రారంభము

శ్లో॥ విశ్వందర్పణ దృశ్యమాన
నగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా
బహిరివోద్భూతం యథానిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే
స్వాత్మానమేవా ద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమయిదం
శ్రీ దక్షిణామూర్తయే ॥ 1

టీక : దర్పణ దృశ్యమాన నగరీతుల్యం = అద్దములో కనుపించు నగరముతో సమానమగు; నిజాంతర్గతం = తనయందే స్ఫూర్తి గలిగియున్న; విశ్వం=జగత్తును; యథానిద్రయా=ఎట్లు నిద్రచేతనో (తథా=అట్లు): మాయయా = మాయాశక్తిచేత; ఆత్మని = తనయందు; బహిః ఉద్భూతమ్ ఇవ = వెలుపల నున్న దానివలె; పశ్యన్=చూచుచు; యః = ఎవ్వడు: ప్రబోధసమయే = బ్రహ్మసాక్షాత్కార సమయమున; అద్వయం = నిష్ప్రపంచమగు అనగా ఆత్మతత్త్వమగు; స్వాత్మానమ్ ఏవ = బ్రహ్మాఽభిన్న (సచ్చిదానన్ద) ఆత్మస్వరూపమునే; సాక్షాత్కురుతే = అవ్యవధానముగ అనుభవించునో, తస్మై = ఆ, శ్రీ గురుమూర్తయే = తత్త్వజ్ఞానోపదేశకాచార్యుడగు; శ్రీ దక్షిణామూర్తయే = శ్రీ దక్షిణామూర్తి కొఱకు; ఇదం నమః = ఈ నమస్కారము.

తాత్పర్యము : విశ్వము అనగా చరాచర ప్రపంచము. అద్దములో కనిపించు నగరమును పోలినదియై తనయందే యున్నది. నిద్రావశమున స్వప్నద్రష్టకు బాహ్యదేశము నందున్నట్లు తోచిన యట్లు, మాయా శక్తివలన, జాగ్రదవస్థయందును ఆత్మయందే, బాహ్యదేశము నందువలె స్ఫూర్తినిచ్చును. స్వప్నమును అనుభవించి తిరిగి జాగ్రదవస్థకు వచ్చినప్పుడు, అనగా మెలకువరాగానే ద్రష్టయగు ఆత్మ యొక్కడే మిగులును. స్వప్న ప్రపంచమంతయు అదృశ్య మగును. అట్లే బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము (ప్రబోధము) కలుగగా జాగ్రత్ప్రపఞ్చము లుప్తమగును. అధిష్ఠాన బ్రహ్మాత్మ సచ్చిదానంద స్వరూపము అనుభవగోచర మగును. అట్టి బ్రహ్మా త్మానుభవ సంపన్నుడైన గురుమూర్తి శ్రీ దక్షిణామూర్తికి ఈ నమస్కారము.

వి వ ర ణ :

ఈ స్తోత్రమునగల శ్లోకములకు యీ శ్లోకము మకుటము వంటిది. బీజమునందు అంకురము, మొక్క, చెట్టు, పత్ర పుష్పఫలములు కారణ రూపమున నున్నట్లు యీ శ్లోకమున అద్వైత సిద్ధాంత మౌలిక సూత్ర ములు గర్భితముగ నున్నవి. ఇందు "నిజాంతర్గతం" "యథానిద్రయా" అను పదములు మనన యోగ్యములు. జీవేశ్వర జగత్తులను అధ్యారోప త్రయము, సర్వాధిష్ఠానమగు పరమాత్మయందు అంతర్గతములే. కనుక జాగ్రదవస్థ యందును ఏవేవి ఏ ఏ రూపముల భాసించిననూ, ఏకాత్మయగు పరమాత్మ యందే వివర్తమున ప్రతిభాసించునుగాని 'ఏకమేవా అద్వితీయం' అన్నట్లు ఆ బ్రహ్మపదార్థము కేవలము ఒక్కటియే-దానికన్న రెండవది యగునది లేనేలేదు. ఆ భాసించు నామరూపములకు స్వతంత్ర సత్తలేదు. మాయాశక్తిచే ఆత్మకు బాహ్యదేశమున నున్నట్లు స్ఫురించిననూ ఆత్మాం

ర్గతములే: అన్యములుగావు. కనుక ఏకైక స్వరూపుడు సర్వాత్మ. ఈ భావములను తేటమాటలతో నిట్లు జెప్పవచ్చును. సూర్యచంద్ర నక్షత్ర ములతో దృశ్యమానమగుచున్న ఈ విశ్వము సర్వము అద్దములో మనకు గన్పించు పట్టణ ప్రతిబింబమువలె పరమాత్మయందు మాత్రమే భాసించు చున్నది. ప్రతిబింబించిన రూపము అద్దమునకన్న భిన్నముకాదు. అద్దము నందే అంతర్గతమై, దానినుండి వేరుజేయ వీలులేకున్నది. పోనీవస్తువు అందు లేదాయనిన పొడుగు, వెడల్పు, ఎత్తు అను మూడు కొలతలతో సహజ వర్ణములతోసహా మేధావుల మనుకొనుచున్న మనకే కనబడు చున్నదే. ఉన్నయెడల అద్దమునుండి విడిపరచుటకు సాధ్యముగ లేదే! పోనీలోపల యున్నదేమో అద్దమును పగులగొట్టి చూతమన్న, అద్దము పగిలిన యీ ప్రతిబింబమునకు ఆధారమే లేక అది అదృశ్యమే యగును. కనుక దానికి స్వాతంత్రసత్త లేదనియు తనకాధారమగు అద్దము నందే అంతర్గతముగ అద్దమునకు భిన్నముగాకయే యున్నదని పర్యవసించు చున్నది.

కనుక ఇప్పుడు విచారణీయాంశ మేమన :_ ఈ ప్రపంచమునకు వస్తుసత్త యున్నదా లేదా ? లేనియెడల నిది యథార్థముగ నున్నట్లే మూడు కొలతలతో నామ, రూప, గుణ, క్రియావాచక యోగ్యముగ ఎట్లు తెలియబడుచున్నది ? ఈ విషయమును విశదపరచుటకే "యథానిద్రయా" అను పదమును ప్రయోగించినారు. అజ్ఞాన దోషముతో గలిగిన నొక స్థితి నిద్ర. ఈ నిద్రయందు, జాగ్రదవస్థయందు గలిగిన యనుభవములు సంస్కార బలముచే వాసనలు (repressed reminiscences) కారణ రూపముగ నేర్పడి, మనస్సునందే స్థిరపడియుండి, వాని కుత్తేజము గలిగినప్పుడు ఆత్మసత్తా మాత్రముగ కలలుగ పరిణమించును. ఒక గ్రామఫోను రికార్డును పరిశీలించుదము. అందుగల గాడుల (grooves)

యందు సూది రాపిడిచే నుత్తేజము గలిగినప్పుడు శబ్దముద్భద్భవ మగు చున్నది. ఒక ఫిలిం రీలుపై దాని అంచున గల తేజోరూపమగు రేఖపై వెలుగు ప్రసరింపబడ, క్షోభప్రారంభమై, చలన చిత్రములు, మాటలు పాటలు, భావములు, భంగిమలు, నవరసములొలుక ప్రాదుర్భావము పొందును. అదియొక జగత్తే, చిత్రజగత్, జాగ్రత్ నందలిజగత్తే రూపొందును. మన అంతఃకరణమునందలి, వాసనలు, సంస్కారములు, కారణరూప కర్మబీజములు యిట్లే ప్రభావితములైనప్పుడు ఏదో ఒక విధమగు అజ్ఞాన దోషమువల్ల స్వప్నజగత్తుగనో, జాగ్రత్‌నందలి జగత్తు గనో ప్రాదుర్భవించు చుండును. ఇందు లేనివి యున్నట్లుగను, ఉన్నవి లేనట్లుగను భావింప నవకాశములున్నవి. ఇపుడు మనము గమనింప వలసిన యంశము లేవియన :—

స్వప్న ప్రపంచమంతయు స్వప్నద్రష్టకు ఆత్మగతమేగాని బయట లేదు. ద్రష్టతాను విమానమెక్కి అమెరికాపోయి, పలువురతో ప్రసంగించి. వ్యవహారములు పరిష్కరించుకొని వచ్చినట్లున్ననూ — తానెక్కిన విమానము, ప్రయనించిన వేలాదిమైళ్ళ దూరము, ఆ దూరమున కావలనున్న అమెరికా దేశము, తనతో వ్యవహారగోష్ఠి జరిపిన వ్యక్తులు అన్నియు, అందఱును ద్రష్ట మెదడునందే యున్నారుగాని బయట లేరుగదా! ఇంకొక విశేషమేమన ద్రష్టయు ఆ యీ కల్పిత స్వప్న జగత్తులోని వ్యక్తియే: తనను తానే తనవంటి అన్యవ్యక్తిగా గ్రహించు చున్నాడు. అనగా ఆత్మయందే, భావనాబల ప్రభావముచే అధ్యారోపితుడై తనచే తానే చూడబడుచున్న వాడాయెను. స్వప్నద్రష్టను తానే ఒక అద్దముగ మనము పోల్చి చెప్పిన, అతనికి ఆ స్వప్న ప్రపంచమంతయు అంతర్గతమే గదా! ఆతని నుండి దానిని విడదీయలేము. ఆతడు ఆ స్వప్న ప్రపంచము అప్పు డవిభాజ్యములు దృష్టాంతమున అద్దము లేనియెడల

నగరములేదు. అనగా అధిష్ఠానము లేనియెడల ఆరోప్యమేలేదు. తాను (స్వప్నద్రష్ట) లేనియెడల ఆ స్వప్నప్రపంచమే యుండదు. అయితే నగరము లేకున్నను అద్దముండును, స్వప్నప్రపంచము లేకున్ననూ తానుండును. గాఢసుషుప్తియందు నిద్రాణముతైయున్న ఇంద్రియములకు శబ్దముచేగాని, స్పర్శచేగాని, వెలుగుచేగాని కొంత క్షోభ లేక సంచలనము గలిగినప్పుడు, సుషుప్తియందున్న పురుషుడు తిరిగి జాగ్రత్‌కు వచ్చును. శాస్త్రబోధయు యిట్టి సంచలనము (mental vibrations) గలిగించుటను ప్రబోధమందురు. ప్రబోధమున జాగ్రత్‌కు వచ్చినప్పుడు స్వప్న ప్రపంచమంతయు మిథ్యయని తెలియబడును. కనిపించినను ఉనికి లేనిదియే యని గ్రాహ్యమగును.

*[N. B. :- వేదాంతమున సాధారణముగ మిథ్య, మాయ యను పదములు ఏకార్థముగ ప్రయోగింపబడుచున్నవి. కాని ఈ రెండుపదములకు భావములు భిన్నములని నాకు గ్రాహ్యమగుచున్నది. మాయ సత్వరజస్తమో గుణాత్మకమగు నొక స్వరూప విశేషము; మిథ్యయన లేనిది యున్నట్లు స్ఫురించుట లేక ఒకటియై యుండి మరొక్కటిగ స్ఫూర్తి కలుగుట, అవిద్యయొక్క కార్యమని నా తాత్పర్యము. "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అని శంకరులు చెప్పిన దానిని శ్రీ వినోబా భావే "బ్రహ్మసత్యం జగత్స్ఫూర్తి" యని సవరించెను. ఆయన దెలిపినది ప్రాతిభాసిక సత్యమని శంకరులు దెలిపినది పారమార్థిక సత్యమని అనగా కార్యకారణముల అనన్యత్వమని మనము గ్రహించిన మనకు సరియగు దృక్పథము ప్రాప్తించ గలదు ]*

ఇప్పు డజ్ఞానవిశేష కార్యమగు నిద్రయు, దానియందు సంస్కార బలిమిచే భాసించిన స్వప్నమును, ఉనికి లేనివనియే గ్రహించినాము. ఈ తాత్కాలిక లేక ప్రాతిభాసిక అజ్ఞానమునకు అందరూ వాడు పదము

"తూలాజ్ఞానము" గాక, అనాదియై, అనుస్యూతముగ నున్న "మూలా జ్ఞానము'' అను మరియొక గొప్ప అజ్ఞానము అతని నావరించి యున్నది. సద్యః ప్రబోధము పొందిన తన జ్ఞానేంద్రియములు, సుషుప్తియందలి విలీనస్థితి నుండి, జాగ్రత్సందలి (బోధ) జ్ఞానస్థితికి వచ్చిన వెంటనే ఆ మూలాజ్ఞాన ప్రభావముచే జాగ్రత్ప్రపంచమును సత్యవస్తు రూపముగనే భావించును. కనుక ప్రధానముగ మనము తెలిసికొనవలసిన విషయము లెవ్వియన :—

(1) ఈ జాగ్రత్ప్రపంచము యొక్క స్వరూప స్వభావము లెట్టివి? (2) ఇది ఎట్లు సృష్టియై రూపొందినది— స్వభావ సిద్ధముగనా లేక మరియొక నిమిత్తము చేతనా ? అగునెడల ఆ నిమిత్తము యొక్క స్వరూపమెట్టిది ? (3) దీనికి ఉపాదానమగు నొక మూలపదార్థమేదేని గలదా ? (4) సర్వమునకు అధిష్ఠానము పరమాత్మయందురే — అట్టి పరమాత్మతో దీనికి గల సంబంధమెట్టిది ? ఆ పరమాత్మ దీనికి కారణ రూపమా ? ఆ కారణ రూపమునకిది కార్యరూపమా ? ఈ రెంటికిగల సంబంధమెట్టిది ? స్వప్న ప్రపంచమువలె నిది యున్నట్లు స్ఫురించినను బ్రహ్మజ్ఞానముచే ప్రబోధము గలిగిన యెడల ఇదియును స్వప్నతుల్యము గనే, లేనిదిగనే నిర్ధరింపబడ గలదా ? తత్వశాస్త్రము యొక్క సారాంశ మంతయు వీని సమాధానములయందే సంప్రాప్తమగును. ఈ దృష్టితోనే శంకరులు దర్పణము నుదాహరణముగ సూచించి "నిజాంతర్గతము" "యథానిద్రయా'' యను పదప్రయోగముతో విశదీకరించిరి. ఈ పదముల యందలి భావములు ఒక్క అద్వైతమునకు మాత్రమే వర్తించును. అందుచేత అద్వయ సిద్ధాంతమునకు పునాదులగు 1. "కార్యకారణముల కనన్యత్వ భావము" 2. మాయా తత్త్వము జీవజగత్తులపై దాని ప్రభావము, 3. మిథ్యారూపముల పొసంగజేయు వివర్తము

4. భ్రాంతి జ్ఞానవిమర్శ, 5. అధిష్ఠానము, దానిపై తత్త్వత్రయాధ్యారోప ప్రక్రియ, 6. అపవాదప్రక్రియ మున్నగు అంశముల శ్రవణమనన నిదిధ్యాసలచే సాధించి గ్రహించినగాని సమాధానములు చిత్తశుద్ధితో హృదయంగమములు గావు. ఇటుల గానప్పుడు, అనుభూతి అసత్యమే. విజ్ఞానము విలాసమాత్ర వైభవము మాత్రమే యగును.

ఒక జిజ్ఞాసువు అద్వైత సిద్ధాంతమును బోధింపుమని ఒక ఆధునిక విద్యావంతుని కోరగా ఆయన "ఏమున్నదయ్యా! ఒక శుక్తి (ముత్యపు చిప్ప) ఒక రజ్జువు (త్రాడు) ఒక స్థాణువు (దుంగ లేక మొద్దు) తెచ్చుకో, వాటితో ప్రయోగ పూర్వకముగ బోధించగలను" అన్నాడట. ఆయన వానిని సమకూర్చుకొని వచ్చెనట. అప్పుడు బోధకుడు చూడు! యీ ముత్యపుచిప్ప ఒకవైపున తెల్లగా యున్నది. దీనిని ఎండలో చూచినప్పుడు అది వెండివలె గన్పించును. దీనిని శుక్తి రజత భ్రమ యందురు. ఆ త్రాడును నేలపై వేసి చూతుము. సంజచీకటి వంటి ఆ మసక వెలుతురులో అదిగో! చూడు! త్రాడు పామువలె కనిపించుటలేదా? అవును దీనిని రజ్జుసర్ప భ్రాంతి యందురు. సంజచీకటిలో ఆ దుంగను పెరటిదొడ్డిలో పెట్టిచూడు దొంగలాగున కనిపించును. కనుక ఇది యంతయు భ్రాంతివలన గలుగుచున్నది. ఈ ప్రపంచము అంతియె, మనము లేనిదానిని చూచి ఉన్నదనుకొనుచూ యున్నాము. ఇట్లనుకొనుటను "మిథ్యయందురు". అనగా లేనివియే ఉన్నట్లు మనకు కనిపించుచుండును. నీ ఆత్మను జీవాత్మయందురు. సర్వవ్యాపకమైన ఆత్మను పరమాత్మ యందురు. ఇప్పుడు నీ జీవాత్మ ఆ పరమాత్మతో ఐక్యమైనదనుకో, దీనినే "తత్త్వమసి" (అది–నేను–అయితిని) అను మహావాక్యము ద్వారా బోధించిరి. ఇంతను నీ బుద్ధికందని ప్రతి విషయమును మాయా కల్పితమని తెలుసుకో. ఇంతే అద్వైతమంటే. ఇవి బాగా వల్లించు, నీవు

ముక్తుడవగుదువని బోధించినాడట. ముక్తుడనైతే యీ ప్రపంచము నందలి వ్యవహారము లెట్లు జరుగును స్వామీ! యన ఆ గురువుగారు అవి జరుగుచునే యుంటవయ్యా! నాగులచవితి నాడేగదా మనము పామును నాగేంద్రుడని పాలుపోసి పూజించుట? పంచమినాడు పుట్టలోనుండి బయటకు వచ్చిన యెడల, దానిని పామని కర్రతో కడతేర్చుట లేదటయ్యా? అని బోధించెనట. ఇట్టిదిగాదు అద్వైతము. ప్రపంచ స్వభావ స్వరూపముల తాత్వికముగ గ్రహించి, జగత్తు ఏ దృష్టితో, ఏ స్థాయిలో, ఏ అధికారికి మిథ్యగాగలదో గ్రహించి, జగత్తునుకూడ సాపేక్షిక దృష్టితో మన్నించి, తీవ్రమగు సాధనతో అనగా – రజస్తమో గుణముల నదుపునకు దెచ్చుకొని, ఆచార్యేంద్రుడై, వాసనల దుడిచివైచి కొని, సత్సంస్కారముల పాదుకొల్పుకొని, రాగద్వేషాదుల నుండి నివృత్తి పొంది, సత్వసంపన్నుడై శుద్ధచిత్తుడై బ్రహ్మాకార వృత్తియందు అవిచ్ఛిన్నముగ అనుభూతి పొందుటయే అద్వైత సిద్ధికి సాధనయగుగాని, మాయ, మిథ్య, భ్రాంతి, ఆత్మ, పరమాత్మ, తత్త్వమసి అను పదముల పఠనమాత్ర పాండిత్యముచే అద్వైత సిద్ధియను ప్రజ్ఞానప్రాప్తి లభించదని సాంప్రదాయము.

ప్రకృతము :– ఈ శ్లోకమునందు దర్పణ దృష్టాంతముతో జెప్పబడిన ఈ జగత్తుయొక్క స్వరూప స్వభావముల గ్రహించుటకు గ్రంథ ప్రారంభములో జూపిన పరిణామ ఆరంభ, వివర్త, ఆభాస (ఆవిర్భావ పూర్వకము) వాదము ఉపకరించును. మరియు "స్వాత్మానమేవ ద్వయం" అను పదమునందలి సూక్తిని దెలియుటకు జైవవాదములగు ప్రతిబింబ అవచ్ఛేద, ఆభాస (మిథ్యాపూర్వక) వాదములందలి విజ్ఞానముపకరించును. ఈ వాదములు ప్రధానముగ దెలుపు విషయమేమన – జీవుడు ఒక భూమికయందు ప్రమాతగ (ఇంద్రియముల ద్వారా భ్రమను పొందు

వాడు) పరిగణింపబడు చున్ననూ, అంతఃకరణముకన్నను విలక్షణమగు శుద్ధచైతన్య తత్త్వముగ పరలోకభూమికయందు భాసించువాడే, పరమాత్మయే అగును అని బోధింపబడెను. ఈ మూడు వాదములును శంకరు లామోదించినవియే, అద్వైతపరములే. స్వలక్షణము ఈశ్వరునిది, విలక్షణము జీవునిదని గ్రహించవలెను.

ఈ శ్లోకభావమును గ్రహించుటకు, అద్వైత సిద్ధాంత బోధలయందు మనకు తరచు వినవచ్చుచుండు "భ్రాంతి" "భ్రమ" యను పదములను ముందు విమర్శించి గ్రహింపవలయును. నీవు భ్రమపడు చున్నావయ్యా! అన్న విషయము ఒకటిగా నుండ ఇంకొకటిగా గ్రహించుచున్నావని భావము ఈ భ్రమయను భావము ఆత్మపరమాత్మల విషయమున అనగా – వేదాన్తశాస్త్ర విషయములయందు వాడునప్పుడు అధ్యాస, అవిద్య, అజ్ఞానము అను పదములతో చెప్పబడుచున్నది. అవిద్యచే ఆవరింపబడిన దశ అజ్ఞాన దశ. ఈ యజ్ఞానమురెండు విధములుగ నున్నది. (1) మూలా విద్య: ఇది అనాది, అనగా సృష్టికి పూర్వము నందుకూడా యున్నది. ఇది జ్ఞానముచే నశించును. (2) తూలావిద్య: ఇది మన నిత్య వ్యవహారముల యందు కనిపించును. అనాత్మ వస్తువుల విషయమున సంభవించు చుండును. ఇంద్రియముల ద్వారా మనస్సుచే సముపార్జింపబడును. ఇది వృత్తి జ్ఞాన సంభవము. ఇది అధిష్ఠాన వృత్తి జ్ఞానముచేతనే నశించును. మూలావిద్య నిర్విశేషాజ్ఞానమని (absolute nescience) తూలావిద్య (relative nescience) సాపేక్షిక అజ్ఞానమని తెలియుచున్నది.

ఈ యధ్యాసను మూడు విధములుగ మనము విభజించి తెలియవలయును. 1. జీవుని విషయమున 2. జగద్విషయమున 3. ఈశ్వరుని విషయమున. వీనినే తత్త్వత్రయాధ్యాస లందురు. అద్వితీయమగు ఆత్మసాక్షాత్కారము గలిగినప్పుడే ఈ తత్త్వత్రయాధ్యాస నశించును. అప్పుడు

"బ్రహ్మవిదాప్నోతి బ్రహ్మ" యను సత్యమనుభూతమగును. అనగా ప్రమాతయగు జీవుడు తనను పరమాత్మగనే అనుభూతి పొందును.

భ్రమ రెండు విధములుగ నున్నది. (1) ఆత్మాధిష్ఠానక భ్రమ : ఇది స్వప్న దృష్టాంతముతో తెలియపరచబడినది. (2) అనాత్మాధిష్ఠానక భ్రమ : ఇది శుక్తి రజత భ్రమ యని రజ్జు సర్ప భ్రాంతియని జడపదార్థములను అధిష్ఠానములుగ గ్రహించి చెప్పబడినది. ఇచ్చట శుక్తి అధిష్ఠానము, దా-యందు భాసించిన వెండి అధ్యారోపము. ఈ విషయము ముందు చెప్పబడిన వివర్తవాదమున విపులముగ చర్చించబడినది. గనుక వివర్తవాద విచారణయందు దూరమున వెండి యున్నట్లు తలంచి దానిని మూటగట్టుకొన నుత్సహించితిమి. ఇప్పుడా వెండి దాపునకు పోయి దానిని మూటగట్టి తెచ్చుకొందము. అనగా, ఇంతవరకు దృశ్యమును గమనించినాము. ఇక దీని కధిష్ఠానమేదో తెలియవలయును. ఆరోపమగు వెండిని తీసికొన దగ్గరకుపోవగా అది ముత్యపు చిప్పయని, దానిపై తెలుపు వెండివలె మెరసినదేగాని వెండిగాదని తెలిసినది. శాస్త్రమున అధిష్ఠానముగ జెప్పబడినది పరమాత్మ. ఆత్మయొక్క స్వరూపమును దెలిసికొనినగాని అందుపై ఆరోపమెట్లు ప్రాప్తించునో, వివర్తమననేమో గ్రహింపలేము. ఈ విషయమును వివరించుటకే శంకరులు ఉపమాన మొకటి సహకారి గాగలదని సర్వాధిష్ఠానమగు పరమాత్మ నొక యద్దముతో బోల్చి ఈ ప్రపంచము నా యద్దమునందు ప్రతిబింబించిన నగరముతో బోల్చి చూపిరి. అద్దమునం దానగరము అంతర్గతమై యున్నట్లే పరమాత్మయందీ జగత్తు అంతర్గతముగ నున్నదనియు, అయినను అధ్యాసయనబడు మాయాశక్తి ప్రభావముచే, ఆత్మకు బాహ్యముగ నున్నట్లే దోచుచున్నదనియు బోధించిరి. నిద్రయందు కల ఎట్లో మెలకువ కాలమందును (జాగ్రత్తునందును) జగత్తు కలవంటిదే అయి ఆత్మయందే

యుండియు బాహ్యముగ నున్నట్లు మాయాశక్తి వలన తోచుచుండుననిరి. సరి. ఇక్కడ నొక యుపాధి దానియందు జీవుడు, ఎదుట వెండివంటి ఒక శుక్తి యున్నవి గనుక ఈ జీవునకు భ్రాంతి గలిగినది. మరి ఈ సమిష్టి జగద్విషయమున భ్రాంతి ఎవరికి గలిగిన, జగత్తు దృశ్యముగ ప్రభవించినది ? జ్ఞానము ఎవరికి గలిగిన ఈ జగత్తు పగటియందే జాగ్రత్తులోనే గలుగు కలగా తెలియబడునని ప్రశ్న గలుగు చున్నది ? ఈ సందేహమునకు సమాధానమే — అజ్ఞాన పరిణామముచే గలుగు బింబ రహిత ప్రతిబింబమే, ఈ వివర్తవాద హృదయము. అనగా అజ్ఞాన పరిణామ దోషము అధిష్ఠానమగు ఆత్మయందు గలిగిననే ఈ ప్రతిబింబము ప్రాప్తియగు చున్నదని గ్రాహ్యాంశము. ఈ భావమును లెస్సగా గ్రహించు టకు ముందు ఆత్మయన నెట్టిది ? ఈ ఆత్మ జీవుడని ఎట్లు వ్యవహారము నకు వచ్చును ? ఈ జీవునకు భ్రాంతి యెట్లు గలుగును ? అని చర్చించి తెలిసికొనుటెంతయు ఆవశ్యకము.

ఆత్మను తత్త్వశాస్త్రము నందిట్లు నిర్వచించి దెలిపిరి :—

శ్లో॥ యచ్చాప్నోతి యదాదత్తే । యచ్చాత్తి విషయానిహ ।
యశ్చాస్య సంతతో భావః । తస్మాదాత్మేతి కథ్యతే॥
(కఠోపనిషత్ భాష్యము : శంకరులు)

ఆత్మ పదమునకుగల వ్యుత్పత్త్యర్థముల ననుసరించి నిర్వచించి తెలుపబడినవి. అవి :

1. ఆప్నోతి ఇతిఆత్మ, ఆప్నోతి = పొందునది. అనగా నిద్రాకాలమున అంతఃకరణవృత్తులు — పసంహృతము లైనప్పటి, స్వరూపస్థితి ఆత్మః లోనికి గ్రహించి తిరోభావస్థితి (Involution) పొందునది ఆత్మ.

2. ఆదత్తే ఇతిఆత్మ : ఆదానము = గ్రహించుట. జాగ్రత్కాలమున దృశ్యముల గ్రహించువాడు ఆత్మ.

3. అత్తి ఇతిఆత్మ : అత్తి=తినుట. అనగా భోగించుట. శబ్దస్పర్శాది యింద్రియార్థముల ననుభవించువాడు ఆత్మ.

4. అనుస్యూతోభవతి ఇతిఆత్మ : అవస్థాత్రయము నందనుస్యూతము గను; పదార్థ పరిణామ ప్రక్రియ యందును (flux) సంతత భావమున నుండువాడు ఆత్మ.

Atma is the original principle of consciousness which is a Continuum, irrespective of space and time, wakefulness, dream or sleep and of the same nature even with respect to the flux in the case of matter. It exhibits a process of involution during whole some sleep and an evolutionary purposeful projectivity during the dream and wakeful states. In every sphere, both animate and the inanimate it purvades the monads (Trigunas), which contribute to us the understanding of its subtlest state and the primal absolute. In every branch of knowledge say Physics, Chemistry, Biology etc., we have unitary ultimates as a quantum, an atom and a gene, contemplation on which, helps one to conceive the transcendental state of Atma and the state of actual experience of the thing-in-itself. The sought for thing-in-itself, which could only be experienced is Atma.

ఇక విచారింతము :— I యచ్చాప్నోతి = ఎందువలన పొందు చున్నాడు ? ఏమి పొందుచున్నాడు ? గాఢనిద్రావశుడై యుండు సమయ

మున అజ్ఞానముతో నేకీభావము పొందుచున్నాడు అని తాత్పర్యము. ఇచ్చట పర్యవసించునది అజ్ఞానము. ఇది కారణశరీరమునకు సంబంధించినది. అజ్ఞాన రూపమగు నీకారణ శరీరము నభిమానించు ఆత్మ ప్రాజ్ఞుడు. ప్రాజ్ఞుడను పదమునకు రెండు విధములగు అన్వయము గలదు. ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః = బాగుగా తెలిసినవాడు; ప్ర+అజ్ఞః=ఏమియు తెలియనివాడు. ఇచ్చట నిద్రా కాలమున (సుషుప్తియందు) ఆత్మ అజ్ఞానోపాధికుడై నందున, ప్రాజ్ఞుడను సాంకేతిక పదముచే, బహిర్విషయముల తెలియనివాడని వ్యవహారమునకు వచ్చెను.

II యదాద త్తే : ఏది జాగ్రదవస్థయందు తనకు గలిగిన యనుభవ ములను వాసనలుగ గ్రహించునో (formation of instincts), సుషుప్తియందు వానిని త్తేజము గలిగిన యెడల నవి స్వప్నములుగ పరిణమించును. "నిజాంతర్గతము" "ఆత్మాధిష్ఠానకము" అను పదముల చక్కగా నర్థము చేసికొనవలెనన్న మనకు ఈ స్వప్న ప్రపంచమే ప్రధానము, ఇందు మనము విచారించవలసిన అంశమేమన :— స్వప్న ప్రపంచము కలగనువానికి ఆంతరమై యున్నదా ? బాహ్యమున నున్నదా ? లేక ఆంతరముగ నుండియు బాహ్యముగ నున్నట్లు స్ఫూర్తి నిచ్చు చున్నదా ? స్వప్నమున తాను ద్రష్టయై ఆ జగత్తునందంతటను తాను వ్యవహరించుచున్న యెడల ఆ జగత్తు అతనికి బాహ్యమున నున్నట్లే గదా ! అయినను, స్వప్నమున తాను చూచిన అమెరికా మున్నగు విదేశములు, అచ్చటికిపోవ తానెక్కిన విమానములు అతని మస్తిష్క మను అద్దమునందు యున్నవిగదా ! ఇట్టి స్వప్న జగత్తునుండి, ఏదో శబ్దము చేతనో, స్పర్శచేతనో, వెలుతురు చేతనో ప్రబోధము గలిగి మెలకువ వచ్చినప్పుడు, తన ఇంద్రియములు మరల జాగ్రత్ప్రపంచ మందలి యింద్రియార్థములతో సంయోగము జెందినప్పుడు వాని యనుభవ

మును మరల పొంది మరల ఈ జాగ్రత్తనుకొనబడు (మెలకువలోనే వచ్చుకల) స్వప్న తుల్యావస్థయందు వ్యవహారమునకు వచ్చును. అప్పుడు తానుగన్న కలలోని ప్రపంచము ఆతనికి మిథ్యగ ప్రాతిభాసికముగ (చూచునంత సేపే నిజము) తోచును. లేనిదానినే యున్నదానిగ తలంచితి నని తెలిసికొనును. "అసత్కల్పార్థగం భాసతే" యని నిర్ధరించు కొనును. ఈ స్వప్న ప్రపంచ సృష్టికి అనువగు వాసనలు జాగ్రత్తునందు గలిగి, సూక్ష్మ శరీరము నాశ్రయించి యుండును. సూక్ష్మ శరీరము నభిమానించుతరి, సూక్ష్మ శరీరము తైజసాంశ ప్రధానమైనది గనుక, ఆత్మ తైజసుడని వ్యవహారమునకు వచ్చెను. ఇప్పుడు మనము తేల్చి తెలియవలసిన విషయము — స్వప్నమునుండి జాగ్రత్తుకు వచ్చినప్పుడు స్వప్నమును మిథ్యగా భావించినట్లు ఈ జాగ్రత్ప్రపంచము (బుద్ధీంద్రి యాదులతో తెలియబడు ప్రపంచము) గురూపదేశము చేతనో లేక శాస్త్ర జ్ఞానము చేతనో, యోగసాధన చేతనో, ఉపాసన చేతనో ప్రబోధము పొందిన, ఈ జాగ్రత్ప్రపంచమును కూడ స్వప్నతుల్యముగ నిర్ణయించు కొనుట కవకాశము కలదాయన, కలదు. అష్టాంగయోగ సాధనలచే, రజస్తమముల నదుపులోనికి దెచ్చుకొని, వాసనలను లయింపజేసుకొని, సత్సంస్కారముల ప్రతిష్ఠించుకొని, ఏకాగ్రతనొంది సజాతీయ వృత్తి యందవిచ్ఛిన్న ధ్యానముతో బ్రహ్మాకారవృత్తిని ప్రాప్తింప జేసికొనుటయే సాధన. దీనివలన తురీయావస్థ ప్రాప్తించి అపరోక్షానుభూతి నొందుటచే నీ జాగ్రత్తునందలి జగత్తు కూడా స్వప్నతుల్యమే, ప్రాతిభాసికమే యగును.

III యశ్చాత్తి విషయానిహ = ఇంద్రియార్థముల ననుభవించు నీ భౌతిక శరీరము నభిమానించుతరి ఆత్మవిశ్వుడని ప్రశస్తికి వచ్చెను. ఈతడీ విశ్వమున నెల్లప్పుడు పరిభ్రమించు చుండును. దేశకాలముల

యందీతడు సదా ఉనికి గలిగియే యుండును. ఎట్లన, ఒక వ్యక్తి గ్రహించు భౌతికములగు ఆహార పదార్థముల సారములచే స్త్రీ పురుష భేదములబట్టి శుక్ల శోణితములుగ పరిణమించి, వాని సంయోగముచే "అంగాదంగాత్సం భవతి" యనునట్లు తిరిగి మానవ రూపమున జన్మ పరంపరలనందును, జాతిమనుగడను పరిరక్షించుటకు దేశకాలముల యందనుస్యూతముగ వచ్చుచుండు భౌతిక శరీరముల నభిమానించు నప్పుడు ఆత్మవిశ్వుడనబడు చున్నాడు. కనుక నీయాత్మ విచారణచే.

(1) అజ్ఞానరూపమగు శరీరమున సుషుప్తిలో కారణశరీరిగా ప్రాజ్ఞుడని (2) తేజః పదార్థరూప శరీరమున స్వప్నమున సూక్ష్మశరీరిగా తైజసుడని (3) భౌతిక పదార్థరూప శరీరమున జాగ్రత్తునందు స్థూల శరీరిగా విశ్వుడనియు, సమష్టి రూపమున వీరిని ఈశ్వరుడు, హిరణ్యగర్భుడు విరాట్పురుషుడని యందురు. ఇట్లు వ్యవహారమునకు వచ్చుచున్ననూ, ఈ మూడవస్థలయందును ఉపాధులు భిన్నములైనను, అనుస్యూతముగ తానుండుటచే ఆత్మ ఒకడే యనియు తెలియగలము.

ii) స్వప్న జగత్తునకు అధిష్ఠానము ఈ యాత్మయేననియు కనుక ఆ జగత్తు అద్దమునం దంతర్గతముగ నున్న ప్రతిబింబమువలె ఆత్మయం దంతర్గతముగనుండ నవకాశము గలదనియు తెలియనగును.

iii) ప్రబోధచే సాధనచే అపరోక్షానుభూతి లభించినయెడల జాగ్రత్ప్రపంచమున్ను స్వప్నతుల్యముగ, మిథ్యగనే తెలియబడగల అవకాశమున్నదనియు గ్రాహ్యమగును.

iv) ఇంద్రియములు అంతఃకరణమునందు లయించు సుషుప్తి యందును, పంచభూతములు త్రిగుణాత్మకమగు ప్రధానమునందు లయించు

ప్రళయమునందును (during the process of involution) ఆత్మ స్వరూపయే. ప్రాతిభాసికమగు పదార్థ పరిణామమునందు (during manifestation and evolution) స్ఫూర్తినిచ్చు మారురూపములు, అసత్తు లేక మిథ్య, లేక పరిణామ సత్యములనియు ఇదియును సదాత్మక పదార్థ విభూతియగుటచే, ఆ పరిణామ ప్రక్రియకును అనుస్యూతముగ, సంతత భావరూపమున నుండునది సదాత్మకమగు ఆత్మయని తెలియ నగును. ఈ ఆత్మవిచారణచే సదసద్వివేకమున్ను ప్రాప్తమగును:

v) సదసదతీతమై, (ప్రకృతి వికృతుల కతీతమై) దేశకాలము లకును అతీతమగునది ఆత్మయని గ్రహింపనగును.

కనుక నీయవస్థాత్రయముతో గూడిన ఆత్మవిచారణచే, మూలాజ్ఞాన ప్రాతిపదికపై గ్రహించిన యెడల జాగ్రత్తుకూడా స్వప్నము వంటిదని ప్రబోధము ప్రాప్తించినచో "స్వాత్మానమే వాద్వయం" అను సత్యమును ధృవపరచగలదనియు తెలియుచున్నది. ఈ మూడు స్థితులయందును మూడు విధములగు శరీరముల నభిమానించుటనే తాదాత్మ్యాధ్యాస యందురు (illusory knowledge caused by identifying with illusory bodies. ఆత్మకు జీవభావము గలుగుటకీ తాదాత్మ్యాధ్యాసయే కారణము, మరియు ఆత్మ అంతఃకరణముతో తాదాత్మ్యము జెందుటచే గలుగు "అహం" అను చిత్తవృత్తిచేత తనకు తానే కర్తృత్వభోక్తృత్వ భావముల నారోపించుకొనుట. జీవభావమునకు రెండవ కారణము. ఇట్లు తనను జీవుడని భావించుకొని సజాతీయ. విజాతీయ, స్వగతభేదములను, దేశకాల ములను, అధ్యాసవలన సృష్టించుకొని, తానొక వ్యష్టిగా గిరి గీసికొని రాగద్వేష కామక్రోధాదుల ప్రభావమునకులోనై తానుచేయు కర్మఫలముల ననుభవించుచు, జనన మరణరూప సంసారమున గమనాగమనముల జేయుచుండును. ఇట్టి జీవభావమునుండి జ్ఞానముచే, సాధనచే, మెలకువ

గలిగి తన బ్రహ్మాత్మక భావమును బొందుటయే ప్రబోధము. ఫలము స్వస్వరూప జ్ఞానప్రాప్తి.

iv) యశ్చాస్య సంతతోభావః :— ఈ యవస్థాత్రయమునందు అనుస్యూతముగ నున్నవాడనను భావము. ఈ భావమును గ్రహించుటకు జగత్తుయొక్క మిథ్యా స్వరూపమును దెలిసికొనవలయును. స్థూల, సూక్ష్మ, కారణశరీరముల నభిమానించు విశ్వ, తైజస, ప్రాజ్ఞ భావముల తొలగించుకొనవలయును. "అహంజీవః" అను భావమును, అహంగ్రహోపాసనతో, యోగసాధనతో, తొలగించుకొని "అహంబ్రహ్మ" యను బ్రహ్మాకార వృత్తిచే అపరోక్షానుభూతిని పొంది సర్వాత్ముడు గావలయును. సాధనకు ఇదియే సరియగు ప్రక్రియ. ప్రతిబింబ ప్రాప్తివిధానమును, నిజాంతర్గత భావమును చక్కగా దెలియవలెనన్న అవస్థాత్రయములో స్వప్నావస్థను తెన్నగా దెలిసికొనవలయును. అజ్ఞానమున రజస్తమోగుణ ప్రాబల్యమనియు, అందు ఆవరణశక్తి తమోగుణాత్మకమనియు, విక్షేపశక్తి రజోగుణ ప్రాబల్య జనకమనియు అన్వయించుకొనని యెడల అజ్ఞాన స్వరూపమును అజ్ఞాన కార్యములను చిత్తశుద్ధితో, ఆత్మవంచన చేసికొనకయే, గ్రహింపజాలమేమో! ఆత్మ స్వరూపుడగు మనము ఈ యావరణ విక్షేపశక్తులగు రజస్తమస్సుల ప్రభావ ప్రాబల్యముచేతనే జీవుడుగా భావించుకొనుట జరుగుచున్నది. ఈ గుణములు, వాని ఈ శక్తులు, మాయాస్వరూపముగ సమన్వయము చేసికొని మనము గుర్తించిన, విషయగ్రహణమునకు సహకరింప గలదు. విమర్శ ప్రకాశములు భిన్నములుగావు. అక్షరము ప్రకాశము, క్షరము విమర్శము.

భ్రాంతి జ్ఞానము జీవేశ్వర జగత్తుల విషయమున అధ్యాస యనబడును. ఏదో యొక దోషములేనిదే అధ్యాస కలుగదు. ఈ దోష

ములు అరు విధములుగ సాధుశ్రీ నిశ్చలదాసుగారు తమ విచార సాగర గ్రంథమున విభజించి తెలిపిరి.

1. సత్యవస్తు జ్ఞానసంస్కారము 2. ప్రమాతృదోషము
3. ప్రమాణముల యందలి దోషము 4. సాదృశవస్తు జ్ఞానము
5. అధిష్ఠానము యొక్క సామాన్య స్వరూప దోషము
6. అధిష్ఠానము యొక్క విశేషరూప అజ్ఞానము

కనుక భ్రాంతికి వస్తుసామాన్యాంశ ఆధారము, విశేషాంశ అధిష్ఠానము. సామాన్యాంశ జ్ఞానముచే భ్రాంతి తొలగును. ఈ భ్రాంతిని గురించి మరికొన్ని విశేషముల గ్రహితము కూటస్థుడనబడు ప్రత్యగాత్మకు, అంతఃకరణమునందలి మాలిన్యములచే జీవత్వ, ఈశ్వరత్వ, జగద్విషయక భ్రమలు గలుగుచున్నవని తెలిసికొన్నాము. దీనినే తత్త్వత్రయాఖ్యాన అందురు. మరి పరమాత్మ సర్వాత్మకుడుగదా ! ఈ భ్రాంతి యెవరికి గలుగునను లోగడ వచ్చిన శంకకు సమాధాన మెట్లన :— భ్రమ రెండు విధములు :

(1) అనాత్మాధిష్ఠానక భ్రమ :— శుక్తి యందలి రజత భ్రమగలిగినప్పుడు అధిష్ఠానమగు శుక్తికంటె వేరుగ నొక జీవుడున్నాడు గనుక ఆ భ్రమ సంభవింప నవకాశమున్నది. ముత్యపుచిప్ప అనాత్మ పదార్థము గనుక జీవుడు దానిని జూచినప్పుడు ఆ భ్రాంతి తొలగిపోవును.

(2) ఆత్మాధిష్ఠానక భ్రమ :— ఇందు భ్రమకు ఆత్మయే అధిష్ఠానము. ఇచ్చట భ్రమను పొందువానియందే భ్రమకు అధిష్ఠానము గలదు. స్వప్న ద్రష్టను స్వప్నావస్థను ఒక్కసారి జ్ఞాపకమునకు దెచ్చుకొన్న యెడల ఈ భ్రమ స్వరూపము సుగ్రాహ్యమగును. అనగా అనాది

సంస్కార రూపము. తమోగుణ ప్రధానము అగు అజ్ఞానము ఆత్మను ఆవరించి జీవేశ్వర జగద్రూపములుగ భాసించుచున్నది. కనుక ఈ జగత్తు బ్రహ్మయొక్క వివర్తము. ఈ వివర్తము బ్రహ్మను ఆవరించిన మూలాజ్ఞాన పరిణామమువలన ప్రాప్తించును. ఇందుచే జగదుత్పత్తికి అజ్ఞానము పరిణామ్యుపాదాన కారణము, పరమాత్మ వివర్తోపాదాన కారణమనియు గ్రహించగలము. అయితే ఇచ్చట గమనించవలసిన విషయమొకటి యున్నది. ఏమన, అజ్ఞానమునకు, జ్ఞానస్వరూపుడగు పరమాత్మకు పోటీ స్ఫురించుచున్నది. అజ్ఞానమే బ్రహ్మకు పైచేయి అయి, ఆయన నావరించినది. ఈ శంకనివర్తింపుటకు నాకు దోచిన దొకటే భావము. అజ్ఞానమున్ను పరమాత్మయును మిథునభావ రూపమగు ఒకే పదార్థమను కొనిన పరమాత్మ తనయందంతర్గతముగ నున్న మాయాశక్తిని విజృంభింప జేసికొని జీవేశ్వర జగత్తులుగ పరిగణమింపజేయు చున్నాడనిన ఉపపన్నముగ నుండి చిత్తశుద్ధిలో విశ్వసింపదగునని తోచుచున్నది. రెండు విరుద్ధ ధర్మము లొకే వస్తువుగ నుండుటను ఆంగ్లమున (The principle of polarity) అందురు.

బ్రహ్మ స్వయంప్రకాశము జ్ఞానస్వరూపము. ఇట్టి బ్రహ్మను అంధకారము అజ్ఞానము ఆవరించుటెట్లు? మహత్తు మనబుద్ధికందక పోవచ్చునుగాని ఆధునిక విజ్ఞానమున అణువుతో మనకంతరకు పరిచయము గలిగినది. ఈ అణువునందు కేంద్రముగ నొక ప్రోటాన్ న్యూట్రాన్ గలవు. ఇది అచలము, నిష్క్రియము. దీనిచుట్టును కొన్ని వలయము లలో (orbits) ఎలక్ట్రాన్స్ అత్యంత వేగముతో పరిభ్రమించు చుండును. అప్పుడు కేంద్రమునందున్న ప్రోటానును వర్తులములయందలి ఎలక్ట్రాన్స్ మరుగుపరచుటలేదు? ఐనను ప్రోటాన్ అచలము నిష్క్రియమునగు తన సహజమగు స్వభావములతోనే వెలయుచున్నదిగదా!

మరియు నిష్క్రియ బ్రహ్మకు పోల్చదగు ప్రోటాన్ లేనియెడల ఎలక్ట్రాన్ సార్థకములుగావు. ఎలక్ట్రాన్స్ లేనియెడల ప్రోటాన్ సార్థకముగాదు. ఏ అంశలేకున్నను అసలు అణువే అలీకమగును. *శక్తికి బ్రహ్మమునకుగల సంబంధమిట్టిదియేనని గ్రహించనగును.* చల అచల ములకు, పరిణామ పరిణతములకు ఏకత్వము గలదని నిర్ధింపబడుటకు అవకాశము గోచరించును. శివుడు అర్ధనారీశ్వర రూపుడని చెప్పుట యందలి భావమిదియే. శివునివరకు పోనక్కరలేదు. మానవజాతి విషయ మున విచారించినను పురుషునియందు స్త్రీకి సంబంధించిన జీవరసాయన పదార్థములు (Harmones) స్త్రీ శరీరమందు పురుషునకు సంబంధించిన జీవరసాయన పదార్థములు గలవని వైద్యశాస్త్రము ధృవపరచి తెలిపినది. ప్రస్తుతకాలమున జీవరసాయన పదార్థ ప్రయోగములచే స్త్రీలను పురుషులుగ పురుషులను స్త్రీలుగ మార్పు జేయుచుండుటయు ఈ మిధున భావమును ధృవపరచుచున్నది. కనుక పరమాత్మ శివశక్తుల ఏకైక రూపమేనని విశ్వసింపనగును. ఈ మిధునభావము బాల్యాదిష్వపి జాగ్రదాదిషు అను శ్లోక వివరణమునందు చూడనగును. ఇది ప్రశ్నోపనిషదంతర్గతము. దీనివలన తన యిచ్ఛానుసారము, పరమాత్మ, తనకుతానే తమోగుణ మును విజృంభింప జేసికొని మేలిముసుగును కప్పుకొనుచున్న ఉపపత్తి లభ్యమగును.

భ్రాంతిని గురించిన ఈ కొద్ది జ్ఞానముతో యిప్పుడొకసారి శంకరు లిచ్చిన యద్దమును బట్టుకొని పరికించి గ్రహింతము. ఈ యద్దము అధిష్ఠాన బ్రహ్మ. ప్రతిబింబించిన నగరము మూర్త్యష్టకము (పంచభూత ములు మనస్సు, బుద్ధి, పురుషుడు) అని సూచింపబడెను. ఇట్లు అద్వ యుడు, సర్వాత్మకుడు అగు పరమాత్మయందు గనిపించు ప్రపంచ మంతయు ఆత్మయందే అంతర్గతముగ స్ఫూర్తినిచ్చు చున్నదనియు,

అందువలననే అందుండి విడదీయబడజాలదనియు, దానికిస్ఫూర్తిదప్ప స్వతంత్రసత్త లేదనియు గ్రహింపనగును. ఈ జగత్తునకు అధిష్ఠానము పరమాత్మ. ఉపాదానము అధిష్ఠానాంతర్గతమగు అనాదియగు మూలాజ్ఞానము. ఈ యజ్ఞాన పరిణామమే సృష్టి. కనుకనే ఇది బింబములేని ప్రతిబింబమున జెల్లును. ఇచ్చట స్ఫురించునది అద్వైత మతానుసారము లేనిదియే, ఆభాసవాదానుసారము ఉన్నవస్తువే. కనుక మనము ఈ దృశ్యమును విమర్శించి తెలిసికొనుటకు "యథానిద్రయా" అని స్వప్న స్థితిని పేర్కొనినారు శంకరులు. జాగ్రత్తునందు గలిగిన వాసనల ఉద్రిక్త ఉద్వేగములవలన సంభవించినట్లు అనాదిగ వచ్చుచున్న మూలాజ్ఞానకార్య వాసనలచే నేర్పడు జాగ్రత్తు కూడా ఆత్మానుభూతి పొందినవానికి స్వప్నతుల్యముగాదు. స్వప్నమే యని గ్రహింపవలయును. కనుకనే నీ దృశ్యమానము (Phenomena) దీనికి కారణమగు అజ్ఞానము, మిథ్యయే యని గ్రహింపవలయును. వస్తుతత్త్వదృష్ట్యా సత్యములుగావు. ఇదియే వివర్తవాద సారాంశము. ఈ కల్పితజగత్తు, కల్పితభోక్త, పరమాత్మయందంతర్గతములే, గాని బాహ్యములనలేవు. ఏకతత్త్వమేగాని భిన్నములుగావు. ఐనను మాయాశక్తి ప్రభావముచే పరమాత్మకు బాహ్యాదేశమందున్నట్లే భావింపబడుచున్నవి. అఘటిత ఘటనా సమర్థమగు పరాశక్తియొక్క (యోగమాయ యొక్క) త్రిగుణాత్మక సామ్యరూప స్థితియే ప్రకృతి. ప్రకృతి యందలి క్రియాశక్తియే మాయాశక్తి. ఈ శక్తియే పదార్థరూపము నొందగలదు. మరల శక్తిరూపమునకు రాగలదు. Energy and matter are two states of the one primal substance) జ్ఞానముచే అజ్ఞానమపనయింపబడిన లేక అజ్ఞానము జ్ఞానమునందు విలీనమైన అజ్ఞాన పరిణామ రూపమగు వివర్తభావము పోయి అధిష్ఠాన మవశేషమగును. అద్దము అనాత్మ పదార్థము గనుక ప్రతిబింబప్రాప్తికి ఒక బింబము నపేక్షించును. పరమాత్మ కేవలచైతన్యము గనుక

అవచ్ఛేదకమగు నొక బింబముయొక్క అపేక్ష లేకనే తనయందే తానొక ప్రతిబింబ కల్పనజేయు నవకాశమును విస్మరింపరాదు. బ్రహ్మయను అధిష్ఠానమగు దర్పణము కేవల చైతన్యము కనుకనే ఆత్మాధిష్ఠానక భ్రమకు ప్రసక్తి బింబరహిత ప్రతిబింబమునకు ప్రాప్తి అని గ్రహించి మరల పూర్వపక్షము చేయరాదు. ఉపమాన మెప్పుడును ఏకదేశమే. "నహిదృష్టాంతే సర్వసామ్యం" (No illustration can be run on all force. కనుక తర్కమునకు తావీయక విషయగ్రహణ సౌలభ్య పర్యంతమే జడమగు దర్పణము నుపయోగించుకొందము. చైతన్య దర్పణమునందు స్వరూప సాక్షాత్కారము నొందుదము.

"యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమే వాద్వయం". ఇచ్చట ప్రబోధమన జాగ్రత్తునందునను యున్న అనాదియగు యజ్ఞానము నుండి తత్త్వమస్యాది వాక్యార్థ విచారణచే నివృత్తి పొందుట. తత్ అనగా దివ్యతత్త్వము. దానికి సంబంధించిన సాకార నిరాకార సగుణ నిర్గుణ, కేవల విశిష్టాదివాదములు త్వం అనజీవుడు ఆతనికి సంబంధించిన బింబ ప్రతిబింబ అవచ్ఛేద ఆభాసాదివాద విచారణతో మహావాక్యార్థమును గ్రహించి ఈ శరీరత్రయముతో తాదాత్మ్యము జెంది. పొందిన "అహం" అను వృత్తిని పూర్వము సంపాదించుకొన్న వాసనలను, సంస్కారము లను తుడిచివైచుకొన్నప్పుడుగాని, తన స్వస్వరూపమగు ప్రత్యగాత్మ త్వము సాక్షాత్కరించదు. అనగా తాను అద్వయ పరమాత్మరూపుడుగ అనుభవమును పొందుటయే. అప్పుడు పరమాత్మ ప్రత్యగాత్మ ఒకే ఆత్మ. "ఏకమేవాఽద్వితీయం" అనునదే "స్వాత్మానమే వాద్వయం". అను వాక్యార్థము. జీవభాగము తొలగినప్పుడే, ఇది సాధ్యము. జీవభావము పోవుటకు జైనవాద ప్రక్రియల మననముజేయుట, యద్వ్యాప్తి విషయా ప్నోతి అను శ్లోకభావము, యస్త్యైవస్ఫురణం అను శ్లోకభావము మననము చేయవలయును.

గ్రాహ్యాంశము : జ్ఞానముచే, ధారణ, ధ్యాన, సమాధులచే బ్రహ్మాకారవృత్తిని పొందనివానికి నాగేంద్రుడు దేవుడని యెంత చదివినను పాముగనే పర్యవసించుచుండును. పామునందు నాగేంద్రుని సాక్షాత్కరించుకొనుటకు అష్టాంగయోగ సాధనతో గూడిన శ్రవణ మననములు అత్యంతావశ్యకములు. ముందు ఆచార్యేంద్రుడగు వానికే, అనగా గీతయందు చెప్పబడిన స్థితప్రజ్ఞునకేగాని, పడకకుర్చీ పాఠకునకు అద్వైతసిద్ధి కుందేటి కొమ్మువలె అర్థసృష్టిలేని శబ్దసృష్టిమాత్ర వైభవమే యగును. శంకరులు తత్త్వవేత్త, జ్ఞానసిద్ధుడు, సూత్రప్రాయముగ ప్రగాఢ సిద్ధాంతముల పద్యరూపమున ప్రస్ఫుటము జేయుకవి. రజ్జువునందు పామునేగాక పామునందలి నాగేంద్రుని దర్శింపగలుగు ఆచార్యేంద్రుడు, యోగసిద్ధుడని మనము విస్మరించరాదు. వేదాంతము బుద్ధికి విలాసవస్తువుగాదు, అలంకారప్రాయముగాదు, కఠోరసాధనాప్రాప్యము. జ్ఞానపూర్వకమగు యోగసాధనయే శంకరులకు మన మర్పించగల గురుదక్షిణ.*

అద్దమునందలి ప్రతిబింబమువలె, చైతన్య దర్పణమునందు అనగా సర్వాధిష్ఠానమగు పరబ్రహ్మమునందు తత్త్వత్రయమనబడు జీవేశ్వరజగత్తులు, అంతర్గతములేగాని భిన్నములు, బాహ్యములుగావని ఎవరు గ్రహించి అనుష్ఠింతురో, వారు ప్రత్యగాత్మయే బ్రహ్మాభిన్న సచ్చిదానంద సర్వాత్మ స్వరూపమని అనుభూతినొంది తరింతురనియు, మాయాకార్యముల వివరముగ గ్రహించిననే అనగా జైనవాదములను, ఆత్మవాదములను చదివి విని మననము జేసినచే, తత్-త్వం-అసి వాక్యార్థము గ్రాహ్యమై "బ్రహ్మాసమేవాద్వయం" అను అనుభూతి నొందుదురని బోధించిన సద్గురు దక్షిణామూర్తికి ఇదే నమస్కారము.

ప్రతి శ్లోకముననే నాల్గవ పాదము "తస్మై శ్రీ గురుమూర్తయే నమయిదం శ్రీ దక్షిణామూర్తయే" అని యుండును. మొదటి మూడు పాదముల యందును దృశ్యమంతయు పరమాత్మ యందంతర్గమని, ప్రమాత పరమాత్మలు అద్వయమగు ఏకాత్మ స్వరూపులేనని అద్వైత బోధ జేసియు, నాల్గవ పాదమున అట్టి గురుమూర్తికి నమస్కరించుచున్నానని ద్వైతపరముగ ముగించుటచే —— ముందు ద్వైత భావముతో పూజించి, తరువాత విశిష్టాద్వైత భావముతో ఉపాసించిన, పిమ్మట పొందిన అనుభూతి వలన అద్వైత భావము స్వయంసిద్ధమగునని తెలుపుటయే గమనీయ సూక్ష్మవిషయము. అంతవరకును విధినిషేధ పూర్వకమగు ధర్మాచరణతో భౌతికమును మన్నించుచు, లక్ష్యము మాత్ర మద్వైతసిద్ధిగనే విశ్వసించి చరింపవలయు ననుటయే గ్రాహ్యాంశము.

ప్రతిబింబము = నిర్వీర్యము, నిస్సత్వం

ప్రతిరూపము = చైతన్యం, సత్తగలది.

2. శ్లో॥ బీజస్యాన్తరివాఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయా కల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యః

స్వేచ్ఛయా ॥తస్మై॥

టీక : ఇదం జగత్=ఈ ప్రపఞ్చము; ప్రాక్=పుట్టుటకుపూర్వము; బీజస్య=విత్తనము యొక్క, అన్తః=లోపల, అఙ్కురః ఇవ=మొలకవలె నిర్వికల్పమ్ = భోక్తృభోగ్యాది వికల్పరహితమై ఆత్మమాత్రముగనే యుండెను; పునః = మఱల (తరువాత) మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం = ఈశ్వరాధిష్ఠితమగు మాయచే కల్పింపబడిన దేశకాలములచే వివిధ నామరూపములచే విభక్తమగు ఈ జగత్తును; మాయావీ ఇవ = ఐంద్రజాలికునివలె, మహాయోగీ ఇవ = గొప్పయోగి వలెను; యః = ఎవ్వడు; స్వేచ్ఛయా = తన ఇచ్ఛామాత్రముచేత; విజృంభయతి అపి = సృజించి విస్తరింపజేయునో, అట్టి జ్ఞానోపదేశికాచార్య రూపమునను్న శ్రీ దక్షిణామూర్తి కొరకు నమస్కారము.

తా॥ సృష్ట్యాదియందు ఈ ప్రపఞ్చము నామరూప భోక్తృభోగ్యాది వికల్పరహితమై సన్మాత్ర (ఆత్మరూప) ముగ నుండెను. "ఉత్పత్తేః ప్రాక్ కార్యం సత్" పుట్టుటకు పూర్వము = కార్యము కారణరూపముగా నుండును. అఙ్కురము (మొలక) ప్రకటమగుటకు పూర్వము, బీజము నందే యుండునుగదా ! ఆత్మయందలి మాయాశక్తిచే దేశకాలము లేర్పడి వివిధ విచిత్ర ప్రపఞ్చము ఏర్పడినది. ఇచ్ఛామాత్రముచే మహాయోగి వలెను, ఐంద్రజాలికుని వలెను, వివిధ రచనా చిత్రిత జగత్తును సృజించిన పరమచేతనుడు పరమేశ్వరుడు గురుమూర్తి. ఆ గురుదక్షిణామూర్తికి నమస్కారము.

వివరణ :— మొదటి శ్లోకమున (విశ్వందర్పణ) భౌతికమగు ఈ ప్రపఞ్చమును సమష్టిసృష్టి పూర్వకముగ గ్రహించి ఈ దృశ్యమాన మంతయు తనకు కారణమగు అధిష్ఠానమునందే అంతర్గతముగ నుండియు గుణత్రయాత్మకమగు మాయాశక్తి ప్రభావముచే, పరమాత్మకు బాహ్య దేశమందున్నట్లు స్ఫూర్తి నిచ్చుచున్నదని బోధింపబడినది. అంతర్గత భావమునకు అద్దమును, ఆత్మాధిష్ఠానక భ్రమకు స్వప్నావస్థను (యథా నిద్రయా) ఉపమానములుగ తెలుపుచుచిసని.

ఈ శ్లోకమున ఒక గింజయందు కారణరూపమున నున్న మొలక వర్షాది పరిస్థితుల ప్రభావముచే కార్యరూపములగు, కాండము, శాఖలు. పత్రములుగ పరిణమించి పుష్పించి ఫలించుట జూడ, బీజాంకుర న్యాయ ముతో వ్యష్టిగత సృష్టియందును మాయాశక్తి యొక్క ప్రభావమెట్లు సూక్ష్మమగు కారణముగ స్థూలమగు కార్యముగ పరిణామముల నెచ్చునో వివరింపబడినది. "మట్టి" అనునది ఆకు, కాయ, కొమ్మను వర్తించునట్లు అనగా దాని అవయవ విభాగములయం దనుసృతమైనట్లు, సర్వ ప్రపంచ మున ఆత్మతత్త్వముండుట, ప్రకటితమగుచునే యున్నది. బీజాంకుర న్యాయమున, గింజకు దానియుందే కారణ రూపమునను్న అంకురము నకు, సజాతీయమగు నొక నియత సంబంధము గలదనియు (a specific and homogenous relation ship) అదియే కార్యకారణ రూపము లగు పరిణామ ప్రక్రియల వలన స్పష్టమై, మరల కారణరూపమగు అంకుర సహితమగు బీజముల నొసంగుచు, ఇట్టి పోషపోషు, చెట్టు ముందా ? విత్తుముందా ? యను ప్రశ్నకు అనవస్థా దోషము నాపా దించుచున్నదని భావము అనవస్థాదోషముచే కార్యకారణములని పృథక్క రించి చెప్పబడుచున్నవాటికి అనన్యత్వము లేదా ఏకరూపతనే పారమార్థిక దృష్టితో మనము నిర్ధరించుకొనవచ్చును. కనుకనే శూన్యము నుండి

కారణముద్భూతము కాజాలదు. కాని సత్తే అసత్తుగ భాసింపననువగు ననియు విశ్వసింపనుపపత్తి గన్పించుచున్నది. ఈ బీజాంకుర న్యాయ వ్యవహారమును సంకల్పమే కారణముగ ఆవిర్భావమే కార్యముగ దెలుపుచు స్పినోజా (spinoza) అను పాశ్చాత్య తత్త్వవేత్త దెలిపిన భావమును గమనింతము.

"Whereever there is an external material process it is but one side or aspect of the real process. Thinking substance and extended substance are one and the same thing. An emotion is a state of mind that manifests itself by sensible changes in the organs of different systems of the body. Just as the emotion, as felt, is a part of the whole, of which, changes in the circulatory, respiratory digestive and other systems is the Basis, so an idea is a part along with the bodily changes of one complex organic process. Even the infinitismal subtlities of mathematical reflection have their correlates in the body. Thinging substance and extended substance are one and the same thing". ఈ భావమునకు యోగశాస్త్రమందలి నాల్వ అధ్యాయమునందలి 12 వ సూత్రము ఆలంబన మిచ్చుచున్నదని నేను భావింతును.

"అతీతా నాగతమ్ స్వరూపతోఽ స్త్యధ్వ భేదాద్ధర్మాణామ్"

వినాశము పొందునది అతీతము = భూతకాలము, అనాగతం = భవిష్యత్తు అవ్యక్తమగునది. ఈ రెండు ధర్మములు అద్వయమే. అట్లే గుణములు పరిణామి నిత్యములు. వాని వికారములు అందుల కభిన్నములే

గనుక పరిణామి నిత్యములేగాని, స్వరూప సత్యములుగావు. కూటస్థుడగు ప్రత్యగాత్మ మాత్రమే స్వరూప సత్యము.

The past and future exist in their own nature, qualities having different ways. The past & future though non-existing in a manifested form exists in a fine form. The idea is that existence never comes out of non-existence. Thus, we infer that the Karanam and Karyam are one and the same.

మనము ఒక గింజను చీల్చి పరిశీలించినయెడల అందు ఒక సూక్ష్మమగు అంకురము దప్ప, పత్ర, పుష్ప, ఫలాదులు గన్పించవు. అయితే ఈ యంకురమునుండి యివి యన్నియు ఎట్లుత్పత్తియై వచ్చినవి? అని యడిగినచో ఆధునిక విద్యావంతులు అవి ప్రకృతియొక్క నైజ స్వభావము వలననే యేర్పడు చున్నవని చెప్పుదురు. అణువు నందణు శక్తివలె ఈ ప్రకృతి శక్తి ఆ బీజాంకురమునం దిమిడియున్నదని చెప్పి ఒక శక్తి యునికి సంగీకరించినందుకు సంతోషము. ఆ ప్రకృతి శక్తి యొక్క స్వరూప స్వభావము లెట్లుండునని యడుగ — అది అంతియే, అంతకంటె నికజెప్పుటకు అనువుగాదు, అని స్వభావవాదులందురు. ఇక వివరింప వీలులేదను దానినే మన శాస్త్రకారులు అనిర్వచనీయ మందురు. ఈ యనిర్వచనీయ శక్తినే మన ఋషులు "మాయ" యని వ్యవహరించిరి. మరియు ఇతోధికముగ అది సత్త్వరజస్తమో గుణాత్మకమనిరి. ఈ గుణములు సామ్యావస్థ యందున్నప్పుడు దానిని అవ్యక్తము (the unmanifested) అనిరి. ఇది సృష్టికార్యమున కుపాదానము గనుక ప్రధానమనియు పేరిడిరి. అందు రజోగుణము ప్రకోపించి స్పందించిన, ప్రకృతియొక్క సామ్యావస్థకు భంగము గలిగి అది "మహత్తు"గ

రూపొందును. అనగా పదార్థముద్బుద్ధమగుట కనువగుస్థితి. ఇట్లు ఆ గుణత్రయ స్వభావము సామ్యావస్థయం దిట్లుండుననియు (అవ్యక్తముగ Potential or unmanifested), పరిణామావస్థ యందిట్లుండుననియు (kinetic or manifesting state) విశదీకరించుటయే గాక శరీరముపైనను, మనస్సుపైనను వాటి ప్రభావ లక్షణములను వివరించి వర్గీకరించియు దెలిపిరి. భౌతికమునకు వర్తించుమేరకు వీనిని విచారించి చూచిన ఆధునికులు 'పేర్కొను చలన శక్తి ధర్మములు (Newton's laws of motion) ఈ గుణత్రయమునకు తులనాత్మకముగ స్ఫురించుచున్నవి. విచారింతము :— 1. The law of Inertia: Every body continues to be in a state of rest or of its uniform motion in a straight line, unless it is compelled by an external force to change its state (whether rest or motion)

Tamas is the primary property of the field (క్షేత్ర ధర్మము) It gives u . .e fact that particles of matter or even material objects tend to retain their states of motion or rest and offer resistence to the force acting on them. This establishes the objective existence. తమస్సును ఆంగ్లమున "ఇనర్షియా" అందురు. ఇనర్ట్ అనగా స్తబ్ధత నిష్క్రియత, అలసత అను భావముల దెలుపు గుణము. ఈ పదముయొక్క రూపాంతరమే "ఇనర్షియా". దీని లక్షణములే తమోగుణ ధర్మములగు 1. అజ్ఞానము (lack of intelligence or nescience) 2. అంధకారము (స్వప్రకాశము లేకుండుట) 3. భారము (resistence to an external force), 4. అలసత (సోమరితనము) 5. మాంద్యము (reluctence to move or act) చలన

మును నిగ్రహించు ధర్మము. ఈ 5 న్నూ తమోగుణ ధర్మములే గనుక ఇనర్షియా ధర్మము తమోగుణ తుల్యముగ స్ఫురించుచున్నవి. చలన రహితస్థితి శిథిలతకు కారణము గనుక నిద్రిరుద్రుని యంశయన జెల్లును.

II. Law of force : (శక్తి ధర్మము) the rate of change of momentum of a body is directly proportional to the force acting on the body and takes place in the direction in which the external force acts.

"అణోరణీయాన్ మహతోమహీయాన్ (కఠోపనిషత్) అణువు కంటెను మిక్కిలి చిన్నది (microcosm) ఆకాశాది మహత్పదార్థముల కంటెను (macrocosm) మిక్కిలి గొప్పది అగు స్థూలసూక్ష్మములు రెంటియందును స్పందనశక్తి నిహితమై యున్నది (దాగియున్నది). కనుకనే పరిణామ ప్రక్రియ సాధ్యమగుచున్నది. సబ్ధపదార్థమునకు, స్పందనశక్తి పరిణామ ప్రాప్తి వ్యావృత్తిని గలిగించుచున్నది. ఇది సృజనాత్మకము గనుక సృష్టికర్తయగు బ్రహ్మయొక్క అంశగా దోచుచున్నది.

III. The law of equilibrium :- To every action there is always an equal and opposite reation. ప్రతియొక్క క్రియకును, సమాన పరిమాణమున, వ్యతిరిక్త ప్రతిక్రియ యుండును. (as the positive and the negative ధన-ఋణ శక్తులవలె) ఇందుచే స్థాయీభావము (equilibrium) గలుగును. ఇది స్థాయీభావము (these opposites will have the effect of a binding force, which only can preserve and maintain the statusquo). నిలుపును గనుక నిది విష్ణ్వంశయని చెప్పవచ్చును. అనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లెట్టిశక్తులతో ఈ సృష్టి స్థితి సంహార

ముల జేయుదురో పై జెప్పిన న్యూటన్‌గారి మూడు చలన సంబంధ ధర్మములున్నూ భౌతిక ప్రపంచ విషయమున తుల్యధర్మముల దెలుపు చున్నవి. మూల ప్రకృతి ఈ మూడు ధర్మములుగల మూడు విభిన్న పదార్థములగు సత్త్వరజస్తమో గుణాత్మకమని యెరింగితిమి. ఈ మూల ప్రకృతిని "మాయ" యను నామముతో వ్యవహరించుట వలన ఈ మాయ పదార్థముయొక్క చరమమూలపదార్థ లేశములగు సత్త్వరజస్తమో గుణాత్మకమైన భావపదార్థమనియు కనుకనే స్తబ్ధ, స్పందన, స్థాయీ రూపములగు శక్తులు మాయవే ననియు గ్రహించుట కభ్యంతరము గన్పించుటలేదు. అందుచే పరమాత్మ యొక్క విమర్శ ప్రకాశములలో దృశ్యరూప కారకమగు (objective existence) విమర్శ మాయయే యగును. సృష్టి స్థితిలయముల బొందుచున్న వ్యాపృత్యాత్మక పరిణామ సత్య (మిథ్య) పదార్థము ఈ మాయయే యని గ్రహించిన శాస్త్రార్థములు మనకు సుగ్రాహ్యములు గాగలవు ఇది పారమార్థికసత్య పదార్థము మాత్రము గాజాలదు. అందుచేతనే "యా-మా-సామాయ" ఏది ఉన్నట్లు కనిపించి తాత్త్వికముగ లేనిదో అది మాయ యనిరి. ప్రకాశదృష్ట్యా లేనిది, విమర్శాదృష్ట్యా ఉన్నది— కనుకనే ఉండియు లేనిది మాయ. ఈ త్రిగుణములను "తే వ్యక్త సూక్ష్మాగుణాత్మానః" అని పతంజలి (iv) 13 న చెప్పియున్నాడు అనగా వ్యక్తములు సూక్ష్మము లగు మహదాది ప్రకృతి కార్యములన్నియు గుణ స్వరూపములె యని భావము. ఈ మూడింటియొక్క స్థూలావస్థయే ఈ దృశ్యప్రపంచము. కనుక నివి తత్త్వములు. ఈ గుణము లభివ్యక్తమగుటనుబట్టి భూత భవిష్యత్తులను కాలభేదములు చూపట్టుచున్నవి. వీని నతిక్రమించిన వారికి కాలభేద మసంభవము.

ఇంతపరకును భౌతిక విజ్ఞానముచే న్యూటన్ మన త్రిగుణ జ్ఞానపు భౌతిక స్థాయివరకు వచ్చినట్లు తెలియుచున్నది. అనగా

త్రిగుణముల అభివ్యక్త (ఉద్భూత) స్థితిని మాత్రము గమనించెను. గాని అవ్యక్తస్థితి ఆయనచే స్పృశింపబడి యుండలేదు. పతంజలి మహర్షి అవ్యక్తమగు అనుద్భూత స్థితినికూడ వివరించి చెప్పిరి. ఈ త్రిగుణ సిద్ధాంతమున రహస్య విషయమేమన ఈ విశ్వమంతయు స్థూలము సూక్ష్మము అగు రెండు రూపములతో యున్నది. మానవుడున్నూ స్థూల సూక్ష్మరూపకుడే. ఈ త్రిగుణముల ప్రభావమును కార్యములను సూక్ష్మ రూపమగు మానవుని మనస్సుకు వర్తింపజేసి సమీక్షించిన, దేవాసుర తత్త్వముల విభజించి, విమర్శించి, సంస్కరించి లోకసంక్షేమమునకు పారమార్థికతకు దోహదము జేయవచ్చునని మన శాస్త్రములు నొక్కి వక్కాణించినవి.

త్రిగుణములకు మనస్సుపై ప్రభావము : అతీంద్రియ శక్తి సంపన్నులగు మన ఋషులు సూక్ష్మరూపమగు మనస్సుపైగల ప్రభావము నిట్లు విశదీకరించిరి :—

(1) తమోగుణ ప్రధానమగు మనస్సు : సోమరితనము భారము గలిగి కదలికకు విముఖమై యుండును. అజ్ఞాన యుక్తముగ విమర్శనా శక్తి లేక విచక్షణ లేకియుండును. చద్దియన్నమువంటి చల్లని పదార్థ ములు పాతబడి స్వల్పదుర్గంధ యుక్తముగ నుండు ఆహారముల నభిల షించును. మద్యమువంటి మాదక పదార్థములపై ప్రీతి యుండును. దుష్క్రియలజేయ నుద్యుక్తుడై యుండును. హీనమగు భాషతో ప్రసంగిం చును. ఇతరులకు క్లేశకారకములగు పనులజేయుట, వారికి దుఃఖమును గల్గించుట యందాసక్తి గలిగియుండును. అతని క్రియలు అనాలోచిత ములు ఉద్రిక్త పూర్వకములుగ నుండును. (Impulsive nature)

(2) రజోగుణ ప్రధానమున : మనస్సు అనేక కోరికలతో నిండియుండును. అందు అధికారము, అహంకారము, దర్పము, ధనములు, లైంగిక క్రియలయందు ఆసక్తిగలిగి యుండును భోగవిలాస ప్రసక్తి మెండుగ నుండును. రాగద్వేషములు అతని నియామకులు, అధర్మాచరణ, డాంబిక కార్యాచరణకు నవి ప్రోత్సహించును. కారము, వేడిగలవి, ఉత్తేజకరములునగు ఖాద్యముల నభిలషించును.

(3) సత్వగుణ ప్రధానమగు మనస్సు : ప్రశాంత ప్రసన్న చిత్తము (mental equipoise) సంయగ్దర్శనము (right cognition) మంచితనము (Love for humanity) సానుభూతి sympathy) సమాధానము (మోదఖేదములయందు సమభావము) ధర్మసంబద్ధములగు కోరికలు (Righteous desires), విధివిహిత క్రియాచరణ, శుచియగు సద్యఃపచితములగు వంటకములు. హెచ్చుకారము. ఉప్పు లేక ఉత్తేజ కరములుగాని పదార్థములు, పాలు, పండ్లు, మధురరసము నభిలషించును. ఘ్రాణేంద్రియ విషయమున కలువ, పద్మము, పారిజాతము సత్త్వగుణోత్తేజకరగంధ యుక్తములు: మల్లె, గులాబి రజోగుణోత్తేజ కరములు: గోరింట, ఉల్లిపూలు తమోగుణోత్తేజకరములు, జంతువుల విషయమున ఆవు సత్త్వగుణ ప్రధానము, గుర్రము రజోగుణ ప్రధానము, మహిషసూకరములు తమోగుణ ప్రధానములు : ఈ సత్త్వ రజస్తమో గుణముల పరిణామమువలననే అనగా పదార్థ ప్రాదుర్భావము చేతనే భూతభవిష్యత్తులను కాలభేద ప్రసక్తి గలుగుచున్నది. వీని నతిక్రమించిన సర్వము వర్తమానమే యగును. అనగా కాలమునకు ప్రసక్తి యుండదు.

మానసిక తత్త్వములను (mental or psychological states) దృష్టియందుంచుకొని విచారించిన ఈ భౌతిక శాస్త్రములయందు

ఏమియు లభ్యముగాదుగాని, పారమార్థికమును పరిగణించి చూచిన గీత యందలి గుణత్రయ విభాగయోగముననుు, దేవాసుర సంపద్విభాగ యోగ మునను, ప్రధానముగ మనస్సుపై ఈ త్రిగుణముల కెంత ప్రభావ ప్రాబల్యముగలదో గీతాచార్యులు విపులముగ వివరించి డెలిపిరి ఆ ప్రభావముల ఫలితముగ ఒకని ప్రవర్తనయందెట్టి పరిణామములు గలుగునో, వాని ఫలితములు సాంఘిక సంక్షేమమును, విశ్వశాంతి, పారమార్థికతను జ్ఞానాజ్ఞానములను ఎట్లు నిర్ణయించగలవో విస్తృతముగ వివరించెను. గీతాప్రస్థానమున నీ త్రిగుణాత్మక శక్తికి భగవానుడు రెండధ్యాయముల స్థాయిని (హోదా) గల్పించి ఆ గొప్పదనమును గణనీయ ముగ ప్రస్తావించి ఆ మాయాశక్తిని నా వశమున నుంచుకొని నా రచన లకు (సృష్టి స్థితిలయములకు) అద్దానిని సాధనముగ నుపకరించుకొందు ననియు ప్రవచించిరి. ఈ బోధ. గ్రహింపనేరని మందబుద్ధులు శంకరులు జెప్పిన విషయమును యథాతథముగ గ్రహింపనేరక, ఆయన ఈ మాయ యను పదమును ఆచ్ఛాదనముగ జేసికొని తన యజ్ఞానమును కప్పిపుచ్చు కొనిన ప్రచ్ఛన్న బౌద్ధుడనిరి. బౌద్ధులలో నొకవర్గమువారు (హీనయానులు) శూన్యవాదులు. మాయా కార్యముల నపవదించి చూచిన యెడల, అనగా ప్రపంచమునందలి దృశ్యములను మిథ్యగా నపవదించి చూచినయెడల పర్యవసించునది శూన్యమేనని వారు చెప్పుదురు. కనుకనే అధ్యారోపాఽప వాదమును శూన్యఫలిత ప్రక్రియగా వారు గ్రహించిరి. కానీ విమర్శించి చూచిన శూన్యవాదులకు అధిష్ఠాన పదార్థములేదు. అధ్యారోపమునకు ఒక అధిష్ఠాన ముండవలయునని వారికి స్ఫురించలేదు. శంకరులు అధ్యా రోపము నపవదించి అధిష్ఠానమును ప్రపంచించిరి. "మాయా మాత్ర మిదంద్వైతం। అద్వైతం పరమార్థతః॥" (మాండూక్యం) "మాయాంతు ప్రకృతిం విద్యాత్। మాయినంతు మహేశ్వరం" (శ్వేతాశ్వతరం) అను ఉపనిషద్వాక్యములు శంకరుల భావమునకే ఆలంబనము నిచ్చుచున్నవి.

కనుక శంకరుని విమర్శించువారు శబ్ద ప్రమాణమును విడచి అనుమాన ప్రమాణావలంబులై విమర్శించుచున్నారు.

మాయకు లక్ష్యార్థము మోసముగాదు, లేనిది యనియుగాదు. ఐనను కొయజ్ఞానులు దెలుపు మోసము లేనిది, హుళక్కి అను నర్థముల సాపేక్షిక దృష్టితో, మనము మన్నించినను విమర్శకుల వాదములో పపత్తి లేకపోలేదు. మన యింద్రియముల శక్తులు పరిమితములు. ఈ శక్తులు గోళకముల ద్వారా బహిర్గతమై యింద్రియార్థములతో చేరినప్పుడు భిన్నభిన్న వృత్తుల పొంది, అవి మన అంతఃకరణమున ందించగల పరిమిత జ్ఞానముచే వాటి స్థాయికందని వస్తుజ్ఞానమును టుల త్రోసివైసి చెప్పుట పరిపాటియే గదా! చూచిన వస్తువుయొక్క త్త్వజ్ఞానమును పొందజాలక వస్తుజ్ఞానము మాత్రమే పొంది ఒకదాని ంకొకటిగా దోపింపజేయుటచే జీవుడు మోసగింపబడుటయు సంభవమగు న్నది. గనుక మోసమని యర్థము జెప్పువారిని మనము మన్నింప ప్పను తాత్త్వికముగ జూచినయడల తమోగుణ ప్రభావమే ఆవరణ క్తి, రజోగుణ ప్రాబల్యమే విక్షేపశక్తి యని గ్రహింపగలము. ఈ క్తుల తన యధీనమందుంచుకొని, జీవుల కర్మఫలములు పరిపక్వ పచుండ (as maturity of karmic principles occurs) ని కారణములు కార్యరూపమునొంది ప్రారబ్ధానుభవ ప్రాప్తికే పరమాత్మ మోగుణాత్మకమగు తన శక్తిని విజృంభింప జేసుకొని దానిచే తనేను ఆవరణ జేసికొనును. రజోగుణ ప్రాబల్యముచే ప్రకృతికి పరిణామావస్థ రంభమైనప్పటి నుండియు సూక్ష్మ సృష్టి స్థూలమునకు, స్థూలాతి స్థూల నకు పరిణమించును. సృష్టిని గురించిన మన జ్ఞానము, మాయయనియు, ానమనియు, అవ్యక్తమనియు వ్యవహరింపబడుచున్న మూల ప్రకృతి కియే ప్రారంభమగును. ఇదియే అపరాప్రకృతి. త్రిగుణములు

పరిణమింప ప్రారంభించి సృష్టికి అనువగునట్లు పరిణమించిన సూక్ష్మాతి సూక్ష్మస్థితియే మహత్తనబడును. అది అహంకారముగ (a sense of the self) పంచతన్మాత్రలుగ, (pure and unalloyed elements only) పంచీకృత పంచభూతములై (coalesced elements) వాటి యంశల కలయికచే భిన్నవస్తురూపముల బొంది, కొంతకాలము స్థితినొంది తరువాత లయించి లేనిదగుటచే మోసమను యర్థమునకును నిఘంటువు నందు స్థానము గల్పించవచ్చును. మిథ్యయన స్వరూప సత్యముగాక పరిణామసత్యము మాత్రమగు నిదియే. షడ్దర్శనములలో న్యాయవైశేషిక సాంఖ్య దర్శనములయందు లభించు జ్ఞానముతో తృప్తులమగునెడల నింతవరకు సత్యమే. కానీ యోగదర్శనము యీ యంతఃకరణము నంతర్ముఖముజేయు సాధనలను వానిచే చిత్తము శుద్ధమై, ఏకాగ్రత నొంది, చిత్‌శక్తితో మేళవము నొందుటచే ప్రాప్తించు తురీయావస్థను, దానియందు గలుగు జ్ఞాన ఆనంద పూర్వకమగు అనుభూతిని వివరించి బోధించినది. ఈ యోగశాస్త్రమునకు లక్ష్యము వేదాన్త దర్శనము వేదాన్త దర్శనమునకు సాధనము యోగదర్శనముగా గ్రహింపనగును. అనగా యోగసాధనకు మార్గమును నిర్దేశించు విజ్ఞానము తత్త్వశాస్త్రము నందున, తత్త్వశాస్త్ర భావములకు ఫలము యోగశాస్త్రమునను గలవు. ఇదియే రాజయోగము. హఠయోగాదులుగావు. అవి సూక్ష్మ శరీరమునకే పరిమితములు.

వేదాన్త దర్శనము ప్రాకృతమగు నీ మూల ప్రకృతికి ఆధారమగు నొక అప్రాకృత, నిష్కల చైతన్యమును వివరించి నిర్ధరించినది. ఈ మూల ప్రకృతికి మూలమగునది సర్వాధిష్ఠానమగు సినిమా తెరవంటి అధిష్ఠాన మొకటిగలదని స్పష్టీకరించినది. దానిపై బొమ్మలు కనిపించు నంతవరకు సుఖదుఃఖాది భావములుండునని తెలిపెను. మరొక పరమ

సత్యము "బొమ్మలు లేకున్నను తెర యుండునుగాని తెరలేని యెడల బొమ్మలుండజాలవు" అని తెలిపి బొమ్మల ప్రాతిభాసిక సత్యమును తెరయొక్క పారమార్థిక సత్యస్వరూపమును అనగా జగత్తుయొక్క మిథ్యా స్వరూపమును ఆత్మయొక్క పారమార్థిక సత్త్యమును సుబోధ మొనరించెను. ఆ తెర యెట్టిదో అందు బొమ్మలెట్లు ఆశ్రయమును బొంది ఆడుచు పాడుచు గర్జించుచు ఘర్షణ పడుచు శృంగారాది నవరసానుభూతి మనకెట్లు గల్పించుచున్నవో విచారింతము. ఆ తెర గుణములేని గుణి వంటిది. ఆయుర్వేదమున గుణములేని గుణియుండుట కవకాశము లేదని చెప్పబడినది. ఒక సంఘటన: పూర్వము నలందా విశ్వవిద్యాలయము నందు ఒక ప్రధానాచార్యుడుండెను. విద్యాభ్యాసము పూర్తి జేసికొని పోవనున్న తన శిష్యుల విజ్ఞానమును ఒరిపిడిబెట్టి చూడ సంకల్పించెను. శిష్యుల బిలిచి వారితో — వైద్యమునకు పనికిరాని యేదేని యొక ఓషధిని దెచ్చి నాకు గురుకట్నముగ సమర్పించుడని కోరెను. శిష్యులందఱు మంచిదనిచెప్పి వెళ్ళి వెదకి అందఱు తలకొక ద్రవ్యమును వైద్యమునకు పనికిరానిదిగ నిర్ణయించి తెచ్చిరి. వాని యన్నిటియందును విశిష్టములగు వైద్యగుణములు గలవని ఆచార్యుడు త్రోసిపుచ్చెను. జీవకనామధేయుడగు నొక శిష్యుడు మాత్రము వెదకి వేసారివచ్చి ఆచార్యా! తాము కోరిన ద్రవ్యము నాకు లభింపలేదు. ప్రతి దానియందును రస, గుణ, వీర్యములు గన్పించుచున్నవి, కనుక వాటిని చికిత్సకు పనికిరాని వానినిగ నిర్ణయింప నవకాశము గన్పించలేదు, నాయసమర్థతను మన్నింప వేడుచున్నాననెనట. అప్పుడాచార్యుడు పరమానందము నొంది, జీవకా! నీవొక్కనివే శాస్త్ర హృదయము గ్రహించినవాడవు ఉత్తీర్ణుడవైతివి. గురుకట్నము నిచ్చి ధన్యుడవైతివి. నా యానందమును ప్రకటించుటకు నీకు శిష్యకట్నము నిత్తునని ధనరాసుల నొసంగెనట. జీవకుడు తరువాత పాటలీపుత్ర ప్రభువగు బింబిసార చక్రవర్తిరి ఆస్థాన వైద్యుడాయెను. బుద్ధభగవాను

నుకున్ను తన చికిత్సా కౌశల్యముతో సేవలొనర్చెనట. కనుక గుణములేని గుణి ఈ ప్రపంచమున లభింపదు. గుణిగుణముల విషయమునను ఇదియే వైశేషిక దర్శన సిద్ధాంతము. దానికి ప్రాప్తిస్థానము వేదాంత దర్శనమే యగును.

సగుణ నిర్గుణములందురే, అసలు గుణమననేమి ? అని యొక శంక. కొందఱు అహింస, అస్తేయము. మున్నగునవి సద్గుణములు హింస, స్తేయము, అసత్యము మున్నగునవి దుర్గుణములందురు. ఇవి మానవ వ్యవహార సంబంధములు. కొందఱు జడత్వాదులు ప్రకృతి గుణములు, కించిజ్ఞత్వాదులు జీవగుణములందురు. ఇవి లేకుండుటచే ఈశ్వరుడు నిర్గుణుడు, సచ్చిదానందములచే సగుణుడందురు. నిర్గుణుడన సత్త్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతి నతిక్రమించిన శుద్ధచైతన్య స్థితియనియు, సగుణుడన సత్త్వరజస్తమో గుణాత్మికయైన మాయతో సంబంధము గలిగినట్లు భాసించు స్థితియనియు, వేదాస్తులు బోధింతురు. గుణమువలన ప్రాకృత పదార్థమునకు చరమరూపములగు సత్త్వరజస్తమో గుణములేయని గ్రాహ్యమగుచున్నది. ఇవి పంచదారకు తీపి, వేపకు చేదు, జలమునకు శైత్యమువంటి భౌతిక గుణములుగావు.

They are univalent elemental ultimates (ie) ultimate units of the pancha bhootas, which, in their Avyakta or, potential state are together known as Prakruti or Pradhana and in their kinetic state, manifest as matter—subtle or solid, animate or inanimate. organic or inorganic, stationary or moving about, They are of three categories :— Inert & stable (Tamas); active and vibrating (Rajas); Tranquil, intelligent and capable of balencing and binding together of the other two stable & vibrating forces.

This is Satwa, the aspect of Vidya. The other two belong to the Avidya aspect. The opposite forces of Vidya & Avidya existing in Prakruti show a *midhunabhava in the relm of relativity too.

ఈ సందర్భమున తంత్రశాస్త్రముల యందలి భావములకూడ విచారించి తెలిసికొనిన యెడల మనకు సమ్యగ్దృష్టి లభించును ఇందు, ఈ నిర్గుణ చైతన్యమున, ఈ యచలమున, ఈ పూర్ణమున "శక్తి" యను భావమొకటి యున్నదనియు అది జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, అని మూడు విధముల ప్రస్ఫుటమగు చుండుననియు తెలిపిరి. ఆశక్తియే లేనియెడల ఈశ్వరుడు శక్తిమంతుడుగాక నిష్క్రియుడే యగుననియు; అందుచే సృష్టి స్థితిలయములు సంభవము గానేరవనియు తెలిపిరి. ఫలప్రదాయినియగు నీ శక్తిని స్త్రీ రూపమునగాని, పురుష రూపమునగాని, ఉత్తమాధికారివైన నిష్కలమునిగాని భావించి సేవింపవచ్చుననిరి.

శ్లో॥ యా దేవీ సగమాశక్తిః । పరబ్రహ్మవిధాయినీ ।
బ్రహ్మనాదాభిధానాయై । తస్మై దేవ్యైనమోనమః ॥

శ్లో॥ చిన్మాత్రాశ్రయ మాయాయాః । శక్త్యాకారే ద్విజోత్తమాః ।
అనుప్రవిష్టాయా సంవిన్నిర్వికల్పా స్వయంప్రభా॥

శ్లో॥ పుంరూపం వా స్మరేద్దేవీం । స్త్రీరూపం వా విచింతయేత్ ।
అథవానిష్కలంధ్యాయేత్ । సచ్చిదానందవిగ్రహమ్ ॥

(కులార్ణవతంత్రము)

శక్తిమంతుడు లేనిచో శక్తికి ఆశ్రయము లభింపదు. కనుక ఆధారముండదు. అట్టిచో శక్తి, శక్తిమంతు లిరువురును భిన్నమగు సత్యస్వరూపములే యని అంగీకరించిన "అద్వయము" అను పదమునే అపవదింపవలసి వచ్చును. మరి సామరస్య మెట్లు సాధింపవచ్చునన్న, విరుద్ధ ధర్మములుగల రెండు భావములు ఏకైక రూపమున నుండుట పొసగునని గ్రహింపవలయును. దీనిని ఆంగ్లమున (Polarity) అందురు. అది యెట్లన :— పార్థివమగు ఇనుప గుండు తైజసమగు అగ్నిచే తప్తమైనప్పుడు దానియందు పార్థివగుణమగు ఘనము(బరువు)తైజస గుణ మగు లాఘవము (తేలిక) విరుద్ధములైనను ఏకరూపముననే యున్నవి. దాహకత్వము పార్థివపదార్థ గుణముగాదు. ఘనగుణము తైజసపదార్థగత మును గాదు. ఐనను రెండు విరుద్ధ ధర్మములు ఒకే పదార్థమున నున్నవి. ఇట్లే ధన (positive) ఋణ (negative) ములను రెండు విరుద్ధ ధర్మము లున్నప్పుడేగదా విద్యుత్తునకు సత్వము ! అయస్కాంత విషయ మునను ఈ రెండు భిన్నములుగ దోచు ధర్మము లున్నప్పుడేగదా ఆకర్షణ శక్తి ఉద్బుద్ధమగుట ! ఇందు ఒక శక్తి రెండవదాని కున్ముఖముగాని యెడల క్రియాశక్తి వెలుగుగా, వేడిగా, చలనముగ (light heat and motion) ప్రకటితము గాజాలదు. అట్లే నిర్గుణమునందును, శక్తి శక్తిమంతున కున్ముఖమైనప్పుడే నాదము (the primordeal creative stress but not sound) ఉద్బుద్ధమగును. నాదమన శబ్దము గాదు ధ్వ గాదు ఇది శబమునకు పూర్వాతి పూర్వ మగు రూపము. అచలమునందొక ఆద్యస్పందనము. ఇది పరాశక్తి యొక్క దివ్యస్థితియందు ప్రప్రథమ రూపరహిత సృష్టికి నాందిమాత్రమే. ఇదియే ఓంకారము. ఇది పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యను నాలుగు స్థితుల పరంపరతో స్థూలరూపమునకు వచ్చును. ఈ నాదమే శుద్ధమాయ. ఇది బ్రహ్మయందు యోగము పొందియుండి బ్రహ్మస్వరూపమే యైనట్టిది.

ర్ధసృష్టియందు ఈ నాదప్రభావముచే బిందూత్పత్తి యగును. బిందువన సూక్ష్మాతి సూక్ష్మ తమమగు, సృష్టికార్యమును (unmanifest creation) ఉపక్రమణజేయ ననువగు ప్రప్రథమ శక్తి పరిణామస్థితి. ఈ బిందువునందు ఇంకను ప్రసరించు నాదము కళకు అనగా అవ్యక్త సృష్టికి నాంది పలుకును. ఇంతవరకు మనము మూల ప్రకృతికీ పూర్వాతి పూర్వ దివ్యసూక్ష్మసృష్టి (అప్రాకృత లేక శుద్ధసృష్టి) భూమిక యందు న్నాము. తదుపరి వచ్చునది అవ్యక్తమనబడు, త్రిగుణ సామ్యావస్థా పూర్వకమగు అపరాప్రకృతి. ఇదియే మూలప్రకృతి, ప్రధానము, లేక మాయ. ఇట్టి మాయను పరమాత్మయొక్క ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తి యుక్తమగునట్టి తత్త్వముగ గ్రహింపనేరక యేదో యొక కనుకట్టు విద్యగా బోధింపబడు చున్నాము. పరమేశ్వరుడు పరమేశ్వరియు అద్వయమగు ఒకే అర్ధనారీశ్వర తత్త్వము. కనుక మాయ యనునది పరమేశ్వరు డెంతసత్యమో అంత సత్యమగు భావము లేక అంతే సూక్ష్మ తమమగు సత్త్వము. మాయాశక్తియే సత్త్వగుణ ప్రాబల్యముచే సూక్ష్మ తమమగు మనస్సుగను రజోగుణ ప్రాబల్యముచే, మూలమగు స్థూల పదార్థముగను స్ఫురించుచు స్వస్వరూపమున చిద్రూపిణి గనే యుండును. శుద్ధ విద్యాతత్త్వము నుండి ప్రభవించు అపరాప్రకృతి త్రిగుణ అవ్యక్తావస్థ. అందుండి ప్రభవించు మహత్తు త్రిగుణ వ్యక్తదశకు నాంది. అందుండి ఉద్భూతమగు అహంకారము (sense of Egoism or I) అందుండి తన్మాత్రలు (pure and uncombined elemental units) అందుండి పృథివ్యాది భూతపంచకము, నామరూపములు మాయా శక్తివలననే గలుగుచున్నవి. కనుక నీ మాయాశక్తి (spirit) అందుండి గలుగు 36 తత్త్వములు (matter) అవిభాజ్యములు, కారణ కార్య దృష్ట్యా అనన్యములు. అనగా ఏకరూపత్వమే సిద్ధము. ఐనను ఆదిశక్తి

యగు చిత్ శక్తి (దృక్ లేక ప్రకాశము subject) తనను తాను దృశ్యము (విమర్శ లేక object) గ చూచుకొను లక్షణము గలిగియుండుటచేతనే ఈ అష్టమూర్తులు రూపొందుచున్నవి. "చిద్రూపశ్శక్తిః" అనుట యందలి భావము "శక్తియే చిత్" అనిగాని చిత్ యొక్క శక్తి కాదని, "శక్తి శక్తిమతోరభేదః" అను వాక్యము స్పష్టము జేయుచున్నది. (It is not a quality potency or attribute but the thing-in-itself. Siva is consciousness as stasis and Sakti is consciousness as dynamis. It is Maya that reveals God కనుకనే ఆమె సత్యజ్ఞాన ప్రసూనాంబ. Without knowing the Sakti, the manifested power of God there is no means for knowing him. From Maya alone springs up duality & relativity. Beyond Maya there is neither the enjoyer nor the object for enjoyment.

"శుద్ధస్ఫటిక సంకాశం *స్వతంత్రాధ్యారోపం । బ్రహ్మైవభాతి ఉరుధైవ విచిత్రవేషం" (కైవల్యోపనిషత్). మిధునరూపమగు ఏకాత్మయే (the one entity with dual aspects is the truth) సత్యము లేక పరమార్థము. చిత్‌శక్తియే ప్రకాశము. మలిన మాయాశక్తి (విమర్శ) భౌతిక భూమిక యందలిది, కనుక ఆవిర్భవించిన శక్తి లేక మాయయే జగత్తు. ఆవిర్భవించని శక్తియే చిత్‌శక్తి లేక ప్రజ్ఞానము (consciousness absolute) ఇందుచే ఖనిజ లోహములును, నిర్జీవపదార్థములని భావించుచున్న మన యింటి సామానులును ఘనీభవించిన మాయా శక్తి రూపములే యగును. మరియు సామాన్య చైతన్యము సన్నిధానముగ గలిగియున్నవే యనియు తెలియువలయును. హోమియోపతీయౌషధి పంచదార మాత్రయందు ఔషధసారమెంత సూక్ష్మతరమో అట్లే యిందుండెడి సామాన్య చైతన్యాంశా భాగమునూ మన బుద్ధికందనిది అగు. ఈ చర్చ

యందలి గ్రాహ్యాంశమేమన — ఈ నామరూపాత్మకమగు స్థూలమంతయూ శక్తి యొక్క ఆవిర్భావము. దానియందు సామాన్య చైతన్యము అధిష్ఠానముగ నున్నందుననే దానికి ఉనికి ప్రాప్తించుచున్నది. *శక్తిని ఆవిర్భావ రూపమగు ఆభాసయని శాక్తేయులు, వివర్త ప్రక్రియచే మిథ్యాపూర్వక ఆభాసయని అద్వైతులు బోధింతురు. ఎవరెట్లు గ్రహించినను ఆ వస్తువునందలి "విమర్శ" శక్తిచే దృశ్యము భాస్యమగుటయే మనకు సత్యవస్తు జ్ఞానానుభూతి లభ్యమగుటకు ఆటంకముగా దెలియుచున్నది. అందుచే చిత్తమునకు దృశ్యముపై రాగమున్నంత వరకు ఆధారమగు చితియొక్క జ్ఞానముగలుగదు. నిష్కామకర్మ, ఉపాసనలతో చిత్తశుద్ధి ప్రాప్తించిననాడే సత్యవస్తు దర్శనమగును. లోకమాన్య తిలక్ మహాశయులు ఈ కారణముననే తమ గీతారహస్యమునందు కర్మయోగమునకు విశిష్టత గల్పించి బోధించియుండిరి. సారాంశము : ఈ జగత్తంతయు శక్తి+తత్త్వముల అంశాత్మకమే **(aspects of matter and spirit)** యై సామాన్య చైతన్యము నధిష్ఠించి భాసించుచున్నది. ఈ సామాన్య చైతన్యము తమోగుణాత్మక ఆవరణశక్తిచే ఆవరింపబడి, రజోగుణ స్పందనశక్తిచే చేతనప్రాప్తి గలిగి (ప్రాణశక్తిని పొంది) సత్వగుణముచే కొంత స్థాయీభావము నొంది జగత్తుగ భాసించుచున్నది.

ఈ ఆవరణనే సాంఖ్యులు "ప్రకృతి" యను ప్రత్యేక తత్త్వమనిరి వీరు శుద్ధసృష్టి భూమికలగు శుద్ధవిద్య, ఈశ్వర, సదాశివ, శివ, శక్తి, తత్త్వముల దర్శించి స్పృశింపలేదు. అద్వయమత కర్తలు, సృష్టిని బ్రహ్మ నాశ్రయించి అనాదియైయున్న ఒక అనిర్వచనీయ మహాశక్తి యనిరి. (అది సత్ అసత్తగ ఒకేసారి భాసింప సమర్థము **(A simultaneous Is and Is-not)** అనిరి. శాక్తేయులగు అద్వయవాదులు మాయ తన స్వస్వరూపమునకు భంగము లేకుండగనే, తన్నుతానే ఆవరించుకొన

గలుగు శక్తియనిరి. ఇది కాశ్మీరశైవుల ఆభాస పరమార్థ వాదమునకు తుల్యముగ నున్నది. కనుకనే శాస్త్ర వివరణయందు వీరికి చిదాభాసుని ప్రసక్తియే గలుగదు. అనగా మాయయందు ప్రతిఫలించిన చైతన్యము ఈశ్వరుడనియు అంతఃకరణమునందు ప్రతిఫలించిన చైతన్యము జీవుడనియు అంగీకరించరు. మాయ బ్రహ్మయొక్క బుభూష, ఇచ్ఛాశక్తియే యనియు ఈ శక్తికి శక్తిమంతునితో అభేదమేననియు, కనుక చిత్ శక్తియే స్వకీయ ఆవరణ శక్తిచే తన్ను తా నావరణ జేసికొన్నందున సృష్టికార్యము జరుగుచున్నదనియు తెలుపుదురు. జీవుల అనాది సంస్కారముల పరిపాకానుగుణ్యముగ సృష్టికార్యము చిన్మయియగు యోగమాయ ద్వారా జరుగుచున్నదని అందుచే సర్వము చిన్మయమేననియు తెలుపుదురు. సాన్నిధ్యముయొక్క ఫలితమే కదలిక. మాయయొక్క సాన్నిధ్యమే సృష్టి. సూదంటురాయి ప్రభావముచే ఒక చిన్మమేకునకు ఆకర్షణశక్తి సంక్రమించినట్లు *అజ్ఞానము చిత్‌శక్తి ప్రభావముచే చిదాభాసుని ద్వారా జ్ఞానశక్తిగ ప్రకాశించునని శంకరులు, జ్ఞానమునందే అజ్ఞాన తత్త్వము నిజాంతర్గతముగ నున్నదని శాక్తేయులు చెప్పుదురు. (**Sentiency is an integral constituent of all existence even in the mineral kingdom.** కాని, మాయ అనాదియయ్యును జ్ఞానముచే నశించునని చెప్పుచున్నదే శాస్త్రము ! సదా పరమాత్మయొక్క ఆలంబనముచే ఉనికి గలిగియుండు మాయ నశించుటెట్లు సపన్నమగును ? ఇచ్చట నశించునది శక్తియుగాదు దానికాధారమగు పదార్థమున్నుగాదు, వానిని గూర్చిన భ్రాంతి జ్ఞానము మాత్రమే, శుక్తియందు రజతభ్రాంతి నశించునట్లు నశించును. ఉదాహరణకు జీవన్ముక్తుని తీసికొందము. అతని భ్రాంతి మాత్రమే నశించి ముక్తుడగుచున్నాడు గాని విదేహాముక్తుడగుట లేదుగదా ! మాయాతత్త్వము నీకోణమునుండి గ్రహించిన యెడల మిథ్యాత్వమననేమో సుబోధకమై అద్వైత భావసిద్ధి గలుగును. మాయ

బ్రహ్మస్వరూపముగనే గుర్తింపనగును. దృశ్యమంతయు మాయాశక్తి విజృంభణచే కార్యముగ భాసించి, కొంతకాలము స్థితి గలిగియుండి దేశకాలములచే పృథగ్భావము నొంది భిన్నభిన్నములుగ గోచరించినను, దాని నిజస్వరూపము మాత్రము సర్వాత్మాధిష్ఠానకమే.

"మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవయస్వేచ్ఛయా". బీజాంకుర న్యాయముతో నింతవరకును నియతసృష్టి (Determinism) తెలుపబడినది. ఇది సమాధిస్థితి లభించువరకును వర్తించును. కారణ కార్యముల కేకత్వము సూచించును. సమాధిస్థితి ప్రాప్తించిన తరువాత నీ నియమబద్ధ ప్రక్రియలు అతిక్రమింపబడగలవు. ఎట్లన :– ప్రపంచమున జీవకోటియందు మానవుడే ప్రజ్ఞావంతుడు, కానీ అతని శరీరమునగల కోటానకోట్ల జీవకణములుకూడ బహుప్రజ్ఞావంతములు, స్వతంత్రములు కూడనైయున్నవి. మానవుడు తన ప్రజ్ఞతో తన హృదయమునందలి కణముల శాసింపలేడు, రక్తకరణముల శాసింపలేడు, గుండె స్పందననాప లేడు, రక్తప్రసారమునాపలేడు. సమాధిస్థితి సిద్ధించిననాడే యిట్టి కార్యముల స్వేచ్ఛతో చేయగలడు. (In the process of evolution the human being is the highest in the order of intelligence. But the cells in his intestine lungs or other viscera are more intelligent more independent and capable of subtlest functions. One can't master the functions of the different organs in his body. It is only yoga that can master these functions by releasing and letting loose the powers hidden in one's body. We have therefore to admit the presence of a superior intelligence who only is capable of independent action, creation or dissolution. We may designate that intelligence as God and understand that he

could never be understood by human intelligence but could only be realised by intuition and experience. He is some thing like the subatomic particle—so subtle and yet so potent and capable of free will".

మాయాజీవ యన మాయ కలవానివలె నున్నవాడు. కొద్దిపరిధిలో ఐంద్రజాలికుడుగా వచ్చును. బ్రహ్మాండ భావమున సృష్టికర్తగా వచ్చును. మహాయోగియన అణిమాదిసిద్ధులబొందిన యోగి గావచ్చును. బృహద్భావమున యోగీశ్వరేశ్వరుడగు పరమాత్మ గావచ్చును. వీరి మాయాశక్తి విజృంభించిన యెడల నూత్నమగు సృష్టి ప్రక్రియలు సంభవించుచున్నవి. వీనియందు ఒక విధానము మనకు గోచరించుచున్నది. అది బీజాంకుర న్యాయరూపమున జరుగుచున్నది. ఇది ప్రవాహము వంటిది. నాటిన బీజమునకు సాజాత్యమగు మొక్కయే వచ్చుచున్నది. ఈ ధర్మము మూలప్రకృతి, పంచీకృత పంచభూతములుగ పరిణమించినప్పటి నుండియు సత్యముగనే యున్నది. అనగా ఈ సృష్టి ఒక నియతక్రమపద్ధతిన పరిణామము పొందుచుండును. ఈ ప్రక్రియను పాశ్చాత్య తాత్త్వికులు Teleology యందురు. "A branch of metaphysics, the doctrine of final causes and of the uses which every part of nature was designed to subserve the agreement from design in proof of the existence of God". సదాత్మకుడగు పరమాత్మ ఉనికిని ధృవపరచుటకు అధికార సిద్ధాంతానుసార నిర్ణీత ప్రక్రియకు (design) అను ప్రమాణముగ ప్రకృతి యందలి ప్రతి అంశయు పురోగమించును అని తెలుపు సూత్రము.

"యః స్వేచ్ఛయా".: ఇక స్వేచ్ఛాసృష్టి (Free will) ఎట్టిది? జగత్పరిణామ ప్రక్రియలో మారుచున్న స్థితుల కనువగు శరీరావయవ నిర్మాణముగాని లేదా ఒక నూత్నజాతి (species) ని గాని తన ఇచ్ఛా

సంకల్ప మాత్రముననే సూత్నసృష్టిని జేయసమర్థుడు పరమాత్మ. పరమాత్మ యోగీశ్వరేశ్వరుడు గనుకనే మాయాశక్తిని తని వశము నందుంచుకొని సూర్య, చంద్ర, భూమ్యాదిగ్రహములు ఒకదానికొకటి యెంత దూరమునసున్న, ఆకర్షణశక్తి నెంతవరకు పరిమిత పరచిన సంక్షోభము గలుగకుండునో యెరింగి వానినట్లు నియమించు సమర్థుడు, పరమజ్ఞాని. ఇది భగవంతుడు సర్వదా చేయుచుండు ప్రాణాయామము (ప్రాణశక్తిని నియమించి ధరించి యుండుట). అంతియగాని ప్రాజ్ఞుడుగ నున్నవాడు సుప్రభాతము పాడినప్పుడు జాగ్రత్తునకు వచ్చుటవంటిది గాదు. పరమాత్మ స్వేచ్ఛా సంకల్పానుసారము కొత్తయోనుల సృష్టించి తరువాత నియమబద్ధ ప్రసవ కార్యమునకు దోహదము జేయగల మాయావి. ఈ భావమును పాశ్చాత్య తాత్త్వికులు Vitalism లేక "Emergent Evolution అందురు. The philosophical doctrine that the behaviour of the living organism is at least in part, due to a vital Principal, which cannot possibly be explained wholly in terms of Physics & Chemistry : Evolution, like the work of an artist is creative and therefore unpredictable; that a vague need exists before hand, with in the animal or plant before the means for satisfying the need develops. అనగా జీవకోటి యందలి ప్రతిచేతనాంశయును పాక్షికముగనైన, భౌతికములగు ఫిజిక్స్, రసాయన శాస్త్రముల (chemistry) జ్ఞానముతో నిరూపింప అనువుగాని ఒక శక్తియుక్తమగు భావములననే (by a potent principle) ప్రాదుర్భవించును. కళాకారుని రచనవలె (imaginative nature) విశ్వపరిణామ క్రియయు నిర్మాణాత్మకము గనుకనే అనూహ్యము. ఒక జంతువునందుగాని, వృక్షమునందుగాని అది వర్ధిల్లుటకు ముందుగా, మనమూహింప సాధ్యపడని ఒక అస్పష్ట అవసర పరిస్థితి (a vague

need) అంతరముగ నుండియే యుండును. వర్ధిల్లజేయు శక్తిని దెలుపు భావమును (Vitalism) అందురు. ఆ అస్పష్టావసరమును పూరించి ఆ యవసర సృష్టిని సద్యఃకాలమునజేసి ఆ జీవి మనుగడకు సహకరించు నదే అత్యవసర పరిణామము (emergent evolution).

ఈ శ్లోకమున మనము గ్రహించవలసిన విషయములు 1. బీజములో అంకుర రూపమున (కారణరూపమున) ఒక మహావృక్షమున్నట్లు సృష్టికి పూర్వము ఈ దృశ్యమానమంతయు కారణ రూపముననే యుండెను. 2. సృష్టి కార్యము జరుగుటకు అద్వయ మిధునరూపమున నున్న మాయాశక్తి (the divine intelligence) విజృంభించి కళా (సృష్టి) రూపముదాల్చును. 3. మరల నిర్వికల్పస్థితి, మరల సృష్టియు మాయాశక్తి విజృంభణచేతనే జరుగును. 4. ప్రాకృత సృష్టిలోనున్న బీజాంకుర న్యాయబద్ధముగానట్టి స్వతంత్ర నూత్నసృష్టి పరమాత్మ జేయ స్వేచ్ఛగలిగి యున్నాడు. *అనగా సృష్టికి కారణము ప్రకృతి యొక్క సహజ, నైజ, స్వతంత్ర శక్తిగాక ప్రకృతిని నియమించగల స్వతంత్ర శక్తిమంతు డొకడున్నాడు అనుటయే "యః స్వేచ్ఛయా" యను పద భావము. అనగా స్వేచ్ఛా సృష్టి సాక్షివిపర్తముచే ప్రాప్తించును. ఈ విషయముల విమర్శించి గ్రహించిన ప్రకృతివాదులు జెప్పునట్లు సృష్టి యందు బీజాంకుర న్యాయబద్ధమగు (determinism) నొక శక్తి యున్నను అద్దాని కాలంబనమునిచ్చు స్వరూపసత్యము, త్రికాలాబాధితమగు మహత్తర సర్వసర్వాత్మక శక్తి ఒకటి యున్నదని తెలియవలయును. అది, అద్వితీయము. శక్తిమంతునితో యోగమున నున్నప్పుడు అది పరమాత్మ యనియు వివర్తమో ఆవిర్భావమో సంభవమగునప్పుడు "పాదోస్యవిశ్వాభూతాని" యనినట్లు ఆ శక్తియొక్క ఒక పాదభాగము మాత్రమే స్వచ్ఛందముగ ప్రసరింపబడును. మిగత మూడువంతుల మేరకు

అమృత స్వరూపముగనే, శక్తిమంతుని స్వరూపమే అయియుండును ఈ చర్చచే వివర్తమున ద్వైవిధ్యమును గమనింపనగును.

1. సాక్షివివర్తము: "బ్రహ్మబ్రహ్మణి బృంహితమ్". అనగా బ్రహ్మ తనకుతానే మాయా కల్పిత బహుభవనముగ విజృంభించును అనిభావము. "ఆత్మకృతేః పరిణామాత్" (బ్ర. సూ.) (The self evolves of its own free will) బ్రహ్మ తన స్వేచ్ఛాసంకల్పము చేతనే పరిణమించును కనుకనే బ్రహ్మసత్యం జగద్బ్రహ్మవివర్తమని గాహ్యమగుచున్నది. ఇది దృష్టి సృష్టి వాదమునకు అనుబంధమగును. ఇది ఆత్మాశ్రయ భ్రమచే సంభవించును. Here the nescience and the consequent illusion is self evolved and self superimposed. ఇందు అధ్యాస ఆహార్యము. *ఈభేదము గమనీయము, గణనీయము.

2. ప్రమాతృ వివర్తము :— ఇది చిదాభాసుని భ్రాంతిచే గలుగు వివర్తము. దీనిని అజాతవాదమనియు అందురు. ఇది ముందు తెలిపిన సృష్టి దృష్టి వాదమునకు అనుబంధము. ఇది ఆత్మాధిష్ఠానక భ్రమచే ప్రాప్తించు వివర్తము. ఇందు ప్రమాత ఆశ్రయము ఆత్మ అధిష్ఠానము అగును కనుక అధ్యారోపము ప్రమాతవలననే చేయబడునట్లు స్పష్టమగుచున్నదిగాని బ్రహ్మమే, తన స్వేచ్ఛా సంకల్పముచే, చేయునట్లు స్ఫురింపదు. అనగా అధ్యాస ఆహార్యముగాదు. Here Bramha is not self evolved by His free-will, but is super imposed by the Pramata)

ఆధ్యాత్మమున, నిర్వికారుడగు ప్రత్యగాత్మ, కర్తృత్వ భోక్తృత్వ రూపమగు సంసార భావముతో విస్తరించుటయు, అద్వితీయాఖండ

రూపుడగు పరమాత్మ ఈశ్వర భావమునుజెంది నామరూపములుగ స్ఫురించుటయు, బీజమునుండి అంకురము వృక్షముగా విస్తరించు క్రమపద్ధతి యగు అసత్కల్పమునకు (apparent creation) మరల నిర్వికల్పమగుటకు (dissolution) మాయాశక్తియే కారణము. కనుక విశ్వమను రూపములో మానవ మస్తిష్కముచే గ్రహింపబడు వస్తుసంపద యంతయు (abundence of phenomena) అధిష్ఠానమగు పరమాత్మ తన మాయాశక్తిచే కల్పించిన సద్రూప విలాస విలసనమే (illusory. manifestations of the real) అని భావింపవలయును. జీవుని యందు వాసనారూపముగ సూక్ష్మశరీరము నాశ్రయించియుండు కర్మల ననుభవింప నవకాశము గలిపించుటకే ఈ యసద్రూప విలాససృష్టి జరుగుచుండుట. (Creation of the animate and inanimate or organic and inorganic is intended to enable the Jeeva to enjoy the reactions of his good or bad actions done in accordence to his innate instincts which stimulate Ragadwesha etc., with which he is imbued. The effort put forth to control the instincts is Bharateeya culture or paramardhika sadhana. సత్వరజస్తమోగుణముల స్వరూప స్వభావముల గ్రహించి రజస్తమోగుణ ప్రభావజన్య మానసిక ఉద్వేగముల నదుపులోనికి దెచ్చుకొని శుద్ధ సత్వమును పెంపొందించుకొని, వాసనాక్షయము జేసికొని అప్రాకృత భూమికల అంచుల జేరుటయే వేదాంత శాస్త్రమున పారమార్థిక సాధన యందలి ముఖ్యోద్దేశము. ఇది ప్రాప్తించనివారికి తత్-త్వం రెండును అసిగాక మసియే యగును. ఈ భావము చెప్పుకొనుటకు చాల అనువుగ నుండునుగాని ఆచరణ విషయమున దుర్గమమే. ఒక ఉపనిషద్వాక్యమును గమనించుడు.

శ్లో॥ ఈశావాస్యమిదగ్ంసర్వం । యత్కించ జగత్యాంజగత్ ।
తేనత్యక్తేన భుంజీథా । మాగృథః కస్యస్విద్ధనమ్ ॥

ఇవి ఈశావాస్యమున మొదటి మంత్రము. భావము : ఈ ప్రపంచ మంతయు పరమేశ్వర వ్యాప్తము. ఈశ్వర స్వరూపమే. అంతయు సర్వాత్మ లేక ఏకాత్మయే. అందుచే త్యాగబుద్ధితో నీ కావశ్యకమున్నంత వరకే అనుభవింపుము. ఇతరుల ధనముల నాశించి తెచ్చి కూడబెట్టకుము. మార్క్సు, ఎంగిల్స్, మున్నగు సామ్యవాదులకు ఎన్ని యుగముల పూర్వము సామ్యవాద సిద్ధాంతము భారతమున సుప్రతిష్ఠితమై యుండెనో గమనించుడి. ఈ మంత్రమును వల్లెవేసి ఆచరణను త్రోసిపుచ్చి ఉపనిషత్తుల జదివితిమని సంతృప్తులగు వారును "అనిత్యాని శరీరాణి అందరి ధనము మనకేరాని" యనుభావానుసారము జీవయాత్ర సాగించునెడల పారమార్థికము లభించునా ? ఉపనిషత్పారాయణము మాత్రముననే ముక్తి లభించునా ? సాధన లేనివారికి గీత ఉపనిషత్తులు కుంటివానికి కర్రకాళ్ళవలె మాత్రముపకరించునుగాని, పరుగిడి గమ్యమును జేరుట కుపకరించు సహజ పాదేంద్రియములు మాత్రము గాజాలవు. సాధనలేని శాస్త్రపఠనము బుద్ధికి విలాసమాత్ర వైభవమే యగును.

(1) పుట్టుటకు పూర్వము కార్యము కారణరూపమున నుండునని (2) కనుకనే కార్యకారణములకు అనన్యత్వము నిశ్చితమని బీజాంకుర న్యాయ దృష్టాంతముతో బోధించి, (3) అసత్తునుండి ఈ సృష్టి జరుగదని నిర్ధరించి (4) సదాత్మకమగు నిర్వికల్పస్థితిని అందుపై మాయాశక్తిచే ప్రాప్తించు అసత్కల్పస్థితిని బోధించు సద్గురు దక్షిణామూర్తికీ ఈ నమస్కారము.



3. శ్లో॥ యస్యైవస్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే।
సాక్షా త్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్।
యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాంభోనిధౌ
॥తస్మై॥

టీక :— యస్య=ఏ ప్రత్యగ భిన్నపరమాత్మ యొక్క, సదాత్మకమ్= సద్రూపమగు స్ఫురణం=చైతన్యము, అసత్కల్పార్థగం = లేనిదానితో సమానమైన (స్వతన్త్ర సత్తా లేని) ప్రపంచమును వ్యాపించినదై, భాసతే = ప్రకాశించుచున్నదో, యః = ఎవ్వరు; తత్–త్వం–అసి = నీవు పరమాత్మవు, ఇతి=అను, వేదవచసా = వేదవాక్యముచే, ఆశ్రితాన్= శిష్యులకు, సాక్షాత్=అవ్యవధానముగ, బోధయతి = తత్త్వమును అపరోక్ష మగు నటుల బోధించునో ఆ శ్రీ గురుమూర్తి అగు దక్షిణామూర్తికి నమస్కారము.

తా॥ స్వతః సత్తాప్రకాశములేని జడమైన జగము, ఎవని అనుగ్రహముచే సత్తాస్ఫురణలు కలిగి భాసించుచున్నదో; ఎవడు "తత్–త్వమ్–అసి" అను మహావాక్యోపదేశముజేసి తన నాశ్రయించిన ముముక్షువులను కృతార్థులను జేయుచున్నాడో, ఎవరిని సాక్షాత్కరించుకొనుట వలన సంసారమున (జనన మరణముల నొందుచు సుఖదుఃఖముల ననుభవించుచు గమనాగమనముల జేయుట) నుండనవసరములేదో అనగా జన్మరాహిత్యము ప్రాప్తమగునో ఆ సద్గురు దక్షిణామూర్తికి నమస్కారము.

ఈ సత్స్వరూపుడగు యే పరమాత్మసత్త (existence absolute) అసత్కల్పములగు నామరూప ప్రపంచములుగ భాసించుచున్నదో అనగా

చైతన్యమునందే స్వీయ ప్రభావము చేతనే స్ఫూర్తిని పొందుచున్న నామరూపములు తాత్త్వికముగ అసద్రూపములుగావు. అని "తత్–త్వమ్–అసి" యను వేదవాక్యమును విచారణజేసిన తెలియునని, ఈ భావమును సాక్షాత్కరించుకొనిన (అపరోక్షానుభూతి నొంది) వానికి పునఃజన్మ గలుగదని బోధించు సద్గురు దక్షిణామూర్తికి నమస్కారము.

ఋషులు పరమాత్మను అఖండ సచ్చిదానంద స్వరూపుడుగ నిర్ణయించి చెప్పిరి. మన కండ్లకు కనుపించని పరమాత్మను సత్స్వరూపుడు, సర్వాత్మకుడనియు, యింద్రియములకు ప్రత్యక్షముగా గోచరించుచు, అనుభూతుల నిచ్చుచున్న నామరూపములుగల వస్తు సంపదను అసత్తు, అనిత్యం, మిథ్యయని చెప్పుటెట్లు పొసగునని ప్రశ్న. ఈ ప్రశ్న వేదాంత శాస్త్రమున నొక గడ్డుసమస్యాపూరణముగ, మనన యోగ్యముగ మానవజాతి నెదుర్కొనుచున్నది. ఇందుకు సమాధానమే ఈ శ్లోకభావము. ఇది గ్రహించుటకు ముందు 'సత్' అననేదో, 'అసత్' అననేదో ఒక నిశ్చితాభిప్రాయము గలుగవలెను. దీనికే సదసద్వివేకమని శాస్త్ర పరిభాష. పదార్థము మూడు విధములుగ వర్గీకరింపబడినది :–

1. సత్పదార్థము :– త్రికాలముయందును ఉనికిగలిగి సర్వమునకు అధిష్ఠానమై యుండునట్టిది.

2. అసత్తనగా తుచ్ఛపదార్థము :– శబ్దముదప్ప అర్థ (వస్తు) రూపములేనిది. ఉ॥ కుందేటికొమ్ము, గగన కుసుమములు.

3. మిథ్యాపదార్థము :– అర్థసృష్టి యున్నను శబ్దసృష్టి అందుకు భిన్నముగా యుండునది; ఒకటియైయుండి ఇంకొకటిగా స్ఫూర్తినిచ్చునది ఉ॥ ఎండమావులు; ఇచ్చట అర్థసృష్టి సూర్యకిరణములు; కాని శబ్దసృష్టి

నీరు. ఇప్పుడు ఈ మూటిలో ఏ పదార్థముతో, ఏ ప్రక్రియతో ; నీ జగత్తు సృష్టి జేయబడినది ? లేక స్వతంత్రముగనే సృష్టియైనదా ?

1. శూన్యమునుండి పుట్టినదని కొందరు చెప్పుదురు శూన్యము నుండి శూన్యముదప్ప యితరము లుత్పత్తిపొంద నవకాశము లేదుగదా ! కానీ ఈ ప్రపంచములో సూర్యుడున్నాడు చంద్రుడున్నాడు, భూమి యున్నదని తెలుసుకొనుచున్నాము. ఈ ఉన్నాడు, ఉన్నది యను పదము లనే పరిభాషలో 'అస్తి' యని 'భాతి' యని యందురు. ఇంకనూ ఈ వస్తువ నాకు యిష్టము అనుచున్నాము. యిష్టమనకు పరిభాషాపదము ప్రియము. ఈ అస్తిభాతి యనునవి సత్తు చిత్తుల సూచకములు, ప్రియము ఆనందలక్షణ సూచకము. కనుక శూన్యమునుండి ఈ భావముల స్ఫురింప జేయు పదార్థములు పుట్టనేరవు. అర్థ సృష్టిలేని శబ్దసృష్టి తుచ్ఛము.

2. బీజాంకుర న్యాయానుసారము పరిణామ ప్రక్రియతో భౌతిక సృష్టి జరుగుచుండుట అనుభవమున మనము గమనించుచున్నదే. మూల ప్రకృతి నుండి, సూక్ష్మము నుండి స్థూలమునకు, సత్త్వరజస్తమో గుణ ముల ప్రాబల్య ప్రభావముచే పంచీకృత పంచభూతములుగ, వానియంశల సంయోగముచే నేర్పడు వస్తుసంపదగ, దృశ్యమానముగు నదంతయు, పరిణామ ప్రక్రియగనే అంగీకరించ వచ్చును. పరిణామ రూపముగు నీ సృష్టియంతయు వివర్తముగ నెట్లు గ్రహింపదగునో తరువాత విచారింతము. ప్రకృతము ఈ భౌతిక పదార్థము పరిణమించుచున్నదే గాని నశించుట లేదని మాత్రము గ్రహింతము. ఇందుకుదాహరణము :- ఒక ఆవుదూడను గమనింతము. అది చాలా చిన్నదిగ నున్నది. నిర్జీవ పదార్థమని మనము తలంచుచున్న ఎండుగడ్డి, జనపకట్టను దెచ్చి ఆ దూడను పోషించిన, ఆ గడ్డి జీర్ణమై దాని రక్త, మాంస, అస్థి (బొమికె) చర్మము, వెంట్రుకలు, కొమ్ములు యింకనూ మన రాశికి పాలుగా

పరిణామము చెందుచున్నవి. అనగా ఆ నిర్జీవ పదార్థమగు గడ్డిగాదము జీవరసాయన పదార్థములై రక్త, మాంస, అస్థి, శుక్రము మున్నగు ధాతువులుగ పరిగణమించినది. దూడ పెద్ద ఆవుగా రూపొందినది. ఆ యావు విసర్జించిన మలమూత్రములు భూమియందు నైట్రోజిన్ సోడియం, పొటాషియం, కేల్షియం, యిత్యాదులుగ రూపాంతరము పొంది, మరల వృక్షజాతి కాహారమగుచున్నది. వృక్షములు ఈ పదార్థమును మనకు ధాన్యరూపమున పండ్లరూపమున యిచ్చుచున్నవి. ధాన్యాదులును మన కాహారమై మరల మలములుగ విసర్జింపబడు చున్నవి. పదార్థము (matter) న కిదియొక సంసార చక్రము మాత్రమే. మూల పదార్థము రూపాంతరముల నొందుచున్నదిగాని నశించుటలేదు. జడపదార్థము ఒకప్పుడు జీవపదార్థముగ మరల జడపదార్థముగ పరిగణమించుచున్నది. ఈ పరిణామ ప్రక్రియను తిరోగమన పథమున పరికించిన (process of involution) అనగా భూతముల నుండి తన్మాత్రలకు అందుండి యహంకారమునకు అందుండి మహత్తునకు యిలా సూక్ష్మతరభూమికలకు అధిగమించుచూపోవ, చివరకు సత్వరజస్తమోగుణ సామ్యరూపమగు మూలప్రకృతి వరకే పోగలము. అక్కడ ఆగవలసినదే. కనుక యిదంతయూ జడపదార్థమే. శుద్ధ చైతన్యము చేతనే యిది యంతయూ స్ఫూర్తిని బొందుచున్నది. జీవచైతన్యము చేతనే రాగాదిగుణపూరితమై సుఖదుఃఖములకు, కర్తృత్వ భోక్తృత్వములకు తావిచ్చుచున్నది. దృశ్యములు పరమాత్మయొక్క చైతన్య విభూతులని, అసత్పదార్థములని గ్రహించ వలసియున్నది. ఇందునుబట్టి ఈ నామరూపములు స్ఫూర్తినిచ్చుచున్నను త్రికాలాబాధితములు గావన్నియు, చైతన్యసత్తా మాత్రములుగావని తేలుచున్నది. ఇందువలన నిది మిథ్యావస్తు స్ఫూర్తిగ పరిగణింపబడు చున్నది. నిజరూపము శుద్ధ చైతన్యమే అయియుండ, భిన్నరూపములతో స్ఫూర్తి గలుగు చున్నందున మిథ్య యనబడుచున్నది.

పరిణమించునది జడపదార్థమని సాంఖ్యమతము, అజ్ఞానమని వేదాంతులమతము. పరిణమించుటకు అజ్ఞానము భావపదార్థమా ? యని ప్రశ్న. అజ్ఞానము ఆవరించి యున్నంతవరకు భావపదార్థమే. *ప్రజ్ఞానానుభూతి గలిగినంతనే అది అందుననే సమరసించిపోవును. అప్పుడు దీనికి ప్రత్యేక భావముండదు. ఇట్లు భావపదార్థముగ భాసించి ప్రబోధచే సమరసించిపోవు దానినే మిథ్యా, మాయా లేక ప్రాతిభాసిక పదార్థమందురు. కనుక అవిద్య, మాయ, అజ్ఞానము అనునవి వేదాన్తి మతములో అభావములని చెప్పబడవు. పారమార్థికములనియూ చెప్పబడవు. మిథ్యాభావములు, ప్రాతిభాసిక భావములనియు చెప్పబడును. ఈ వైలక్షణ్యమును (descrimination or distinction) ద్వైత విశిష్టాద్వైతులకంటెను వేదాన్తులు పృథక్కరించి దెలిపిరి. ఇదియే అసత్కల్పార్థగం భాసతే యను వాక్యభావము.

3. సత్పదార్థము : ఇది జీవచైతన్యమునకుగూడ అధిష్ఠానమై యున్న కూటస్థ చైతన్యము. ఇది ఒక యుపాధి శిథిలావస్థకు వచ్చిన యెడల మరల నింకొక యుపాధిని చేరును. ఆ చైతన్య సత్తాప్రభావము చేతనే ఆ యుపాధి మరల పెరిగి కొంతకాలము స్థాయీ భావమునొంది తరువాత లయించుచున్నది. మరల నింకొక ఉపాధిని పొందును. ఈ విరామకాలమున సూక్ష్మశరీరమునే యుపాధిగ ధరించుచున్నది. స్థూలమును విడచి సూక్ష్మశరీరమున నున్నట్లు, ప్రబోధచే సూక్ష్మమునుకూడ పరిత్యజించి, కారణ శరీరమును లయింపజేసికొని ఉపాధిరహిత స్థితి నొందిన, అనంత, అఖండ, అద్వయ పరమాత్మయే యగును. కనుకనే కూటస్థుడు త్రికాలాబాధితుడు. సర్వమును ప్రకాశింప జేయగలడు, స్ఫూర్తి నివ్వగలడు, గనుక స్వప్రకాశుడు. ఉపాధిరహితుడైన ఆ ప్రత్యగాత్మయే, సర్వాత్మకుడుగ, అఖండ చైతన్యముగ సత్పదార్థముగ నెరుంగబడును.

సారాంశములు :– 1. అనాదినుండి గలుగుచున్న యనుభవముల సంస్కారములవల్ల, ఆరోపిత పదార్థములయందు భ్రమరూపమగు జ్ఞానమే గలుగు చుండును. అధ్యాసయందు, అధిష్ఠానము, సామాన్య రూపముగ, ఆరోప్యతాదాత్మ్యమునంది గోచరించుచుండును. ఎట్లన అధిష్ఠానమునకు సామాన్యాంశ, విశేషాంశయను రెండంశలు గలవు. ఉ॥ 'శుక్తి రజత భ్రమలో 'ఇది' 'రజతం' అని చెప్పుచున్నాము శుక్తి యందు ఇది' అను రూపం సామాన్యాంశము, శుక్తియొక్క స్వరూపం విశేషము.

2. అధిష్ఠానము : విశేషరూపమున పూర్తిగా తెలియబడినయెడల భ్రమగలుగదు. సామాన్య రూపము తెలియబడనప్పుడున్నూ భ్రమ గలుగదు. అధిష్ఠానము పూర్తిగా తెలియబడక, సామాన్యము తెలియబడి నప్పుడు, అధ్యాస గలుగును. అనగా అధిష్ఠాన సామాన్య జ్ఞానము అధ్యాసకు కారణము. వివర్తమున సంభవించు విధానమిదియే. కనుక ప్రపంచము పరమాత్మ యొక్క వివర్తము. కనుకనే ఈ శ్లోకము మననయోగ్యము. పరమాత్మ విశేషము. విశేషము ద్రష్టయందలి తమోగుణ ప్రాధాన్యతచే అనగా అజ్ఞానముచే ఆవరింపబడినప్పుడు, అధిష్ఠాన సామాన్య జ్ఞానము మాత్రమే గలుగును. అనగా భ్రమజనిత జ్ఞానము గలుగును. భ్రమలయందుపాదానము పరమాత్మ, ఆయన సామాన్యాంశలగు విశేషణములే వస్తువులయందనుగతమై భ్రమలకు కారణమగును. కనుక అవిద్యయొక్క ఆవరణ విక్షేపశక్తులే జగత్కారణము. ఈ యవిద్యయే బృహత్స్వరూపములో మాయ యనబడును. *ఈ మాయాశక్తియే విక్షేప మును గల్పించి లోకవ్యవహారమున పరిభ్రమింప జేయునప్పుడు "అవిద్యా స్వరూపిణి". బ్రహ్మాకారవృత్తి యుదయించినప్పుడు బ్రహ్మవిద్యా స్వరూ పిణి, చిద్రూపిణి సద్విద్యాతత్త్వము. దీనినే హైమవతి యని పూజింతురు.

పరి : సత్పదార్థము పరిణామిగాదని గ్రహించితిమి. ఈ భ్రమను గలిగించునది ఆవరణయనుడు, అజ్ఞానమనుడు, మాయయనుడు, మరి యేపేరైననూ పెట్టుడు, ఈ శక్తి కొకవ్యక్తిత్వము గలిగించినాము గదా ! మరి పరమాత్మ అద్వయుడెట్లని యొకశంక. దీనికి సమాధాన మెట్లన అధిష్ఠాన పదార్థము మిథున రూపమైనది. మిథునమును ఆంగ్లములో (Polarity) యందురు. అనగా రెండు విరుద్ధ ధర్మము లొకేపదార్థముగ ఏకైక రూపమున నుండుట. ఇచ్చట ఒక పదార్థము శుద్ధచైతన్యము లేక పరమాత్మ; రెండవది ఆ "చిత్" యొక్క శక్తి "యోగమాయ". యోగమున రెంటికి ఏకైకముగ సమ్మేళనము. అనగా ఆ పరమాత్మయందే తాదాత్మ్య సంబంధము గలిగి ఏకరూపమే అయియుండుట. ఉదాహరణకు మనము విద్యుత్తునందు ధన, ఋణ (positive and negative) అంశలు రెంటిని పేర్కొనుచున్నాము ఐననూ ఆ రెంటికి భేదమును భావమును స్థిరీకరించిన యెడల అసలు విద్యుత్తే యుండదు. ఒకటి లేనియెడల రెండవ దానికి యునికియే యుండదు. ఆ శక్తి నిష్క్రియముగా నున్నప్పుడు వేడి వెలుగు, చలనము యుండవు. ఇట్టిదే ఆ సత్స్వరూపము. మిథున రూపముగు శక్తి విజృంభించి ఋణాంశ ధనాంశ సమ్ముఖమైనప్పుడే దీపములు వెలుగును, పంఖాలు తిరుగును, స్టౌలు ఉష్ణాగ్రతపొంది పచనకార్యయోగ్యములగును. మేగ్నెటిక్ (సూదంటు రాయి) శక్తియునిట్టిదే. ఇది భౌతికమునకు సంబంధించిన యుదాహరణ. పారమార్థికమున, శివశక్తులకు లేక బ్రహ్మశుద్ధమాయలకు, గల స్వరూప తాదాత్మ్యమును, అందువల్ల సంభవమగు కార్యములు గ్రహింప నుపకరించును. అనగా పరమాత్మయు శుద్ధ మాయయు మిథున రూపముగు ఏకైక పదార్థమేనని బోధించును. పరమాత్మయొక్క ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల సమగ్ర స్వరూపమే మాయ. "యాదేవీ పరమాశక్తిః పరబ్రహ్మ విభాయినీ" అని పూర్వశ్లోకమున జెప్పబడినది. పరమాత్మ

సృష్టిని సంకల్పించినప్పుడు మాయాశక్తి విజృంభించుటకు ముందుగా నాదమగును. ఇది శబ్దసృష్టియందు జెప్పబడు ధ్వనిగాదు. అర్థసృష్టి యందు ఇదియొక ప్రాథమిక స్పందన మాత్రమే. (The primordeal stress) లేక ప్రాథమికక్షోభ. ఈ క్షోభచే బిందువేర్పడును. బిందువన సృష్టికార్యమున కనువగు స్థితికి వచ్చిన పరాశక్తియే, శుద్ధమాయయే, భౌతికమున నొక అస్పష్టమగు మసక పదార్థము వంటిది (a Nebulous or cloudy state, not clearly seen or understood) అను స్థితి ఉదాహరణగ గ్రహింపనగును. ఈ బిందువుపై యింకనూ గలుగు నాదప్రభావముచే "కల" యుద్బుద్ధమగును. కలయన సృష్టి. ఈ భూమిక యందలి సృష్టిని శుద్ధ సృష్టియని శాక్తేయులు నిర్వచింతురు. శుద్ధమనగా పంచీకృతభూత సృష్టిగాదు. భూతసృష్టిని మాయికాసృష్టి యందురు. అనగా సత్త్వరజస్తమో గుణాత్మకమై మాయ యను నామముతో శఙ్కరులచే వ్యవహరింపబడిన ప్రకృతి పరిణామముచేతగాని, తన యందలి ఆవరణ, విక్షేపములను తమోగుణాత్మకశక్తి విశేషములచే వివర్త ప్రక్రియగ జరిగినది మాయికాసృష్టి. కనుక సృష్టికి శుద్ధభూమిక, మాయికాభూమికలు గలవు, మొదటిది నాద, బిందుకళాత్మకము. రెండవది సత్త్వరజస్తమో గుణాత్మకము. మొదటిది పరాప్రకృతి జన్యము, రెండవది అపరాప్రకృతి కార్యము ఈ దృక్కోణమునుండి సంయమన సామర్థ్యము గల అంతఃకరణ యను దూరదర్శినితో జూడలేనివారు *ద్వైత భావమును పొంది జీవేశ్వర జగత్తులను మూడు అనాది పదార్థముల అంగీకరింప వలసియే వచ్చును. శుద్ధ సృష్టియందు, శాక్తేయులచే జెప్పబడిన శుద్ధ విద్యాతత్త్వము తరువాతిదయి శఙ్కరేయులచే జెప్పబడిన మూల ప్రకృతి నుండియే వివర్త వాదమునకు నాంది ప్రస్తావన, పరిణామ, ఆరంభ, ఆభాసాది వాదభేదములకు అవకాశము లభించినది. ఒక పాదము మేరకుగలదను వివర్త భావమును, ఆవరణ విక్షేపశక్తుల ప్రభావమునకు

లోనైయున్న, అంతఃకరణ – బుద్ధీంద్రియములతో గూడియుండు నంత కాలము, అధిష్ఠానమును (విశేష్యమును) గ్రహించుట కవకాశములేదు. ఈ యంతఃకరణము నంతర్ముఖముజేసి, జ్ఞానస్వరూపమగు చైతన్యముతో యోగసిద్ధిచే సాక్షాత్కారము (అనగా చూచుటగాదు అపరోక్షానుభూతియే) బొందిననే అనుభవమునకు రాగలదు. అనగా, నిర్వికల్ప సమాధిస్థితిలో బ్రహ్మాకార వృత్తిని బొందినప్పుడే అనుభవము గాగలదుగాని అన్యథాశరణం నాస్తియని తోచుచున్నది. ఈ స్థితికిరానిదే తత్త్వమును గ్రహించితిననుట ఆత్మవంచనయే.

ప్రకృతము : ముందు జెప్పబోవు అష్టమూర్తుల స్వరూప స్వభావ ముల గ్రహించియే "యస్యైవస్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే" యని ఈ సృష్టియంతయూ సనాత్మకమగు పరమాత్మయొక్క స్వప్రకాశముచేతనే స్ఫూర్తిని గలిగియున్నదని, అవి పరమాత్మ విభూతు లని, సగుణ బ్రహ్మస్వరూపములే యని జెప్పబడినవి. ఇదియొక కోణము నుండి పరిశీలించిన మిథ్య. మరియొక కోణమునుండి విమర్శించి గ్రహించి సాధనతో అనుభూతిని పొందిన యెడల, సత్పదార్థమే యగునని విశ్వసించగలము.

సాధనయందొక అంశముగ, "సాక్షాత్త్వమసీతి వేదవచసాయో బోధయత్యాశ్రితాన్" అని బ్రహ్మాకారవృత్తి ప్రాప్తికి, పథమును జూపెను. ఈ వాక్యమందుగల తత్–త్వం–అసి–యను మూడు పదముల విచారిం తము. "తత్" యననేది ? "త్వం" అనబడు నీవెవరు ? అని విచారించి తెలిసికొనిన యెడల అసి=అయియుంటివి (ప్రాప్త ఉపలబ్ధి భావము) అను పదమునకు సార్థకత గలిగింపనగును. తత్ అన అది. అది యేదో గ్రహించుటకే ఈ ప్రస్థానములు షడ్దర్శనములు యిత్యాదు లును. మనకుగల విజ్ఞానముతో, సంస్కారబలముల మలుపులతో, విషయగ్రహణ సామర్థ్యముతో, ప్రయత్నింతము. ఇందు దార్శనికులు

ప్రతిపాదించిన అన్ని భావముల సమన్వయముతో ఒక్కొక్క మెట్టు ఎక్కినగాని వేదాన్త దర్శనమందలి భావముల గ్రహించి సత్యమును దర్శింపజాలము ఏదోయొక దర్శన ప్రతిపాదిత జ్ఞానముతో తృప్తిజెంది, సమీక్షజేయు సామర్థ్యము లేనియెడల ఆ నేర్చిన దర్శనమందలి పాక్షిక జ్ఞానము ఒక ఉచ్చుగా మనకు దగుల్కొని ప్రగతిని పొందనీయదు. కనుక మేధావులగు దర్శన కర్తలందరి సిద్ధాంతములను సమన్వయము జేసి కొనవలయును ఇప్పుడు "తత్" అనునదేది ? :- ఏదైతే ఈశ్వరు నకుగల సమిష్టి యజ్ఞానముతో (collective ignorence) కూడని దైన శుద్ధచైతన్యమో, ప్రజ్ఞానమో, అఖండము, అద్వయము, నిష్కలము, నిర్క్రియమో, సర్వాధిష్ఠానమో అదియే "తత్" పద లక్ష్యార్థము. "త్వమ్" యనగా వ్యష్టి యజ్ఞానముతో గూడి, స్థూల, సూక్ష్మ, కారణ, శరీరముల నభిమానించుచు, వానితో తాదాత్మ్య భావము నొందుచు తజ్జనిత తాదాత్మ్యాధ్యాసచే కర్తృత్వ భోక్తృత్వముల నారోపించుకొని సుఖదుఃఖానుభూతుల నొందునో అట్టివాడే "త్వమ్" లేక నీవు అనుశబ్ద వాచ్యుడు. ఇట్లు విచారించగా జీవేశ్వరుల కిరువురకును, పరమాత్మయే అధిష్ఠానమని, ఇరువురిలో నొకరు వ్యష్టి అజ్ఞానముతో నుపహితుడై దానిచే ప్రభావితుడై, అహమను భావమును బొందినట్లును, రెండవవారు సమిష్టి యజ్ఞానరూపమగు మాయచే నవచ్ఛిన్నుడయ్యు దాని ప్రభావమునకు లోనుగాక దాని కధిపతియై నియామకుడుగ నుండినట్లును దెలియుచున్నది. ఈ సందర్భమున నొక చిన్న యుదంతమును దెలిపెదను. ఒక యజ మానికి పదిమంది నౌకరులు గలరు. ఆయన ఆ పదిమందిచేత తన యిచ్ఛానుసారము ఆదేశించి సేవల జేయించుకొనుచుండెడివాడు. ఈతడే ఈశ్వరుడు. మాయతోగూడి సాహచర్యము జేయుచున్ననూ, దానిని తన ఇష్టానుసారము ఒక కుంచిగా, ఒక కలముగా, ఒక పనిముట్టుగా నినియోగించుకొని తన రచనల జరుపుచుండును. ఇంకొక యజమానికిన్ని

పదిమంది నౌకరులు (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు) గలరు. ఆయనకు మనస్సను నొక సలహాదారుడు సహచరుడుగ సంప్రాప్తమయ్యెను. యజమాని ఈ మనస్సను వాని సలహాలను విని, తన నౌకరులు తెలివి గలవారని, వారివల్ల తనకు సుఖప్రాప్తి గలుగునని విశ్వసించి ఆ నౌకరుల సూచలన నామోదించి, హర్షించి, జీవయాత్ర సాగించుచుండెను. తుదకు తన నౌకరుల సలహాలు తనకు దుఃఖప్రాప్తిని గలిగించినవని గ్రహించి మనస్సను ఆ మంత్రిగారిని తన సామర్థ్య సాధనలచే వశపఱచు కొని పరిచారకుల నడుమనందుంచి సుఖప్రాప్తి నొందెనట. ఈతడే జీవుడు ఒక దశయందు అజ్ఞానమునకు లోబడి చరించువాడు— మరియొక దశయందు అజ్ఞానమును తొలగించుకొని సుఖప్రాప్తి నొందినవాడు.

ఈ మాయకు నాలుగు భూమికలు గలవు. (1) యోగమాయ : ప్రళయస్థితియందు పరమాత్మతో యోగము జెందియుండు చిత్శక్తి. (2) శుద్ధమాయ : సత్వరజస్తమో గుణాత్మకము గాకయుండి శుద్ధ సృష్టియందు అయిదు భూమికలలో ప్రవృత్తినిజూపి శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, సద్విద్యలను స్థితుల ప్రదర్శించునది. (3) అవిద్య : జీవతత్త్వ మును రజస్తమో గుణప్రాబల్యముగల తన యావరణ విక్షేపశక్తులతో క్రమ్మివేసి భ్రాంతి జ్ఞానము గలిగించి, విపర్తమును జూపునది. (4) బీజాం కుర న్యాయానుసారము నియత సృజన, స్థితి, లయశక్తుల ప్రదర్శించు నది. ఈ మాయయొక్క ప్రభావముల నింకను పరికించిన తెలియు సూత్రములు :— (1) పదార్థము మనస్సుయొక్క విలసనమని (matter is the manifestation of mind) తెలియును. (2) పూర్ణ బింబరహిత పరిచ్ఛిన్న ప్రతిబింబ ప్రాప్తిని గలిగించును. (3) ఆత్మయందె అంతర్గతముగ నున్న దృశ్యమును, బాహ్యదృశ్యముగ స్ఫురింపజేయుట. (4) నిరతిశయ, నిర్గుణ బ్రహ్మయందు గలుగు

ఆద్యస్పందనము (The primordeal stress that causes unmanifest creation is capable of independent creation) స్వేచ్ఛాసృష్టిజేయ సమర్థము. ఇది సత్వప్రధానమై రజస్తమోగుణములు అప్రధానమగు శుద్ధసృష్టి.

(5) సాతిశయ లేక అపరాప్రకృతి (Relative nature composed of the trigunas) సత్వరజస్తమో గుణాత్మకము. సృజన, స్థితిలయాత్మకము, ఆవరణ విక్షేపసమర్థము. క్రమబద్ధమగు, బీజాంకుర న్యాయసమ్మతమగు సృష్టి, ఈ అపరాప్రకృతి ధర్మములు.

(6) ఏకకాలమందే సత్తు—అసత్తు—గా తెలియబడునది. అనగా మిథ్యారూప సృష్టి. (a simultaneous Is and Is not). మాయాశక్తియొక్క భూమికలను కార్యములను ఇట్టివని గ్రహించితిమి. ఇక జీవేశ్వరుల విషయము, వారికిగల సంబంధమును విచారింతము. ఇరువురకును అధిష్ఠాన మొక్కటియే ఐయున్నది; మాయయొక్క భూమికలతో సంబంధమున్నది. అజ్ఞానమను తమశ్శక్తి యుపాధిమాత్ర పరిమితము. అనగా ఈశ్వరుడు (తత్) మాయయను సమిష్టి యుపాధియు, జీవుడు (త్వమ్ అవిద్యయను వ్యష్టియుపాధియు విశేషణాంశలుగ గలిగి యున్నారు. శాస్త్రజ్ఞుడు తత్—త్వమ్ పదములకు "అసి" పదమును వర్తింప జేయుటకు జహల్లక్షణమని (జహత్ = వదలుట) అజహల్లక్షణమని (వదలకుండుట జహదజహల్లక్షణమని విశేషణాంశయగు అవిద్యనువదలి విశేష్యాంశయగు చైతన్యమును పరిగ్రహించుట) యు, ఇది వాచ్యార్థము అది లక్ష్యార్థము అని గంభీర పదములతో చెప్పుదురు. కాని శాస్త్రీయ విజ్ఞానము లేనివారికి "అసి" పదప్రయోగ విధానము తేటయగుటలేదు. విషయ మొక్కటియే యైనను ఈ తార్కికపద సంభ్రమము లేకుండ సులభ సమన్వయ మెట్టులనగ—జీవునకుగల అవిద్యా కల్పిత భావములను

అనగా "దేహం ప్రాణమింద్రియాణ్యపి చలాంబుద్ధించ శూన్యం విదుః" అను వాటిని, మాయాశక్తి కల్పిత విలాసములుగ (manifestations) గ్రహించి వ్యష్ట్య జ్ఞానమును తొలగించుకొనిన, జీవభ్రాంతి ప్రక్షాళితమై, శేషించునది భాసించునది అధిష్ఠానమగు ప్రత్యగాత్మయే. అటులనే జీవు డారాధించు ఈశ్వరునకు మాయాశక్తి యొక్క ఉపలక్షిత భావమును అపవదించిన భాసించునది, నిర్గుణ, నిష్కల, నిష్క్రియమగు, విభువగు, అధిష్ఠాన పరమాత్మయేగదా! జీవునకిట్లు మాయాకల్పిత మహావ్యామోహ ములు లేనిదే బ్రాహ్మీస్థితి! ఆ స్థితియందు దుపాధిరహిత ప్రత్యగాత్మను ఈశ్వరుని, ఒకే అధిష్ఠాన పదార్థముగ గ్రహించి యనుభూతి పొందుటయే "అసి" పదమునకు సార్థకత. ఈ స్థితియందు నామరూపములు లేవు. గనుక "తత్త్వమసి" అను వాక్యమే యుండదు. వ్యావహారికమున జీవ బ్రహ్మైక్య బోధకమగు నీ మహావాక్యముతోడనే దానిని రేఖారూపమున సూచించు చిన్ముద్రతోడనే సత్పదార్థము అసత్పదార్థముగ నెట్లు భాసించి స్ఫూర్తి జెందుచున్నదో ఉపాధులు అంతఃకరణ లేనియెడల అఖండమగు అద్వయమగు అధిష్ఠానమగు ఆనంద స్వరూపానుభూతి నెట్లు ప్రాప్త ప్రాప్తముగ నెరుంగనగునో బోధించెను.

చివర పాదమున దేనిని సాక్షాత్కరించుకొనినయెడల పునరావృత్తి నొందక భవాంబుధినిదాట సాధ్యమగునని చెప్పెనో అది అసత్కల్పార్థ ముగ నున్న సన్మాత్రమేయని సగుణ నిర్గుణములయొక్క ఏకత్వమును బోధించెను. అయితే సాక్షాత్కరించుకొనుటకు ఆయనకొక శరీరము, కాళ్లు, చేతులు, ముక్కు, కళ్లు యున్నగదా సాధ్యము? నిరాకారుడను చున్నదిగదా శాస్త్రము! మరి సాక్షాత్కార మెట్లుపొసగునో? అనగా సాక్షాత్కారమనునది అపరోక్షానుభవమే యని గ్రహింపనగును. ఇట్టి యనుభవము ఆ పదార్థమునందు (ఎఱ్ఱగా కాలిన యినుప గుండునందగ్ని

వ్యాప్తి నొందినట్లు) నీవును వ్యాప్తినొంది తాదాత్మ్యము నొందినప్పుడే స్వరూపానుభవము లభ్యము. ఇదియే తాదాత్మ్యమునకును తాదాత్మ్యధ్యానమునకుగల నడిసముద్రము.

"స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే సంశయంబువిడదు సాధకునకు చిత్రదీపమునకు చీకట్లు పోనట్లు ॥వి॥" అని వేమనయోగి దెలిపెను. "ప్రమాణమాత్ర శృణుమే ప్రత్యక్షం నామనేతరత్ ! సర్వప్రమాణ సత్తానామ్ వదమబ్ధిరపామివ । ప్రమాణ మేకమేవేహ । ప్రత్యక్షంతదతః శృణు॥ (He alone knows the aboslute reality who knows it by direct intuition) అని వశిష్ఠుడు జెప్పెను. కనుక సాక్షాత్కారమన స్వానుభూతి యని దెలియనగును. అట్టి యనుభవము నంతఃకరణము నంతర్ముఖముజేసి ధ్యానధారణ సమాధుల సాధించినప్పుడే గలుగును. సాక్షాత్కారమన దేనిని సంయమనముజేసి తదాకారవృత్తిని బొంది ఆ ధ్యేయము యొక్క నిజరూపముతో తాదాత్మ్యము జెందుటయే యని తెలియపలయును. అదియే పునరావృత్తి లేకుండ భవాంబుధిని దాటించునని తెలియపలయును. అనగా నిర్వికల్ప సమాధిస్థితిని సద్ధించుకొన్నవానికే, బ్రాహ్మీస్థితి యొక్క అనుభవ ప్రాప్తి గలుగునుగాని వడకకుర్చీ పాఠకునకు పారమార్థిక ప్రాప్తి గలుగదని బోధజేసిన దక్షిణామూర్తికి నమస్కారము.

4. శ్లో॥ నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం।
జ్ఞానం యస్యతు చక్షురాది కరణద్వారా బహిస్స్పందతే
జానామీతి తమేవ భాన్తమనుభాత్యే తత్సమస్తం జగత్
॥తస్మై॥

టీక :- నానాచ్ఛిద్ర = బహురంధ్రములుగల; ఘట=కుండయొక్క, ఉదర = లోపల; స్థిత = ఉంచబడిన; మహాదీప = పెద్ద దీపముయొక్క; ప్రభా = వెలుగు (వలె); భాస్వరం = ప్రకాశించుచున్న; యస్య = ఏ పరమేశ్వరుని యొక్క; జ్ఞానంతు = అంతఃకరణమందు ప్రతిబింబించి జీవచైతన్యము లేక సాక్షి చైతన్యమని వ్యవహరింపబడుచున్న జ్ఞానము (ఆభాసగాదు) చక్షురాది కరణ ద్వారా = జ్ఞానేంద్రియముల ద్వారా, బహిః = వెలుపల వస్తు దేశములకు లేక వస్తువులున్న ప్రదేశములకు, స్పందతే = ఇంద్రియములనుండి, ఇంద్రియార్థములు లేక భోగ్యవస్తువుల మీదికి ప్రసరించుటకు స్పందన (vibration) పొందుచున్నదో; జానామి+ ఇతి = దీనిని; ఇట్లు తెలిసికొనుచున్నాను. (ఎట్లు ?) అనగా భాన్తం = నిరపేక్షికముగ అనగా స్వయంప్రకాశుడై విషయములను ప్రకాశింపజేయుచు, తం-ఏవ = ఆ సాక్షిచైతన్యము లేక జీవచైతన్యమునే, అను = అనుసరించి; ఏతత్=ఈ; జగత్ = ప్రపఞ్చము; సమస్తం = అంతయు భాతి=ప్రకాశించుచున్నది, అనగా పరమాత్మ స్వరూప జ్ఞానమే ప్రకాశించుచున్నది. అట్టి పరంజ్యోతియగు దక్షిణామూర్తికి ఈ నమస్కారము.

తా॥ పలురంధ్రములు గల ఘటమునందలి జ్యోతియొక్క కాంతి వోలె ప్రకాశించు ఏ పరమాత్మ చైతన్యము చక్షురాదీంద్రియ గోళకముల ద్వారా, బహిర్గతాంతఃకరణ వృత్తి ప్రతిఫలితమై; ఘటాదిబాహ్యవిషయ ప్రకాశమగుచున్నదో, స్వయంప్రకాశమగు ఏ పరమాత్మ స్ఫురణము

ననుసరించి సమస్త జగత్తు భాసిల్లుచున్నదో అట్టి గురుమూర్తి, శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.

వివరణ : ఈ శ్లోకమునందు "జానామీతి" "తమేవ భాన్తమను భాత్యే" అను పదములు మననయోగ్యములు. ఈ శ్లోకమున ప్రతిపాదిత ప్రధాన భావము లేవియన :- 1. ఈ విశ్వమందు సర్వవ్యాప్త సామాన్య చైతన్యముద్వారా, జీవచైతన్యముచే వస్తుజ్ఞాన మెట్లు పొందబడుచున్నదో అట్టి ప్రక్రియ. 2. శుద్ధ నిర్గుణ చైతన్యము (absolute awareness) మనకు దృగ్గోచరముగాక యున్నది. ఐనను అనంతము, సర్వవ్యాప్తము, స్వయంప్రకాశము అగుటచే, దాని ననుసరించియే సర్వము ప్రకాశింపబడు చున్నవని తెలుపబడినది (Electricity has no incandiscence. Similarly the infinite Consciousness or absolute awareness could not be seen by the worldly minded. yet, its' manifestations could be seen and known when the chaitanya functions in the field of Buddhi—Just as the existence of electricity could be known as real only by its manifestation as light, heat or motion when it passes through the filaments and energise them). భౌతికశాస్త్రదృష్టితోనీ భావమును సుగ్రాహ్యము గావించుకొన వచ్చును. విద్యుత్తు అవ్యక్తము, అగోచరము, నిష్క్రియము. అది నిర్గుణ బ్రహ్మవంటిది. ఐనను, ఒక విద్యుద్దీపపు గోళకము (bulb) ను జేరినప్పుడు అందలి సూక్ష్మతంతువులు (filaments) దాని తాకిడికి తెల్లనివేడి (white heat) ని పొంది వెలుగును గలిగించి ప్రకాశించుట మన అనుభవమే. ఇచ్చట మూలపదార్థమగు విద్యుత్తు లేనిదే మన పనిముట్టు సూక్ష్మతంతువు (filament) క్రియాత్మకమై వెలుగునీయజాలదు. కాని గమనింపదగువిషయ మేమన విద్యుత్తే స్వతఃగా క్రియాత్మకము గాలేదు. ఇట్లే పంచాయందలి జడరూపమగు సూక్ష్మపరికరములు విద్యు

త్స్పర్శనొందనిదే పంకా తిరుగదు. ఇట్లే మనకర్ణేంద్రియము వినజాలదు. కాని వినుటయనుక్రియకు కర్తృత్వము ప్రజ్ఞానమునకు ప్రాప్తించుటలేదు. ఇట్లే మిగత జ్ఞానేంద్రియములపట్ల, మనోబుద్ధులపట్ల వర్తించుకొన వచ్చును. కీలకము : సత్తా ప్రకాశములు ఆత్మయొక్క సహజ స్వభావములేగాని ఆత్మయొక్క క్రియారూప ధర్మములుగావు. ఐనను జగత్తునందలి సర్వమును ఆ అధిష్ఠానజ్యోతి వినా ప్రకాశింపజాలవు. ఇందు కుదాహరణముగ కార్తికమున మనము వ్రేలగట్టుఛిద్ర ఘటమునందలి మరుగైయున్న జ్యోతి, దానినుండి ప్రసరితకాంతి పేర్కొనబడుట యంపౌచిత్యము సంపన్నము. ఘటఛిద్రముల నుండి ప్రసరిత కాంతివలననే మనకు వస్తుజ్ఞానము గలుగుచున్నది. అట్లే విశ్వమందునను, అజ్ఞాతమగు పరంజ్యోతి యొక్క వ్యాప్తదీప్తియే వస్తుజ్ఞాన ప్రాప్తికి హేతువని గ్రాహ్యాంశము. 3. మరియు నీ ప్రక్రియచే ప్రాప్తించు జ్ఞానము ఇంద్రియముల సంపర్కమువలనను అజ్ఞాన దోషము వలనను తాదాత్మ్యాధ్యాసకు కారణమై ప్రత్యగాత్మను మరుగుపరచు చున్నదనియు అనుమేయము (Inferable).

ఈ జగత్తు పాంచభౌతికము గనుక జడము, స్వప్రకాశత లేనిదియునై యున్నది. ఇందలి వివర్త విగ్రహముల యందును "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితిః" అనునట్లు, వానికి లోపల వెలుపల అధిష్ఠాన చైతన్యము నిండుగ వ్యాపించియే యున్నది. అధిష్ఠానము లేనియెడల ఆరోపముండదుగదా! దృశ్యమంతయు ఆరోపము. కనుక ఈ విశ్వాంతర్భాగములగు ఖనిజ, లోహ, శిలల యందును సామాన్య చైతన్యము వ్యాప్తమై అధిష్ఠానమై యున్నదని తెలియబడు చున్నది. సూదంటురాయి స్పర్శచే ఒక చిన్నమేకు కూడ ఆకర్షణ శక్తిచే ప్రభావితమగుట మన అనుభవమునందలి విషయము.

అట్లే మనయందు సత్వగుణాంశయగు అంతఃకరణముండి దాని యందు చైతన్యము ప్రతిబింబించుటచే జడమగు మనస్సు చైతన్య ప్రభావితమై, జీవచైతన్యమని, చిదాభాసుడని వ్యవహరింప బడుచున్నది. When consciousness functions in the intellect which is of the nature of Rajas then only what we call intelligence (to know things & concepts) beamsout. మనము చూచునప్పుడు పరంజ్యోతి, వెలుగుకిరణముల (rays of light) ప్రభావితముజేయును, వినునప్పుడు శబ్దతరంగముల Waves of sound) ప్రభావితముజేయును. ఇటులనే ప్రతి మనోభావమును (every thinking process and the waves of thought that are projected) ఆ జ్యోతిచే ప్రభావితము జేయబడిన మనస్సుచేతనే తెలియబడును. *జడము అనుకొనబడువాటియందు సామాన్యచైతన్యము, చేతనము అనుకొనబడువాటియందు జీవచైతన్యము ఉండుననుటయు, ఏ స్థాయినగాని ఏ రూపమునగాని చైతన్యము అంతర్యామియు, అధిష్ఠానము అగుటయే ప్రధానముగ తెలియనగును.

ఈ ప్రక్రియను వివరముగా దెలిసికొనుటకు సామాన్యచైతన్యము సర్వవ్యాపకమై యున్నదని, సర్వముతో నంతర్భూతులమగు మన యందును ఉన్నదని తెలియవలెను. ఐననూ తెలిసికొనుశక్తి అంతఃకరణకుమాత్రమే గలదు. అందుకే దానిని 'లోపలిపనిముట్టు' అని వ్యవహరింతురు. ఇప్పుడు జడములగు నీ విషయముల జ్ఞానము మన కెట్లు లభించుచున్నదో తెలిసికొందము. నేత్రములద్వారా యని యందురు. నేత్రములు కెమెరావంటి సాధనములు మాత్రమే గనుక తెలిసికొన సమర్థములు గావు. అయితే అంతఃకరణము దానియందున్న జీవచైతన్యము, ఆ యింద్రియార్థ మున్నచోటుకుపోయి ఆ వస్తువునందుగల అధిష్ఠాన

చైతన్యముతో నేకీభవించినందున, అంతఃకరణము అవస్థాకారవృత్తిని పొందిన, ఆ వృత్తియందు ప్రతిబింబించిన చైతన్యము ఆ వస్తువిషయక జ్ఞానము మనకు గలిగించును. మన మనస్సునకు ఆ విషయమునకు మధ్యప్రదేశమందుకూడా సామాన్య చైతన్యము వ్యాప్తమైయున్నందుననే ఈ ప్రక్రియకు అవకాశము గలుగుచున్నదని గుర్తుంచుకొనవలయును.

ఆధునిక భౌతికశాస్త్ర విజ్ఞానముకూడ యీ భావమున కాలంబనము నిచ్చుచున్నది. Ether అను అవ్యక్తపదార్థము అనుకొనుడు, మరియొక electromagnetic తరంగరూప పదార్థమనుకొనుడు— సర్వవ్యాప్తముగలేనిదే మన రేడియోతరంగములుగాని శబ్దతరంగములు గాని దేశదేశాంతరములకు ప్రసరింపబడజాలవుగదా. ఆకాశములేనిదే శబ్దము ప్రసరింపబడదు. టెలిప్రింటుతో మద్రాసులో టైపుజేసిన వాక్యములు, కలకత్తాలో కాగితముపై టైపు అగుచుండుట మన అనుభవములోని విషయమేగదా! కనుక ఒక పదార్థము మధ్యస్థముగ (medium) లేని యడల శబ్దతరంగములుగాని రేడియో తరంగములుగాని ప్రసారము గాజాలవు. వార్తలు నిస్తంతువులుగ దూరప్రదేశములకు ప్రసారము గాజాలవు. సర్వ వ్యాపకభావమున కీ యుదాహరణము చాలదా?

లోకమున తన కాంతికిరణములచే చీకటిని బోగొట్టి మనకు వస్తువుల స్వరూపజ్ఞానమునొసంగు సూర్యుడును స్వప్రకాశుడుగాడు. ఏలనన, ఆత్మచే నాతడు ఎరుంగబడుచున్నాడుగాని ఆత్మ ఆయనచే ప్రకాశింపబడుటలేదు. ఆతనియందును అధిష్ఠాన చైతన్యము నిండియున్నది గనుకనే వీనిని ప్రకాశింపజేయ గలుగుచున్నాడు. తానును ప్రకాశింపబడుచున్నాడు. అయితే సూర్యుడు మనకు కనిపించుచున్నాడు. కాని మన శరీరమున నిండియుండి, అంతఃకరణముతోగూడి విషయములమీదికి ప్రసరించి, ఆ వస్తుగత అధిష్ఠానమునందలి యావరణను తొలగించి,

వస్త్వాకారవృత్తిని గలిగించి, ఆ వస్తువిషయక జ్ఞానమును మనకు గలిగించు చున్న మనలోపలి సూర్యుడగు ప్రత్యగాత్మ మనకు కనిపించడు. కనుకనే "ఆత్మానం విజానీయాత్" అను శ్రుతివాక్యము నిన్ను నీవు తెలిసికొనుమని ప్రబోధించుచున్నది. ఈ అంతఃకరణమును బహిర్ముఖముగ ప్రసరింప నిచ్చిన, వృత్తిజ్ఞానము గలిగి తాదాత్మ్యాధ్యాసప్రాప్తించును. అంతర్ముఖము జేసి ఏకాగ్రముగ నొనర్చిన ప్రత్యగాత్మ తానే పరమాత్మనని గ్రహించి అనుభూతిపొందును.

ఈ శ్లోకమునందలి భావములకు, కార్తికమాసమున ఆకాశదీపమను పేరుతో వ్రేలగట్టు ఛిద్రదీపఘట ముదాహరణముగ జెప్పబడినది. ఈ కుండ యొక్క రంధ్రములు మన జ్ఞానేంద్రియ మనోబుద్ధులవంటివని వీని నుండియే మనలోపల అజ్ఞాతముగనున్న ఒక జ్యోతియొక్క చైతన్యమను వెలుగు బహిర్గతమై వస్తుజ్ఞానము గలిగించుచున్నదనియు దెలిపిరి. కుండయొక్క రంధ్రములను అలంకారమునకు రంగురంగుల యద్దపు ముక్కలతో నాచ్ఛాదనజేసినయెడల నా కాంతి, రంగురంగులుగనే బహిర్గతమగును. ఈ రంగుల వెలుగుకు కుండరంధ్రముల నాచ్ఛాదించిన రంగుటద్దములే కారణమగుచున్నవి, అటులనే నిత్య జ్ఞానాత్మకుడగు ప్రత్యగాత్మ అంతరమైయుండ (జ్యోతివలె) మనోబుద్ధీంద్రియముల గుండా, ఏకైకమగు ఆ యనుభవాత్మక జ్ఞానమే, చూచుట, వినుట, ఆలోచించుట మున్నగు రూపములతో వ్యవహారమున ప్రసిద్ధమగుచున్నది. ఇట్టి వ్యవహారములలో ఆ యా ఇంద్రియములు కుండరంధ్రముల వంటివేయగును. విశేషమేమన, సాధనముల భేదముచే సర్వాత్మకమగు ఏకరూపాత్మకబోధము, చైతన్యము వివిధరూపములలో భాసించుట కవకాశము గలిగినది. కనుక లోకమందు గనిపించు ఈ వైవిధ్యములు (diversity) వైచిత్ర్యములు (differences in temperaments)

ఉపాధిధర్మములేయని గ్రహించనగును. ఇంద్రియానుభవములు వేఱుగ నున్ననూ విశేష్యమగుబోధము ఏకరూపముమాత్రమే. దేహేంద్రియ మనోబుద్ధ్యహంకారముల తాదాత్మ్యముతో విశేషణములుగ స్ఫూర్తి నిచ్చు చున్నది. విశేష్యమగు ఏకాత్మకబోధయే కుండలోని పెద్దదీపజ్యోతి. చిల్లులలోనుండి వెలువడి వేఱువేఱుగభాసించు జ్యోతులే ప్రత్యగాత్మలని (చంద్ర చంద్రికల కనన్యత్వమువలె) గ్రహించవలెను.

ఇక "జానామీతి తమేవభాన్తమను భాత్యేతత్సమస్తంజగత్" అనగా ఇట్లు తెలిసికొన్నాను ఎట్లు ? ఈ విశ్వమున స్వయంప్రకాశమగునది చైతన్యముదప్ప మరేదియులేదు. ఎవ్వని ప్రకాశముననుసరించి యీ జగమునందలి సర్వము స్ఫూర్తిని బొందుచున్నదో అట్టివానిని తెలిసి కొనుచున్నాను. (అని.) కుండలోని అసలు జ్యోతి కనిపించకపోయినను, చిల్లులద్వారా బయటకివచ్చిన కాంతి అజ్ఞాతముగ కుండయందున్న నిజ జ్యోతిదేగదా! మన శరీరమను నవరంధ్రముల కుండలోని జ్యోతియగు ప్రత్యగాత్మ "నవరంధ్రములదేహి నవ్యవేణువుజేసి శ్రీమీరగానంబు జేయువాడు" అనినట్లు (మా మిత్రుడు స్వర్గీయ మోహంతం లక్ష్మీకాంత కవి పద్యములోని పాదము) ఈ చిల్లులద్వారానే బయటకు ప్రసరించి — తనకు తాను అనుభవములోనుండు, జాగ్రత్స్వప్నములయందు, తన ప్రకాశాత్మక అనుభవమే— దీపపుకాంతి అద్దములో ప్రసరించు ఎఱుపు, పసుపు, పచ్చ, నీలి, నారింజరంగులతో మెఱయునట్లు నామరూపముల యందు, వ్యాపించి వానికి స్ఫూర్తిగలిగించుచున్నది, "నేనే, నేనే", యని పరమాత్మగానము చేయుచున్నాడు. రంగుటద్దములకు వస్తుతః కాంతిలేనట్లు ఈ నామరూప ప్రపంచమునకునూ స్వతః సహజముగ స్ఫూర్తిసత్తలు లేవు. ప్రత్యగాత్మ యొక్క సత్తాస్ఫూర్తులే నామరూపములయందు సంక్రమించెననియు, గనుక ప్రత్యగాత్మ సచ్చిదానందస్వరూపము, అద్వయమునగు పరమాత్మయేయని బోధించు గురుదక్షిణామూర్తికి నమస్కారము.

---

5. శ్లో॥ దేహం ప్రాణ మపీంద్రియాణ్యపి,
చలాం బుద్ధించ శూన్యం విదుః॥
స్త్రీబాలాంధ జడోపమా స్త్వహమితి
భ్రాంతా భృశం వాదినః
మాయాశక్తి విలాస కల్పిత
మహావ్యామోహ సంహారిణే. ॥తస్మై॥

టీక : దేహం = శరీరమును, ప్రాణం అపి = ఈ శరీరమందు పంచవిధ కార్యములుజేయు రజోగుణ ప్రధానమగు శక్తిని; ఇంద్రియాణ్యపి = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను; చలాం బుద్ధించ = దీపకళిక యందలి యంశలు ప్రతిక్షణము పుట్టుచూ, నిర్గమించుచు నున్నప్పటికి దీపకళికమాత్రము అదేరూపమున గన్పించుచున్నట్లు, వృత్తులు క్షణే క్షణే మారుచున్ననూ, ఒకటిగనేగన్పించు బుద్ధిని; (ఇది బౌద్ధమున క్షణిక విజ్ఞానమని, ఆంగ్లమున Existentialism అని పేర్కొనబడిన సిద్ధాంతములో Strema of concsiousness అను భావమునకు తుల్యము అని అందురు. అనగా We do not see the permanent significance of the world external, because it is changing from moment to moment; శూన్యం = శూన్యము నిస్స్వరూపము; స్త్రీ–బాల–అంధ–జడోపమాః = వివేకములేని స్త్రీలు, బాలురు, అంధులు, జడులు, ఉపమానముగాగల; భ్రాన్తాః = ఒక తత్త్వమును ఇంకొకటిగా గ్రహించి భ్రాంతిజెందిన; భృశం = మిక్కిలి; వాదినః = ఆయా వాదములజేయువారు; అహమ్ ఇతి = ఆత్మయని, (నేనని)

శరీరమే ఇంద్రియములే ప్రాణమే ఆత్మయని, బుద్ధియే ఆత్మయని విదుః = తెలిసికొనుచున్నారు; మాయాశక్తి = అపరాప్రకృతికి చెందిన సత్వరజస్తమో గుణాత్మకమగు భౌతికశక్తి, (పరాప్రకృతికి జెందిన యోగమాయగాదు) యొక్క; విలాస-కల్పిత = అజ్ఞానపరిణామ రూపకమగు విలసన (manifestation) ప్రభావముచేత కల్పింపబడిన_ మహావ్యామోహసంహారిణే = వివర్తరూపమగు గొప్ప వ్యామోహమును అనగా దేహాద్యాత్మభ్రాంతిని పోగొట్టునట్టి లేక తాదాత్మ్యాధ్యాసను బోగొట్టునట్టి; ఆ శ్రీ గురుదక్షిణామూర్తికి నమస్కారము.

తా॥ ఆత్మను గురించి బహువాదములుగలవు. శరీరము, ప్రాణము, ఇంద్రియములు, క్షణిక విజ్ఞానము, శూన్యము, ఆత్మయని ఆయా వాదులు చెప్పుచున్నారు. వీరు స్త్రీ, బాల, అంధ, జడులను బోలిన అవివేకులు; భ్రాన్తులు. పరమేశ్వర మాయాశక్తి మహాప్రభావముగలది. వ్యామోహ why ? పఱచి భ్రాంతిజ్ఞానము గలిగించును. ఆ వ్యామోహమును పోగొట్టి యనుగ్రహించు ఆ గురుదక్షిణామూర్తికి నమస్కారము.

ఈ శ్లోకమునందు తాదాత్మ్యాధ్యాసయను దేహాత్మబుద్ధి మాయాశక్తి వలన గలుగుననియు 'ఆత్మానం విజానీయాత్' నిన్ను నీవు తెలిసికో అనియు చెప్పబడినది.

ఈ సందర్భమున తాదాత్మ్యాధ్యాసయన నెట్టిదో గ్రహించుట సముచితము. తాదాత్మ్యభావము గ్రహించుటకు విశేష్యమన నెట్టిది ? విశేషణమన నెట్టిదని తెలియవలయును. (the qualified and the qualifying). "ఎఱ్ఱని కలువ" అనుపదమున ఎఱ్ఱని విశేషణము, కలువ విశేష్యము. "తెల్లని స్ఫటికము" అను పదమున తెల్లని విశేషణము, స్ఫటికము విశేష్యము. ఇప్పుడు కలువ స్ఫటిక సామీప్యమున మనకు కనిపించునట్లే యున్నదనుకొనుడు. కలువయొక్క ఎఱుపు స్ఫటికము

నందు ప్రతిఫలించుచున్నది. స్ఫటిక మెఱుగానున్నది. ఈ స్థితిని అన్యథా ఖ్యాతి యందురు. కలువ స్ఫటిక సమీపముననుంట మనకు తెలియలేదు కనిపించలేదనుకొన్నయెడల స్ఫటికమునందలి ఎఱుపు నైజగుణమనియే తలంతుము. ఇప్పుడు విశేష్యమగు స్ఫటికము విశేషణమగు ఎఱుపు రెండు తాదాత్మ్యము జెందినవి. అనగా ఏకీభావము జెందినవి. స్ఫటికము యొక్క సహజవర్ణమే ఎఱుపు అని మనము భావించుటయే తాదాత్మ్యాధ్యాస. అనగా స్ఫటికమునకు తెలివి యుండినయెడల నేను ఎఱ్ఱటి దానననని భావించుటయే తాదాత్మ్యాధ్యాస.

మన విచారణయందు ఆత్మ—స్థూల సూక్ష్మకారణ శరీరములలో ఆయా యవస్థలయందు తాదాత్మ్యము జెంది వాటినభిమానించును. "అనగా ఆదినేనే" అని భ్రమజెందుము. మనోబుద్ధ్యహంకారములను తనవిగా భావించి కర్తృత్వ భోక్తృత్వములను తనకే ఆరోపించుకొని వాని ధర్మములు తనవిగా భావించుకొని విశ్వసించును. ఇదియే తాదాత్మ్యాధ్యాస. ఈ అధ్యాస గలిగిన మానవుడే సంసారి. ఈతడు సుఖదుఃఖముల ననుభవించుచు ఒక దేశమునకు ఒక కాలమునకు పరిమితుడై కించిజ్జ్ఞుడై, అల్పుడై, తన్ను జీవాత్మగా భావించుకొనును. తన ప్రత్యగాత్మస్థితి, ఏకాత్మ లేక సర్వాత్మస్థితి భాసింపదు.

వివరణ :— అపరదక్షిణామూర్తియగు ఆదిశంకరులు దృక్—దృశ్య-వివేకము" అనునొక గొప్ప చిన్నపుస్తకమును రచించిరి. అందు గురు శిష్య సంవాదరూపములో, వేదాంత శాస్త్రమునకు మూలస్తంభము వంటి భావము "నీ వెవరు ?" చూచువాడవగు దృక్వా ? చూడబడు దృశ్యము లోని వాడవా ? అని చర్చించిరి. అదే విషయము ఈ శ్లోకమున చర్చా రూపమునగాక ప్రతిపాదన పూర్వకముగ జెప్పబడినది. కొందఱు లేక

జనసామాన్యము "నేను" అను శబ్దముచే తెలియబడునది. ఈ స్థూలముగ తెలియబడు శరీరమే దేహ మందురు. వాడు పొడుగు, వీడుపొట్టి, వాడు ఎఱుపు, వీడు నలుపు, వాడు లావు, వీడు సన్నము, వాడు కుంటి, వీడు గ్రుడ్డి యను విశేషణములు విశేష్యమగు నీ స్థూల శరీరమునకు వర్తించును గనుక ఆత్మ లేక నేను అని చెప్పబడునది యీ దేహమేయని చెప్పుదురు. ఈ భావమునకు అనుగుణముగ వీరి జీవితాశయములు, ఆ యాశయసిద్ధికై చేయుకృషి (culture) విధానము నిర్దేశింపబడును. దేహమే ఆత్మయనువారికి ఆనందము అర్థలాభము, దేహపోషణ కామతృప్తియందే ప్రాప్తించును. అవియే యాతని పురుషార్థములు. సర్వము ఈ దేహముతోనే అంతమగును. కర్మలఫలములు నశించును. మఱల దేహధారణపూర్వకమగు పునర్జన్మలేదు. కంటికి ప్రత్యక్షముగా కనిపించునదియే (తత్త్వమునకు) ప్రమాణము పంచభూతముల కలయికచేతనే శరీరములు వస్తురూపము లేర్పడుచున్నవి. ఆహారపదార్థ సారముల కలయికచేతనే ప్రాణశక్తి క్రియాశక్తి గలుగుచున్నది అందురు. గాని పుష్టికరమగు ఆహారమునెంత హెచ్చుగా నిచ్చినను దేహమేల కృశించి ప్రాణశక్తి క్షీణించి మరణమేల ప్రాప్తించుచున్నదో తెలియలేరైరి. వీరికంటె మేధావులగువారు, నేను చూచుచున్నాను. నేను వినుచున్నాను, నేను పాడుచున్నాను అను వ్యాపారము లీజ్ఞానేంద్రియములు జేయుటవలననేగదా శరీరము నిలచియుండుట, కనుక నీ యింద్రియములే ఆత్మవాచకములందురు. ఇంకను హెచ్చు మేధాసంపన్నులు ఆకలి, దప్పిక, జీర్ణశక్తి, పోషకక్రియ, శ్వాసక్రియ, రక్తప్రసరణక్రియ, విసర్జనాదిక్రియలు ప్రాణమున్నంతవరకే గదా జరుగుట ; ఈ దేహము నిలచుట ; కనుక ప్రాణమను పదమునకు లక్ష్యమగునదియే ఆత్మయందురు. మరికొందఱు మనస్సే ఆత్మ

యందురు. కాని నామనసు క్షోభగా యున్నది. నా మనసు ప్రసన్నముగ నున్నది, నా మనస్సు ఖేదముగనున్నదని వ్యవహరింతురే, ఈ మనసు యింకేవరో నా యనువారిదిగ నున్నదే! 'నా' అను వారెవ్వరని శంక గలుగుచున్నది. మరికొందఱు—బుద్ధి ప్రాణశక్తినికూడా క్రియాత్మకముగ జేయును. బుద్ధి నిర్ణయించి అనుమతించనిదే ప్రాణశక్తిగాని యింద్రియ ములుగాని సమర్థములుగావు కనుక బుద్ధియే ఆత్మపద లక్ష్యార్థమందురు. కొందఱు మేధాసంపన్నులు బుద్ధినే ప్రమాణముగ నంగీకరించువారు (వీరినే బౌద్ధులందురు) ఈ బుద్ధి దీపకళిక వంటిది. స్థితిగలిగియున్నట్లు గోచరించినను, ప్రతిక్షణము తన యంశలు పుట్టుచు నిర్గమించుచున్నం దున నిది క్షణికమేయనిరి. అది యెట్లన ఉదాహరణకు ఒక సినీమా ఫిలింరీలును పరిశీలించిన అందు అనేక బొమ్మల క్రమము గనిపించును. ఆ క్రమములోనవి జరుగునప్పుడు ఒకేక్రియ అనుస్యూతముగ గన్పిం చును. ఇంకొక యుదాహరణ తీసికొందము. దీపావళికి ఒక త్రాటి రెండుకొనలకును రెండు పూలపొట్లములుగట్టి వెలిగించి ఆ త్రాటిని మధ్య పట్టుకొని గిఱ్ఱున గుండ్రముగా త్రిప్పినయెడల ◯ అట్లుండవలసిన వెలుగు యిట్లు ◯ విరామరహితముగ గోచరించును. దీనినే అనగా పుట్టుచు నిర్గ మించుచున్నను ఏకవృత్తాకారముగ స్ఫూర్తినిచ్చునదియేక్షణిక విజ్ఞానవాద మందురు. ఇట్టి బుద్ధియే "నేను" అను ఆత్మకు పరమార్థమని బౌద్ధుడగు యోగాచార్యుడు తన క్షణిక విజ్ఞానసిద్ధాంతమున జెప్పెను. ఈ బుద్ధి చల రూపముగనుక నిది యాత్మ కాజాలదని శఙ్కరులు త్రోసిపుచ్చెను. సరి! బుద్ధి అనుస్యూతముగ లేదంటిరిగదా! ఒక పనిని నిన్న కొంతవరకుజేసి, నిలిపి, మరల నీరోజున మొదలుబెట్టి చేయసంకల్పించినయెడల—బుద్ధి వృత్తి నిన్నటితో ఆగిపోయి యీ రోజు మరల ప్రారంభమగునెడల నిన్నటివని, యేప్రక్రియతో జేసినదీ, ఎక్కడ ఆపినదీ తెలుపువా రెవ్వ రని ప్రశ్నగలుగుచున్నది. కనుక విజ్ఞానము క్షణికమైనను దాని ఆది,

మధ్య, అంతముల గమనించి గుర్తించుకొను జ్ఞానస్వరూపుడు నిత్యుడు, యింకొకరు గలరని ఆతడే ప్రత్యగాత్మ లేక పరమాత్మ యనిరి. శః జ్ఞానమునే ఆలయవిజ్ఞానమని అందురు. ఇది, ఇవి (This) యని వ్యవహరింపబడునది ప్రవృత్తి విజ్ఞానమని శంకరులు బోధించిరి. నిశ్చలమగు ఆలయవిజ్ఞానమే ప్రకాశము. క్రియాత్మకమగు ప్రవృత్తి విజ్ఞానమే విమర్శ.

సుషుప్తియందు ఏ విజ్ఞానము ఉండదుగనుక శూన్యస్థితి పర్యవసించును. జాగ్రత్స్వప్నములయందువలె నిద్రావస్థయందు ఆత్మయు దృక్కుగా గన్పించదుగనుక ఆ శూన్యమే ఆత్మయని కొందఱు మాధ్యమికులనబడు బౌద్ధశాఖవారు చెప్పుదురు. అయితే జాగ్రత్స్వప్నముల యందువలె సుషుప్తిలో విషయములు ఆత్మానుగతముగ గన్పించనందున అజ్ఞానమున్నది. అట్టి అవిద్యావృత్తియందు ప్రతిఫలించిన ఆనందము, అనగా అవిద్యాకార అవిద్యావృత్తి అను జ్ఞానానుభవమునే ఆనందముతో ననుభవించుస్థితి నిద్ర. సుషుప్తిలో నుండునది శూన్యముగాదు అజ్ఞానము మాత్రమే శూన్యమే యున్నదనుకొన్నను ఆ శూన్యస్థితిని గుర్తించి చెప్పునదెవ్వరు ? ఇందుకు జ్ఞానస్వరూపమగునొక ఆత్మ యుండవలెనుగదా ? * కనుక ప్రత్యభిజ్ఞచే ఆత్మ త్రివిధావస్థలయందును అనుగతముగ నున్నదనియే తెలియవలయును. * కనుక అధిష్ఠానచైతన్యమును, కూటస్థచైతన్యమును వేదాన్తదర్శనమున శంకరులు బోధించిన విధముగా గ్రహించనేరనివారు జ్ఞానోదయము గానందున అజ్ఞానులుగ నున్న బాలురవంటివారు; శాస్త్రజ్ఞానముచే ప్రబోధముగలుగని జడులు; జ్ఞాననేత్రములేని అంధులవంటివారే యనియు తెలుపబడినది. ఇట్టివారు దేహేంద్రియ బుద్ధ్యహంకారములే ఆత్మయని భావింతురు. భ్రాంతిజ్ఞాన జన్యములగు తమ వాదములను గొప్పగా ప్రచారముజేయుదురు. ఇదియే

మాయాశక్తి విలాస–కల్పిత మహావ్యామోహము. ఈ భ్రమకు, తన కర్మ బీజముల (**karmic principles**) సందోహము, వాస, నలబలము, సంస్కార ప్రభావములు కారణము. ఈ భ్రమ పుట్టించు పనిముట్టు రజస్తమో గుణ ప్రాబల్యముగల మాయాశక్తియే; ఉపాదానము అనాదియగు మూలాజ్ఞానమే. సత్యవస్తుజ్ఞానమే, తత్త్వదర్శనమే యీ వ్యామోహజనిత విలసనముల తొలగింపగలదు. మాయచే సంభవమునొంది గోచరించున వన్నియు దృశ్యములేననియు, దృశ్యములెప్పుడు నశ్వరములేయనియు, దేహేంద్రియ బుద్ధులను ప్రకాశింపజేయునది శుద్ధచైతన్యమేయనియు, అట్టిది ప్రతివ్యక్తియందును అనుస్యూతముగ నున్నదనియు, దానిని గుర్తించి, తన్నుతాను దెలిసికొనిన 'అహం' పదవాచ్యుడు పరమాత్మయే యనియు అద్వయసిద్ధాంత బోధజేయు శ్రీ గురుదక్షిణామూర్తికి నమస్కారము.

1. సామాన్య చైతన్యము
2. కూటస్థ చైతన్యము
3. అధిష్ఠాన చైతన్యము



6. శ్లో॥ రాహుగ్రస్త దివాకరేందు సదృశో
మాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽ
భూత్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః
ప్రత్యభిజ్ఞాయతే ॥తస్మై॥

టీక :– యః పుమాన్ = ఏ పరమ పురుషుడు; కరణోప సంహరణతః = రూపాది విశేష జ్ఞానమును గలిగించు ఇంద్రియములు తమ సహజవ్యాపారములుచాలించి కుంచుకొనియున్నందున; సన్మాత్రః = కేవల సద్రూపుడై, మాయసమాచ్ఛాదనాత్ = తమోగుణప్రాబల్య కార్యమగు మూల జ్ఞానావరణమువలన; రాహుగ్రస్త దివాకరేందు సదృశః = గ్రహణ సమయమునందు రాహువుచే గ్రహింపబడిన సూర్యచంద్రుల పోలినవాడై; సుషుప్తః = గాఢనిద్రావస్థకులోనై; అభూత్ = ఉండెనో; యః=ఎవ్వడు; ప్రబోధసమయే = మెలకువకాలమునకు; ప్రాక్ = పూర్వము; అస్వాప్సమ్ ఇతి = నిద్రించితిని అని; ప్రత్యభిజ్ఞాయతే = గుర్తింపబడుచున్నాడో; (being recognised) అనగా ఏ నేను యింతకుముందు సుఖముగా నిద్రపోతినో ఆ నేనే యిప్పుడు మేలుకొని యున్నవాడను అని నిద్రావస్థయందుండిన తనను స్మృతిచేత ఇప్పుడు పోల్చి గుర్తించుకొనుచున్నాడు. నిద్రయందలి తనయనుభవమును జాగ్రత్తునందు గలిగిన స్మృతిని సమానాధికరణము (Basis) గా తెలియుచున్నాడు. సుషుప్తిలో ఆత్మలేకపోలేదు; సుషుప్తికి సాక్షిగాను నున్నాడు; అట్టి ఆత్మస్వరూపుడగు దక్షిణామూర్తికి నమస్కారము.

తా॥ జీవునకుగల జాగ్రత్స్వప్న సుషుప్తులను స్థితులలో ఒకటగు సుషుప్తిస్థితిలో తన ఇంద్రియ వ్యాపారము లుపసంహరింపబడియున్నను: అందుచే నెట్టివ్యాపార మప్పుడు కన్పట్టకపోయినను, సద్రూపుడుగ, సాక్షి మాత్రుడుగనుండి ఆ యానందానుభూతిని పొందుచునేయున్నాడు. మెల కువగలిగి, జాగ్రత్తులోనికి వచ్చినప్పుడు, ఏ నేను సుషుప్త్యవస్థలో సుఖము ననుభవించితినో ఆ నేనే యిప్పుడు జాగ్రత్తునందు, మరల జ్ఞానేంద్రియముల వ్యాపారములతో యీ లోకవ్యవహారముల గమనించి అనుభూతుల పొందుచున్నాను—సఏవాఽహం (అతడినే–నేను) అను జ్ఞానమును పొందుచున్నాడు. ఉ॥ శీతాకాలములో మంచుగడ్డల మధ్య కాశ్మీరులో ఆనాడు చలిబాధపడిన ఆ గోపాలరావు ఈ రోజు తెనాలిలో గ్రీష్మకాలములో వడగాలిబాధ పొందుచున్న నేనే, అతడినే–నేను అని అప్పటి యనుభవమును ఇప్పటి స్మృతిని పురస్కరించుకొని తెలిసి కొనుటయే ప్రత్యభిజ్ఞ. ప్రతి=మరల, అభిజ్ఞ=గుర్తు. అనగా అనుభవము నకు స్మృతికి సమానాధికరణమని భావము equal basis or తుల్యమగు ప్రాతిపదిక.

వివరణ :— ఈ ప్రపంచమున సూర్యగ్రహణము, చంద్రగ్రహణము మన యనుభవములోని సంఘటనలే. అయితే వానిని మనమెలా గ్రహించుచున్నాము ? సూర్యుడు రాహువుచే మ్రింగబడుచున్నాడని, అందుచే చీకటి వచ్చినదని చెప్పుదుము. కాని గ్రహణసమయములయందు సూర్యచంద్రులస్థితి యేమి ? వారు నిజముగా మరియొక గ్రహమునోట బడి స్వరూప స్వప్రకాశముల గోల్పోయినారా లేక వారి స్వరూపస్వభా వముల ట్లేయుండియు, కారణాంతరములచే మనకట్లు గోచరించెనా ? అని విచారించినయెడల ఏ కారణముచే ఆ సంఘటనజరిగెనో, అది భూమి యొక్క ఛాయ యనుడు, లేక ముక్కు, కళ్లు, నోరుగల బృహద్భూతము

యొక్క నోరనుకొనుడు, అది తొలగిన వెంటనే స్వస్వరూప ప్రకాశములు మనకు గోచరించుచున్నవిగదా! దీనినిబట్టిచూడ అసలు సూర్యచంద్రుల స్వరూప స్వభావములయందేమార్పును లేదని, ఊహకందనందున మనమే భ్రాంతిజ్ఞానముచే అట్లు భావించితిమనియు తాత్పర్యము గలుగుచున్నది. గ్రహణము విషయములో సూర్యచంద్రులు భౌతికములు, రాహువు భౌతికము. గనుక సూర్యుని యాపరించెనన్న, అంగీకారయోగ్యముగ నుండునుగాని, ఆత్మభౌతికముగాదు, అజ్ఞానము భౌతికముగాదు. చీకటిని వెలుగు పోగొట్టగలదుగాని వెలుగును చీకటి యాపరించుటలేదుగదా! అజ్ఞానము, ప్రజ్ఞానమగు పరమాత్మ నెట్లాపరించగలదను శంకగలుగు చున్నది. సూర్యుడు స్వప్రకాశుడే గాని యెడల రాహువుచే గ్రసింపబడుచే తెలియదుగదా! అట్లే అజ్ఞానమునకు స్ఫూర్తి నిచ్చునది స్వప్రకాశుడగు నాత్మయే. జ్ఞానాఽజ్ఞానములు రెండునూ మిధునరూపమున నుండునని గ్రహించిన యీ సమస్యకు సమాధానము లభించును. అధిష్ఠానజ్ఞానము గలిగినప్పుడు అజ్ఞాన స్వరూపము మనము గ్రహింపగలము. అధిష్ఠాన బ్రహ్మయొక్క అనగా సర్వవ్యాప్త చైతన్యమును గురించిన సామాన్య జ్ఞానముతో అజ్ఞానమునకు బాధగలుగదు. మీదు మిక్కిలి ఆ చైతన్యము చేతనే అజ్ఞానము స్ఫూర్తి నొందును. బ్రహ్మాకారవృత్తియందు మాత్రము జ్ఞానముచే అజ్ఞానము బాధింపబడును.

ఈ శ్లోకమున ప్రధాన గ్రాహ్యాంశము "శూన్యమే ఆత్మ" యను సిద్ధాంతము నపవదించుట. గాఢ సుషుప్తియందు నిద్రాసుఖమును గుర్తించునది జాగ్రత్తునందు యింద్రియములద్వారా జ్ఞానసముపార్జన జేయు అంతఃకరణముగాదు. సుషుప్తియందు ఇంద్రియము లుపసంహరింపబడియున్నందున అంతఃకరణము లయమైయుండును. అయినను అంతకంటెను విశిష్టమగు ఆత్మయనునది యొకటియున్నది. అదియే

స్వతంత్రముగ ఆనందానుభూతిని పొందుచున్నదనుటయే. సుషుప్తిలో అంతఃకరణ అజ్ఞానవృత్తినొంది సుఖానుభూతినొందుచుండ ఆత్మ ఆస్థితికి సాక్షిగానుండును. వేదాంత విచారణలో సుషుప్త్యవస్థకుగల స్థానము ఈ బోధకొఱకేయగును. సుఖస్వరూపుడుగా ఆత్మప్రతీయమానుడైనట్లు మనము దర్శింప (understand) వలెను. స్వప్నావస్థకు స్థానము ఆత్మాధిష్ఠానమును బోధించుటకు. జాగ్రదవస్థకు స్థానము : అపరోక్షాను భూతి గలిగిన తరువాత జాగ్రత్తుకూడా స్వప్నమువలె మిథ్యయే యగునని దెలియుటకు మూలాజ్ఞానోపహితములై యున్నందున ఇంద్రియములు సమకూర్చునది మిథ్యాజ్ఞానమని తెలియుట, గాఢనిద్రలో మనమందరము సుఖమునసుభవించి, నిద్రలేచిన తరువాత ఆ నిద్రయందలి సుఖానుభూతి స్మృతియందు ప్రతిఫలింపగా, దానిని మరల ననుభవమునకు దెచ్చుకొని ఆ సుషుప్తి సుఖమునసుభవించినది యిప్పుడు జాగ్రత్తులోనున్న నేనే, యను ప్రత్యభిజ్ఞ పొందుచున్నాము. (ప్రతి=మరల: అభిజ్ఞాయతే=గుర్తుకు దెచ్చుకొనబడుచున్నది.) జ్ఞానేంద్రియము లుపసంహృతములై అంతః కరణ మంతర్ముఖమైనప్పుడు, ప్రపంచమందు శబ్దార్థజ్ఞానము (మాట, ఆ మాటచే సూచింపబడు వస్తువు) లభించుటలేదుగాని యింతకంటె నొక పరమసత్యము దెలియుచున్నది. అది 'సన్మాత్రం' అనగా సత్పదార్థ మొక్కటిమాత్రామే యగును. "అహం" అనునది ఇచ్చట సన్మాత్ర మేగాని అంతఃకరణము స్ఫురింపజేయు అహంభావముగాదు అనగా బుద్ధీంద్రియములు లేకున్నను, ఆనందానుభూతి నొందు జ్ఞాత ఆ నిద్రావస్థయందున్నట్లు గ్రహించి, దర్శించి విశ్వసింపవలయును. ఆతడే సన్మాత్రుడగు ఆత్మ లేక ప్రత్యగాత్మ లేక కూటస్థచైతన్యము ఈతడు (ఈసన్మాత్రుడు) జాగ్రత్స్వప్నములయందు నుండును కాని మనకు స్ఫూర్తినీయడు. ఎందుచేతననగా సుషుప్తియందు మనకు స్ఫూర్తినీయని చిదాభాసుడు అడ్డమునిలచి, ఆత్మను మరుగుపరచి, అహం శబ్దవాచ్య

డను నేనే నేనే యని స్ఫూర్తినిచ్చును. వివరణాచార్య మతమున నీ ప్రతిబింబ సత్యత్వము నంగీకరింతురు. సురేశ్వరాచార్యుడు (మండన మిశ్రుడు) ఆ ప్రతిబింబము మిథ్యాభూతమని వివరించి ఆతనికి చిదాభాసుడని నామకరణముజేసెను. ఈతడు నాకంటె కార్యకర్త, సుఖ భోక్త యగు ఘనుడింకొకడులేడు, ఉండజాలడని, విఱ్ఱవీగుచుండును. సుషుప్తియం దంతఃకరణము లయించియుండునుగనుక ఈచిదాభాసుడును ఉండడు. కనుకనే సద్రూపుడగు ఆత్మయే పర్యవసించును.

సుషుప్తియం దాత్మయుండునని తెలుపుట కుదాహరణముగ గ్రహణకాలమందు సూర్యచంద్రులస్థితితో పోల్చిచెప్పిరి. ఎట్లన సూర్య చంద్రబింబములను చీకటి యావరించినను ఆ బింబములు తమ స్వరూప స్వభావముల విషయమున యథాతథముగనే యున్నవి, గ్రహణచ్ఛాయ భ్రాంతిజ్ఞానమువంటిది. అది మనకు సత్యస్వరూపమును మరుగుపఱచు చున్నది. ఆ చ్ఛాయ ఉపసంహృతమైనప్పుడు సత్యమే స్ఫూర్తినిచ్చును. సుషుప్తిలో, గ్రహణచ్ఛాయలవంటి, భ్రాంతిజ్ఞానజనకములగు మన యింద్రియశక్తు లుపసంహరింపబడియున్నందున, సన్మాత్రుడగు ఆత్మయే స్ఫూర్తినిచ్చును. అట్లే జాగ్రత్తునందును, యింద్రియశక్తుల నుపసంహ రించి అంతఃకరణము నంతర్ముఖముజేసి సంయమన సమర్థముగ జేయ గలిగిన, జాగ్రత్తుకూడ స్వప్నమువలెనే మిథ్యగా తెలియబడి, సన్మాత్రుని స్ఫూర్తియే ప్రాప్తముగాగలదు. ఇదియే శాస్త్రప్రతిపాదిత పారమార్థిక సాధన. సుషుప్తియందు అవిద్యాకారవృత్తి నిపొందిన అంతఃకరణము, ఆ వృత్తియందు ప్రతిఫలించిన యానందమును, అజ్ఞానానుభవ ఆనందరూప మున, చిదాభాసుడు పొందును. సమాధిస్థితియందు జ్ఞానపూర్వక నిజానంద మును కూటస్థు డనుభూతినొందును. సుషుప్తియందలి అవిద్యాకార-అవిద్యా వృత్తి యున్నదిగాని శూన్యముమాత్రము గాదనియు ఈ యుపమానముచే

మనము గ్రహింపగలము. శూన్యమే యున్నదని వాదించిన ఆ శూన్యమును గుర్తించువాడొకరు (ఆత్మ) ఉండితీరవలెనుగదా ! కనుక ఆత్మ సదా సద్రూపుడు.

సద్రూపుడు కూటస్థుడు నగు ఆత్మ అసత్తత్త్వమగు అజ్ఞానముతో నుపహితుడైనప్పుడు 'అహం' అను భావ ముద్బుద్ధమగును. ఈ భావోదయమే సంసారమునకు ప్రారంభము. అహంకారముకూడ ఒక చిత్తవృత్తియే. ఈ వృత్తిని పొందగనే ఈపని నేను చేయుచున్నాను, ఈ సుఖమును నేననుభవించుచున్నానను కర్తృత్వభోక్తృత్వ భావములను తన యందారోపించుకొని, తన కార్యములకు ఫలముల ననుభవించుటయే తన స్వభావమని, జీవుడు తలంచుచున్నాడు. కాని వేదాంతశాస్త్రము, నీ స్వరూపమువేఱు, నీవు చిదాభాసుడవుగావు, జీవుడవుగావు, కర్తవుగావు భోక్తవుగావు—కూటస్థుడవుగ నిన్నెఱుంగుమని చెప్పుచున్నది. సాధారణముగ అహం శబ్దముచే మనము గ్రహించు 'నేను' అనువాడు గాఢ నిద్రలో మనకు స్ఫురించుటలేదు—అది అవిద్యాకారవృత్తి గనుక. కాని సమాధిస్థితియందు ఇంద్రియములుపహృతములై మనస్సు లయమై యున్నను, బ్రహ్మాకారవృత్తి యుండునుగనుక అప్పుడు శూన్యముగాక సద్రూపుడే ప్రసన్నుడగును.

గ్రహణకాలస్థితితో పోల్చిన అజ్ఞానస్థితిని, అన్ని యవస్థలయందును అనుస్యూతముగనున్న కూటస్థుని వేదాంత దృష్టితో విచారించిన విశదమగునదేమి ? బుద్ధిమొదలుకొని స్థూలదేహమువరకుగల జడ పదార్థములన్నిటికిని ఆశ్రయుడై, చూచుచున్నాను, వినుచున్నాను, తినుచున్నాను అను వ్యవహారములన్నిటిలో *విశేష్యముగ భాసించునట్టి చైతన్య స్వరూపమునకు "ఆత్మ" యని పేరు. తినుచున్నాను, వినుచున్నాను అని ఆతనికి సంబంధించినవిగాతోచు ధర్మములన్నియూ విశేషణములు. విశే

షణములు పరస్పర వ్యాఘాతములై యుండుటవలన (inter changeble) నశ్వరములగుచున్నవి. దేశకాలభేదముల ననుసరించునవిగ విస్పష్టమగుచున్నవి. కనుకనివి మిథ్యగ, కల్పితముగ, నారోపితముగ భావింపనగును. మరియు నీ వ్యవహారము లన్నిటియందును ప్రత్యగాత్మ విశేష్యమై, సద్రూపుడుగ, కనుక నిత్యుడుగ దేశకాలభేదములతో జెప్పవీలు లేనివాడుగ, అసంగుడుగ, నిర్వికారుడుగ, స్వప్రకాశుడుగ, సాక్షిమాత్రుడుగ, వేదాంతశాస్త్రమున పేర్కొనబడినాడు. అయినను దేహేంద్రియముల సంబంధముచే పరిచ్ఛిన్నుడుగ భావింపబడుచున్నాడు. స్థూలశరీరమున నున్న జీవునకు మెలకువచే నిద్రయందు ప్రబోధముగలిగినయట్లు, జిజ్ఞాసువునకు తత్త్వశాస్త్రమనన, నిదిధ్యాసనముచే ఆత్మజ్ఞాన ప్రబోధముచే మిథ్యాజ్ఞానమునశించి విశేషణపూర్వకమగు సర్వదృశ్యసంపదయు అద్వితీయాఖండబ్రహ్మముగ, సగుణబ్రహ్మ విభూతులగు అష్టమూర్తులుగ ఆరూఢమగును. సూర్యచంద్రుల కీగ్రహణములతో సంబంధములేనట్లు ఆత్మకు ఉపాధులతో వాస్తవముగ సంబంధములేదు. మూలాజ్ఞానపూర్వక నిద్రయందు పురిశయనుడుగ నున్నాడు. తిరిగి శాస్త్రజ్ఞాన, యోగసాధనలచే ప్రబోధము, సాక్షాత్కారముపొందిన, అన్ని స్థితులయందును తానున్నానని ప్రత్యభిజ్ఞపొంది, సన్మాత్రుడుగ ప్రకాశించును. అట్టి సద్రూపుడగు గురుదక్షిణామూర్తికి నమస్కారము.

అపుడు ఆత్మగానిది మరొకటి యున్నందున ద్వైతభావము సమర్థింపబడుట లేదా ?



7. శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషుతథా
సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాస్వను వర్తమాన
మహమిత్యన్తః స్ఫురంతం సదా
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాంయో
భద్రయా ముద్రయా ॥తస్మై॥

టీక :— బాల్యాదిషు అపి = బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము, అను అవస్థలు; జాగ్రదాదిషు=జాగర, స్వప్న, సుషుప్తి అవస్థలు; తథా=అట్లే; సర్వాసు అవస్థాసు అపి=ధర్శన, శ్రవణ, కర్తృత్వ, భోక్తృత్వాది అవాన్తరావస్థలును; వ్యావృత్తాసు = మారుచుండగా; అనువర్తమానం = అనుస్యూతముగనున్న; సదా=ఎల్లప్పుడు; అహమితి = నేను అని; అంతఃస్ఫురంతం = లోపలసాక్షిగా ప్రకాశించుచున్న; స్వాత్మానం = తన ఆత్మను; భద్రయా ముద్రయా = జ్ఞానముద్రచేత; భజతాం = భక్తులగు శిష్యులకు; ప్రకటీకరోతి = ప్రకాశముగా చేయునో ఆ శ్రీ గురుదక్షిణామూర్తికొఱకు ఈ నమస్కారము.

తా॥ బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము, అను అవస్థలు ఒకదానితరువాత నొకటి అనుభవమునకు వచ్చుచున్నవి. "యోఽహం బాల్యే పితరౌ అన్వభూవం, సోఽహమిదానీం, ప్రణప్త్రాన్ అనుభవామి." నేను చిన్నతనములో తల్లిదండ్రులను జూచితిని, ఇపుడు మునిమనుమలను చూచుచున్నాను అని అవస్థలు మారినను తాను అనుస్యూతముగ నుండి వానినెల్లు గుర్తించుచున్నాడు. అట్లే జాగర, స్వప్న, సుషుప్తులు మారుచున్నను, ఆ యవస్థల ననుభవించుచు తాను, ఏకరీతి అట్లేయున్నాడు. "అహమ్, అహమ్" "నేను, నేను", అని ఎల్లప్పుడు

ప్రకాశించుచున్నాడు. జ్ఞానముద్రతో దేహాదివివిక్త సచ్చిదానన్దాత్మ స్వరూపమును భక్తులకు ప్రకటించుచున్న దక్షిణామూర్తికి నమస్కారము.

వివరణ :— ఈ శ్లోకభావమును గ్రహించుటకు ముందు 'వ్యావృత్తి' flux (పరిణామినిత్యము) "అనువర్తమానము" అను పదములు ఏమి తెలుపునో విచారించవలసియున్నది. నిత్యవ్యవహారములో వృక్షజాతి నుండి లభించు పదార్థములు మన కాహారమగుచున్నవి. అనగా ఆ పదార్థముల యందలి పోషకములు (పాంచభౌతికములు) మన శరీరమందలి (ధాతువులగు) రక్తము, మాంసము, అస్థి మున్నగు సప్తధాతువులుగ భౌతికపదార్థ సూక్ష్మరూపమగు మనస్సుగ, రజోగుణప్రధానమగు ప్రాణశక్తిగను పరిణామమునుపొంది, ఇచ్ఛా, జ్ఞాన. క్రియాశక్తులుగ, మన లౌకికపారమార్థిక వ్యవహారనిర్వహణమునకు సాధకములగు చున్నవి. ఈ యాహారమే లేనియెడల స్థూలమగు మనశరీరమేగాక సూక్ష్మమగు మనస్సుకూడ క్షీణించి కార్యనిర్వహణ చేయజాలదు. కనుక ఈ వృక్షములయందలి సూక్ష్మాంశములే మన శరీరమందలి సూక్ష్మమగు మనస్సు స్థూలమగు ధాతువులుగ పరిణమించుచున్నవి. పదార్థమునకు స్వరూపనిత్యత్వము లేకపోయినను పరిణామనిత్యత్వము సాధింపబడినదని గ్రహింపగలము. పదార్థము రూపాంతరములుపొంది flux నామ రూపములుగా స్ఫూర్తినిగలిగియున్నదిగాని నశించుటలేదు. ఈ విధమగు రసాయనిక మార్పులకే (chemical disintegration and molecular combination) మాయాశక్తి విలాసకార్యమని వ్యవహారము. విలాసమన బుద్ధికి సంతోషము గలిగించు నొక వింతకార్యము గాదు. ప్రయోజనకరమగు మార్పు (purposeful meta morphosis.) దీనికే వ్యావృత్తి లేక రూపాంతరముపొందుట యనిభావము. అనువర్తమానమనగా ఈ వ్యావృత్తిని సర్వదా అనుసరించి, ఆ మార్పుల కనువగు

రూపముల బొందించు ఈ ప్రపంచసృష్టి స్థితి, లయ, ప్రక్రియలకు అను వగు సగుణబ్రహ్మయన నొప్పు అష్టమూర్తులుగ భాసించుట. ఈ ప్రక్రియ లకు అధిష్ఠానదేవతలే బ్రహ్మ, విష్ణు, రుద్రులు, ఈ వ్యాపృత్తి యింకను సూక్ష్మాతిసూక్ష్మమగు శక్తిగా (Energy) మాయాతత్త్వము యొక్క కార్యరూపముగకూడ పరిణమించుచున్నది. ఇందుకు ప్రమాణము ప్రశ్నో పనిషత్తునందు గలదు.

ఆదిత్యోహ వై ప్రాణో రయిరేవచంద్రమా
రయిర్వా ఏతత్సర్వమ్
యన్మూర్తంచ అమూర్తంచ
తస్మాన్మూర్తి రేవరయిః॥

అమూర్తమగు ప్రాణశక్తియుక్తుడు సూర్యుడు ! స్వప్రకాశత లేదుగనుక మూర్తమగు పదార్థప్రతినిధి చంద్రుడు. కనుక మూర్తము అమూర్తము లేక వ్యక్త అవ్యక్తములు రెండును పదార్థమే. (Those with a form and those which are formless as mind and thoughts are matter (ie) unmanifest matter is Subtle and the manifest is gross. సాపేక్షికదృష్టితో సూర్యుడు స్వప్రకాశుడుగనుక శక్తి (Energy) స్వరూపుడనియు చంద్రునికి స్వప్రకా శత లేదుగనుక పదార్థము (matter) అనియు చెప్పబడెను. కాని, భౌతిక శాస్త్రములయందు జెప్పబడిన శక్తి — పదార్థములకన్న, నివి సూక్ష్మత మములని గ్రహించవలయును. భౌతికశాస్త్రములయందు జెప్పబడిన పదార్థమునకు, ఘన, ద్రవ, బాష్ప స్థితులు మూడుగలవు. కాని యిప్పుడు ఆధునిక భౌతికశాస్త్రములయందు బాష్పమునకన్న సూక్ష్మాతిసూక్ష్మమగు నొక నాల్గవస్థితినికూడ కనిపెట్టిరని తెలియుచున్నది. దీనిని Astetine

అందురట. అయినను యిది తన్మాత్రలకన్న సూక్ష్మముగానట్లే గ్రాహ్యమగు చున్నది. కనుక మన పారమార్థిక శాస్త్రములయందు జెప్పబడిన సూక్ష్మ స్థితుల పరిధులను ఆధునిక భౌతికశాస్త్రములెప్పుడు చేరగలవో చెప్పలేము, ఊహించనులేము ఈ విచారణను గ్రాహ్యాంశమేమన :— పదార్థము వ్యావృత్తిచే నామరూపముల బొందుచుండును. దీనికి పరిణామసత్యత్వము గలదు. అది శక్తిరూపముకూడ పొందగలదు. కనుక భౌతికమన వ్యావృత్తియేగాని స్వరూపసత్యముగాదు. * ఈ వ్యావృత్తిపూర్వకమగు సర్వమునందునుకూడ చైతన్యము అనుస్యూతముగ నుండును.

ఈ విజ్ఞానమును పారమార్థికమునకు వర్తింపజేసి చూతము :— ఒక తొట్టిలోని పాపాయి, ఆడుకొనుబాలుడు, విశాలావిద్యార్థి రక్తుడగు గృహస్థు, శరీరశక్తులుడిగిన వృద్ధుడు అను దశలు అనుక్రమముగ వచ్చిన వ్యక్తి ధాతుపరిణామరూపమగు మార్పులు పొందినవాడైనను ప్రతియవస్థయందును "అహమితి" అప్పటిబాలుడను నేనే, అప్పటి విద్యార్థిని నేనే, అప్పటి గృహస్థును నేనే యిప్పుడు వృద్ధుడుగనున్న, వాడను ఆ నేనే, ఆ నేనే అనుట పరిపాటి. వాస్తవముగ ఆ "నేనే" నని చెప్పువాడు పసిపాపస్థితినుండి — వృద్ధునిస్థితివరకును, భౌతిక శరీరము నందు గలిగిన సర్వభిన్న స్థితులయందును ఒక్కడే. అనుస్యూతముగ పూలమాలయందలి దారమువలె ఉండియేయున్నాడు. దీనిని సామానాధికరణ్య మనవచ్చును. ఈతనినే అహం పదమునకు లక్ష్యముగ గ్రహింపవలయును. అనుక్షణము శరీరధాతువులు పుట్టుచు చచ్చుచు వ్యావృత్తిచే బాల్య, కౌమార, యౌవన, వార్థకస్థితుల బొందు శరీరమును అహం శబ్దమునకు లక్ష్యముగ జెప్పరాదు. ఇదే "అహం" అగునెడల రజస్తమోగుణప్రాబల్యముచే గలుగు మానసిక ప్రవృత్తులచే కర్తృత్వ భోక్తృత్వములుపొంది, ఫలభోగము ప్రాప్తించినందున ముక్తిమృగమే యగును.

ఈ శరీరావస్థయందువలెనే జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందును, ఇంకనుదైనికములగు చూచుట, వినుట, తినుట, యోచించుట, ఆడుట, పాడుట, మున్నగు సర్వావస్థలయందును నేను నేననువాడు-కూటస్థుడుగ, సాక్షిగనున్న ఆ పరమాత్మయే; వ్యావృత్తి పొందని ఆ శుభ్రపదుడేయని, జీవబ్రహ్మైక్యరూపమగు తత్-త్వం పదముల కభేదబోధకమగు చిన్ముద్రచే ఏకాత్మత్వము లేక సర్వాత్మత్వము అను మహదైశ్వర్యమును స్ఫుటీకరించి, ప్రబోధముచే ముందు జీవన్ముక్తి తరువాత, ప్రాప్త ప్రాప్తమగు పరమాత్మత్వమును సూచనజేసి బోధించు. గురుదక్షిణామూర్తికి ప్రబోధప్రాప్తికై నమస్కరించి స్తుతించుచున్నాను.

---

8. శ్లో॥ విశ్వం పశ్యతి కార్యకారణతయా
స్వస్వామి సంబంధతః
శిష్యాచార్యతయా తథైవ
పితృపుత్రాద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతివాయఏష
పురుషో మాయాపరిభ్రామితః ॥తస్మై॥

టీక :_ యః = ఏ పరమాత్మ; మాయాపరిభ్రామితః_మాయావశుడై; ఏషః_సర్వులకు; పురుషః = అపరోక్ష జీవరూపుడై; స్వప్నే = స్వప్నము నందుగాని; జాగ్రతివా_జాగ్రదవస్థయందుగాని; విశ్వం_ప్రపఞ్చమును; కార్యకారణతయా_ ఒకకారణమున కొకకార్యమని; స్వస్వామిసంబంధతః = భృత్యుడు (సొత్తు లేక తొత్తు) యజమాని(స్వామి)గా; శిష్యాచార్యతయా_ఒకరు శిష్యుడుగ ఒకరు గురువుగా; తథైవ=అట్లే; పితృపుత్రాద్యాత్మనా_తండ్రి కొడుకు మొదలగు రీతిగా; భేదతః_భేదముగా; పశ్యతి = చూచునో; ప్రత్యగాత్మ స్వరూపుడైన ఆ శ్రీ గురుదక్షిణా మూర్తికి నమస్కారము.

తా॥ అనాద్యనిర్వచనీయ మాయా (అజ్ఞాన) వశమున జీవభావము నొంది స్వప్నమునందుగాని, జాగ్రదవస్థయందుగాని, చరాచర ప్రపఞ్చమును, కార్యము__కారణముగ, భృత్యుడు__యజమానుడుగ, శిష్యుడు_ఆచార్యుడుగ, తండ్రి__కొడుకుగ, బహుభజ్జుల జూచుచున్న ప్రత్యగాత్మ స్వరూపుడగు ఆ శ్రీ గురుదక్షిణామూర్తికి ఈ నమస్కారము.

వివరణ :_ ఈ శ్లోకమున 'కార్యకారణతయా' "స్వప్నేజాగ్రతివా" అనుపదములను హెచ్చుగా మననముజేయవలసియున్నది. ఈ జగత్తునం

దంతటను ఒక కారణముచే నొకకార్యము గలిగినట్లు తెలియబడుచున్నది. కనుక సర్వమునకు ఆదికారణము (1st cause) ఏదియో తత్త్వవిచారణచే గ్రహించనగుననుట ప్రబోధము. *అయితే అద్వయ సిద్ధాంతమున "కార్య కారణములకు అనన్యతయే సిద్ధము" అనునదే మూలసూత్రము. ఈ విషయమును ఆరూఢముజేయుటకే మాయాతత్త్వనిరూపణము. ఈ సూత్రమును గ్రహించలేకపోయినవారే బహువిధ వాదముల ప్రతిపాదించిరి. ఇందు మనము పరిణామవాదము, ఆరంభవాదము, వివర్తవాదము, ఆభాసవాదము మున్నగువానిని ఉపయుక్తవిషయ వివరణమున విచారించితిమి. ఉపాదానకారణము, నిమిత్తకారణము అని కొన్నికారణములను చర్చించి వాని కార్యరూపముల స్వభావమును తెలిసికొంటిమి. పరిణామి కారణమైనటుల భాసించు కార్యములుగాని, పరమేశ్వరేచ్ఛచే ఆయనయందుగల అజ్ఞానరూపశక్తి పరిణమించి, ద్రష్టయందు ప్రాతిభాసికముగ గల దోషకారణమున వివర్తరూపముగ భాసించు కార్యములుగాని యిట్టి కార్యకారణభావములకు తావిచ్చుననుట ఆయన మాయాశక్తి విలాస, వ్యామోహ ప్రభావముచేతనే, సంభవము. ఇందుచేతనే ఈ విశ్వమునందు ఆయన ఒకయెడ భృత్యుడుగ, ఇంకొకయెడ స్వామిగ (హక్కుదారుడగు అధిపతిగ, గురువుగా, శిష్యుడుగా, తండ్రిగా, బిడ్డగా, కర్మబీజముల ఫలానుభవమున కనువగునట్లు సంబంధములతో ప్రవృత్తి గలిగి యున్నట్లు భాసించుచున్నాడు. ప్రవృత్తియందు ఏ విధమగు భావనజేయుటకును, మనకు అంతఃకరణమేగదా సాధనము! అది పంచభూతముల సమిష్టి సాత్త్వికాంశల వలన ప్రభవించినదగుటచే ప్రతిబింబ గ్రహణయోగ్యమైనది. అయినను, బహుజన్మలయందు ప్రాప్తించిన విషయానుభవ సంస్కారములచే, కలుషితమై స్వచ్ఛతనుగోల్పోయి మలినసత్త్వపూర్వకముగ నుండుటచే, రూపముయొక్క వాస్తవప్రతిబింబ గ్రహణయోగ్యముగాదు. ఉపాధిధర్మముల స్ఫూర్తినొసగు ప్రతిబింబములనే

ధరించ యోగ్యమగును. శుద్ధాంతఃకరణమున ప్రతిబింబించి చిదాభాసుడని వ్యవహరింపబడుచున్న అతడు తన సంస్కారముల ప్రభావముచే సత్వరజస్తమోగుణ స్వాభావికములగు చేష్టలుగలిగియుండును ఇదియే భ్రాంతిజనితజ్ఞానముయొక్క మూలము. ఈతడు దేహత్రయము నభిమానించుటచేతనే జాగరస్థితివలెతోచు స్వప్నరూపస్థితియందు. పితృపుత్రాది, స్వామిభృత్యాది, గురుశిష్యాది భావములతో వ్యవహరించుట గలుగుచున్నది. కాని ఈ యంశలు ఈ స్థితులు : ఈ సంబంధ బాంధవ్యములు ఏకాత్ముడగు పరమాత్మ తనమాయాశక్తి యొక్క అజ్ఞానరూపమగు ఆవరణ విక్షేపశక్తులను, (ఊర్ణనాభి తనచే ప్రసరింపబడిన తంతువుసు తిరోధానము జేసికొన్నరీతిగ) తిరోధానముజేసికొన్న యెడల స్ఫూర్తిని గలిగియుండజాలవు. ఇది సాధనచే వాసనాక్షయమును మిథ్యాసంస్కారనాశనమును చేసికొనుటయందు కృతకృత్యుడైనవానికే లభ్యము. ఢాకా పట్టణమున శక్తి ఔషధాలయము, సాధనఔషధాలయము అని రెండు సంస్థలు గలవు. ఈ సంస్థలు తయారుచేయు ఔషధములలో నెవ్వరివి మంచివని కొందఱు వైద్యుడనగు నన్నడుగుచుండెడివారు. వారికి నేను శక్తి చాలాగొప్పదే, మనకు లక్ష్యము శక్తియేగాని 'సాధన లేనివానికి శక్తి ప్రాప్తించదు' ముందు సాధనవారి ఔషధములు సేవించుడని చలోక్తిగా చెప్పుచుండెడివాడను. ఐనను సత్యముమాత్ర మదియే. వాసనాక్షయమునకుజేయు మానసికసాధనయే గీతయందు జెప్పబడిన గుహ్యమగు రాజయోగము. జన్మరాహిత్యమునకు ప్రాప్త ప్రాప్తిపూర్వకమగు పరమార్థమునకు రాచబాట **(open public road)** ఇట్టి సాధనలేనివానికి, గీతాపారాయణము, గ్రామఫోనుప్లేటు పాడుపాటవు తుల్యమే యగును. ప్లేటునుండి శ్రావ్యమగు, లలిత, సుందర భావగర్భితమగు కృతులు పాటలు **(cellestial songs)** బయలు వెడలినను వాని యను

భూతి ఆ ప్లేటుకు ప్రాప్తించుట లేదు, ఆ ధ్వని ను త్తేజపరచి ప్రభవింప జేయు సూదికిని ప్రాప్తించుటలేదు. దేవునియందుకన్న సాధనయందు నాకు గల విశ్వాసమే నా కలము నింతమేరకు నడిపించినది. ఫలమును పండించి అనుభవింపగోరువారు సాధకులు, ప్రతిఫలము ననుభవించ గోరువారు భక్తులు, మొదటిది "సోహం" అను జ్ఞానయోగము. రెండవది "దాసోహం" అను భక్తియోగము; దానికనుబంధములగు కర్మ ఉపాసనలు. మొదటిది నిత్యసత్య స్వరూపము, రెండవది ప్రాతిభాసిక సత్యము. ఒక్కమాటలో జెప్పవలెననిన సాధకునకు మాత్రమే జాగరస్థితికూడ స్వప్నతుల్యమేయని ఏదో యొకనాడైనను, జన్మాంతరమునందైనను ఆరూఢము కాగలదుగాని పాఠకునకుగాదు. "స్వప్నేజాగ్రతివా" యను దానిలో నింతవరకు జాగరస్థితి విచారణజేసితిమి.

ఇక స్వప్నమును విచారింతము. ఇందునను ఒక కారణముచేత నొక కార్యము రూపొందినట్లు భాసించును. అగ్నిచే ఇండ్లు దహింపబడినట్లు వరదలవల్ల గ్రామములు మునిగినట్లు కార్యములకు కారణములు గలుగు చుండును. సంఘటనల యనుభవము జాగ్రదవస్థయందువలెనే యుండును. ఎవరైనను పిలచియో, తాకియో వెలుగు హెచ్చయినందుననో, ఉష్ణశీతల స్పర్శలచేతనో యింద్రియములకు ప్రబోధముగలిగి జాగ్రత్ప్రపఞ్చ దృశ్యములకు కన్నుతెరచునంతవరకును స్వప్నానుభవము, జాగ్రదనుభవము నకు తుల్యముగనే యుండును. మెలకువగలిగిన తరువాతనే అది స్వప్నావస్థయని, అందు నిజముగనున్నట్లు గోచరించిన జగత్తంతయు ఆత్మాధిష్ఠానక భ్రమరూపమేయని, అందుగలిగిన సుఖసంతోష భయసంభ్రమములు ప్రాతిభాసికములేయని ఆరూఢమగును. అంతవరకును అదియొకవిధమగు జాగృతియే. ఈ భ్రమకు కారణము నిద్రాదోషము. దోషమున్నవానికి అధిష్ఠాన పదార్థజ్ఞానమున్నను, కామెలరోగికి తెల్లనిశంఖు పచ్చగ

గన్పించునట్లు, భ్రాంతిజ్ఞానమే లభించును. కామలాదోషము తొలగిన శంఖు తెల్లగనే యుండును. కనుక అధిష్ఠాన మెల్లప్పుడు దోషరహితమే, సద్రూపమే. స్వప్నమున నింద్రియము లుపహృతములై మాంద్యముగ నుండి (A state similar to hybernation) మనస్సు విషయగ్రహణ సామర్థ్యములేకయున్నను, సాక్షిచైతన్యముచేతనే ఈ స్వప్నజగ దనుభవము గలుగుచున్నది. మెలకువగలిగిన తరువాత నిద్రాదోషముతో సహా స్వప్నజగత్తునూ అదృశ్యమగును.

కేవలము సుషుప్తియందు కార్యకారణ ప్రక్రియలు గన్పింపవు. అజ్ఞానవృత్తియందలి ఆనందముమాత్రము అనుభూతమగును. జాగ్రత్స్వప్నములకు మాత్రమే ఆత్మాధిష్ఠానక అనాత్మాధిష్ఠానకభ్రమలు కారణమై కార్యరూపములుగ అనుభవమునకువచ్చును. ఈ యవస్థలు రెంటియందు జీవుడు మాయాశక్తివిలాస మహావ్యామోహములకు, అజ్ఞాన పరిణామముచే లోనై, గురుశిష్య, పితృపుత్ర, స్త్రీ, పురుష, స్వామి, భృత్య భావముల పొందుచున్నాడు. శాస్త్రజ్ఞాన ప్రబోధముచే, ధారణ, ధ్యాన, సమాధిస్థితుల నొసంగు సాధనలచే, తనకుగల వాసనల నపవదించుకొని లౌకిక సంస్కారముల పారమార్థిక సంస్కారములచే భ్రష్టమొనర్చి శుద్ధ సత్వాంతఃకరణమును ప్రాప్తించుకొని, దానియందు ప్రత్యగాత్మను బ్రహ్మాకారవృత్తిలో నినిపి అహంగ్రహోపాసన జేసిననాడు ఆతనికి జాగ్రత్తు కూడ స్వప్నమువంటిదిగనే లయించిపోయి సర్వాత్మత్వము సిద్ధించును. స్వప్నదృశ్యములు జాగ్రత్తునందు మిథ్యగాదెలియబడినట్లు, జాగ్రత్తను కొనబడుచున్న స్థితియందలి సత్యములనుకొనబడు దృశ్యసంపద మిథ్యగనే ప్రాతిభాసికముగనే, స్వప్నతుల్యముగనే తెలియబడి సత్యవస్తుజ్ఞానము తదనుభూతి ప్రాప్తించును. సాక్షిమాత్రుడగు ప్రత్యగాత్మ అవిద్యచే స్థూల, సూక్ష్మకారణ శరీరములతో తాదాత్మ్యముచెంది మాయా

కల్పిత దృశ్యములకు ద్రష్టయైనందున, విశ్వ, తైజస ప్రాజ్ఞ నామధేయము లను పొందెనుగదా। ఇప్పుడు బ్రహ్మజ్ఞానముచే గలిగిన ప్రత్యగాత్మ స్థితిచే హృదయగ్రంధి విడిపోయి, దృశ్యముమిథ్యగా, తన విలాసముగ, నెఱుగబడి, దృక్ మాత్రము ఏకైకముగ, సర్వాత్మత్వకముగ పర్యవ సించును. ఈ స్థితియందు ప్రమాణముల ప్రయోగించుట అసంభావ్యము గనుక ప్రమాణ, ప్రమేయ, ప్రమాతలను త్రిపుటియేయుండదు. 1) దృక్ సత్యము, దృశ్యముమిథ్య 2) కార్యకారణముల కనన్యత్వమేసిద్ధము 3) మాయాశక్తిచే సర్వప్రపంచ వ్యవహారము ఉపపన్నము, 4) అప రోక్షానుభూతికలిగిన జాగ్రతకూడ స్వప్నమాత్రమేయగును, అని శ్లోక లక్ష్యార్థమును బోధించు దక్షిణామూర్తి సద్గురునకు నమస్కారము. ఇంతవరకు జ్ఞానయోగశ్లోకాష్టకము.

9. శ్లో॥ భూరంభాంస్యనలోఽనిలోఽమ్బర
మహర్నాథోహిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మకమిదం
యస్యైవ మూర్త్యష్టకమ్
నాన్యత్కిఞ్చన విద్యతే విమృశతాం
యస్మాత్పరస్మాద్విభోః ॥తస్మై॥

టీక :— భూః = పృథ్వి; అంభాంసి = జలము; అనలః = అగ్ని; అనిలః = వాయువు; అమ్బరం = ఆకాశము; అహర్నాథః = సూర్యుడు (బుద్ధికధిదేవత); హిమాంశుః = చంద్రుడు (మనస్సు కధిదేవత; పుమాన్ = జీవుడు (యజ్వ): ఇతి = ఈ విధముగ; చరాచరాత్మకం ఇదం=స్థావర జఙ్గమాత్మకమగు ఈ ప్రపఞ్చము; యస్య ఏవ = ఏ పర మాత్మయొక్క; మూర్త్యష్టకమ్=ఎనిమిదిమూర్తులుగ; ఆభాతి = ప్రకాశించు చున్నదో; విమృశతాం = ఆత్మవిచారణ (శ్రవణపూర్వకము) చేయుచు, విమర్శించువారికి (మననపూర్వకము) పరస్మాత్ = సర్వకారణుడైన; విభోః = సర్వవ్యాపకుడైన; యస్మాత్ = ఏ పరమాత్మకంటే; అన్యత్= ఇతరమగు, మరియొకటి; కిఞ్చన = కొంచెముకూడా; నవిద్యతే = లేదో (తెలియబడుటలేదో) తస్మై = ఆ గురుమూర్తియగు దక్షిణామూర్తికి నమస్కారము.

తా॥ పృథివ్యాది పంచభూతములును, బుద్ధికి మనసుకు అధిదేవత లగు సూర్యచంద్రులును, జీవుడును, చరాచరరూపమున ఈ ప్రపంచమున స్ఫూర్తినిచ్చుచున్నారు. ఈ యెనిమిదింటిని అష్టమూర్తులని వ్యవహరించు చున్నారు. జీవుడు చిత్ అని, మిగిలిన యేడుమూర్తులు అచిత్ అని

ద్వైతవాదులు (భేదదృష్టిగలవారు) తలంచుచున్నారు. ఈయష్టమూర్తులు భిన్నముగనున్నను, చిదచిత్ విశిష్టుడగు పరమాత్మస్వరూపమునందు, స్వగతభేదముతో, ఏకముగనున్నారని విశిష్టాద్వైతులు జెప్పుచున్నారు. కాని శాఙ్కరాద్వైతులు శ్రుతి స్మృతివాక్య శ్రవణ మనన నిదిధ్యాసనములతో, సాధనచతుష్టయ సంపత్తిగలిగి ఆత్మవిచారణ జేయువారికి సర్వము నకు అభిన్న నిమిత్తోపాదాన కారణుడైనట్టి, సర్వవ్యాపకుడు సర్వాంతర్యామి సర్వాత్మకుడునగు పరమాత్మకంటె నితరమగునది, మఱియొక్కటి యేదియు ఏ స్వల్పప్రమాణమునను లేదు. ఈ దృగ్గోచరమగుచున్న అష్టమూర్తులును పరమాత్మయొక్క వివర్తరూపములగు విభూతులేయని బోధించు శ్రీ గురుదక్షిణామూర్తికి నమస్కారము.

వివరణ :— ఇంతవఱకు పూర్వశ్లోకములయందు, ఉపనిషత్తులయందు వివరింపబడినరీతిని దృగ్గోచరముగాని, ప్రమాణములచే నిర్ధారింపశక్యము గాని ఆత్మ, పరమాత్మల తత్త్వములను శాఙ్కర మతానుసారముగ గ్రహింపయత్నించి కొన్నిసూత్రముల దెలిసికొంటిమి. అందు మాయా తత్త్వము దాని కార్యములగు అజ్ఞాన, ఆవరణ, విక్షేప, వ్యామోహములు, వివర్తప్రక్రియ, అధిష్ఠాన, ఆరోపములు, నిర్గుణతత్త్వము, కార్యకారణముల కనన్యత్వమను మూలసూత్రము, జాగ్రత్స్వప్న సుషుప్తిస్థితులు, తత్త్వశాస్త్రమున వాటిపాత్రల ప్రాముఖ్యము, మున్నగువిషయములను చర్చించి చూచుకొంటిమి. ఈ చర్చయంతయు నిర్గుణము, నిష్కలము, నిరంజనము, అఖండము, అద్వితీయమగు ఏకైకతత్త్వమును సాక్షాత్కరించుకొనుటకే, అనగా ఆ తత్త్వముతో అద్వయ భావానుభూతినిబొందు లక్ష్యముతోనే యని భావము. ఐనను అట్టి అనుభూతి పొందుటకు సాధన చతుష్టయసిద్ధి గలుగలేదే! అది సిద్ధించనిపక్షమున శ్రవణాదులు విశ్వాసమును కుదర్చగలవుగాని అనుభూతి నీయజాలవే, ఇట్టిసిద్ధి

జన్మాంతర సత్సంస్కారములతో పుట్టిన ఉత్తమోత్తములగు అధికారు లకు లభ్యమే మోగాని సామాన్యజిజ్ఞాసువుల కందుబాటులోలేదని, లభ్యము గాదని తోచుచున్నదే ! ప్రయోజన మెట్లని శంకగలుగుచున్నది. సత్యమే. సామాన్య జిజ్ఞాసువులందఱు మందాధికారులే. అందుచేతనే యిట్టివార నుద్దేశించి ఆ తత్త్వశాస్త్రమే సామాన్యులగు మధ్యమాధికారులకు యోగ్య మగు ఆచరణ సౌలభ్యముగల మఱియొక సిద్ధాంతమునుజెప్పి ఆచరణకు మఱియొక ప్రక్రియ నిర్దేశించినది. దేహమున్నంతవరకు ప్రపంచము దృశ్యమానముగదా ! ఇదివరకు మనము విచారణజేసిన అవ్యక్తతత్త్వ మునకు, కంటికి ప్రత్యక్షముగ కనిపించుచు, కాదని త్రోసిపుచ్చుటకు అనువుగాని ప్రత్యక్షమునకు, సామరస్యము కుదుర్చుకొనవలయునని యీ ఒక శ్లోకమున బోధించి తెలిపిరి. అదియేదృక్—దృశ్యవివేకము. ప్రపంచము మనచేత దృశ్యమానముగ తెలియబడునంత మేరకు అష్ట మూర్తులుగ భాసించుచున్నదనిరి. అవి పంచభూతములు, బుద్ధిమనస్సుల కధిదేవతలగు సూర్యచంద్రులు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులచే అను మితి (inference) చేయ ననువగుజీవుడు. పృథివ్యాపస్తేజో వాయ్వా కాశము లైదును పంచభూతములు, సూర్యచంద్రులని చెప్పబడినవి, గ్రహములేగానిందు, అవి ప్రతినిధులుగ జెప్పబడిన బుద్ధి, మనస్సులే గానిందు అవియు పాంచభౌతికములే, జడములే. ఒక్క పురుషుడు మాత్రమే భౌతికముగాక, మిగిలిన సప్తమూర్తులకు శక్తులనొసంగు చైతన్యవిశేషము. మూలప్రకృతి పరిణమింప ప్రారంభించి క్రమముగా మూర్తమై, స్థూలదృశ్యమగు భౌతికప్రపంచముగ వెలయునంతవరకు గల ఏ తత్త్వముల స్వరూపజ్ఞానమును విచారించి గ్రహింప మానవుడు యత్నించుచున్నాడో, అట్టి విచారణకర్తయు ఆ ప్రకృతియంతర్గతముగ నుండి ఆ యష్టమూర్తుల నిజాంశలవల్లనే రూపొందినవాడని ముందు తెలియవలయును. అనగా తానున్న పృథివ్యాది పంచభూతములు, బుద్ధి,

మనస్సు, అందు ప్రతిబింబించిన చిదాభాసుడగు జీవుడు అను స్థూల, సూక్ష్మ, కారణ, అంశలు. యెనిమిదింటి సమ్మేళన స్వరూపమని గ్రహించినగాని దేహమునకు విశ్వమునకు, మాయకు ప్రాణమునకు, ప్రత్యగాత్మకు గలస్వరూపసాజాత్యమును, ఆభావసిద్ధికి చేయవలసిన సాధనాస్వరూపమును తెలియలేదు. "ఆత్మానం విజానీయాత్" నిన్ను నీవు తెలిసికొమను శ్రుతివాక్యము బోధించు విషయమునకు ప్రక్రియ యెట్లో తెలియదు. కొందఱు ముస్లిములుకూడ 'ఖుద్ పచ్చానత్ కర్లో ఆప్‌కో' అను వాక్యమును వారి మతసిద్ధాంతములకు మూలసూత్రమని చెప్పగా వింటిని. వారి మతమందును "పాంచ్ అనాసర్" (పంచభూతములు) 'రూహ్' (జీవుడు) గలరట. అందుచే "నిన్ను నీవు తెలిసికో" అను ఆదేశము వారికినీ మూలసూత్రముగ జెప్పబడియుండుట గమనార్హము. ప్రకృతము స్థూలమగు శరీరము పాంచభౌతికము, స్థూలరూపమగు జగత్తు పాంచభౌతికము. జగత్తు క్రియాత్మకమగుటకు మాయాశక్తి, శరీరము క్రియాత్మకమగుటకు రజోగుణప్రాబల్యమున సంభవించిన పంచప్రాణములు, వ్యష్టిశరీరమునందు ప్రత్యగాత్మ, విరాట్ శరీరమునందు ఈశ్వరుడు, ఈశ్వరునకు, ప్రత్యగాత్మకు ఏకైక అధిష్ఠానము పరమాత్మయని ఆరూఢిగ దెలిసికొనగలిగిన, నిన్నునీవేగాక నీ చుట్టునుండువారిని, జంతువులు, చెట్లు, పుట్టలు, ఖనిజలోహములు మున్నగువానినికూడ నీవు తెలిసికొనినట్లే. ఈ జ్ఞానము, ఈ సర్వాత్మత్వజ్ఞానము అనుభవమునకు వచ్చుటకే "అహంగ్రహోపాసన" యను విధానము మధ్యమాధికారులకు నిర్దేశింపబడినది. ఉపాసనయన ఒక గొప్పతత్త్వమును, ఒక చిన్నవస్తువునందు, భావించి అవిచ్ఛిన్నమగు సజాతీయవృత్తితో ధ్యానించుట. ఒక జాతీయ పతాకమును, ఆ దేశప్రజలకు, ఆ దేశసంపదకు, ఆ దేశ సంస్కృతి యను మహాశక్తికి ప్రతీకగా భావించుటవంటివి. దీనిని ప్రతీకోపాసన యందురు. అహం గ్రహోపాసనయందు బ్రహ్మకు తానే ప్రతీక.

బ్రహ్మను న్యాసముతో తనయందు అంతర్యామిగ స్థాపించుకొని, చిత్తము బ్రహ్మాకారవృత్తి నొంపజేయు సాధనావిశేషమే అహం గ్రహోపాసన. దీనివలన మాత్రమే సర్వాత్మత్వ మహావిభూతి సిద్ధించగలదు. ఇదియొక ప్రార్థనగాదు, సాధన, లేక ఉపాసన. ఇది మధ్యమాధికారులకు జెప్పబడినది. మరికొందఱికి దారుశిలామృత్తికలతో నిర్మింపబడిన లేక రంగులతో చిత్రింపబడిన పటములను ప్రతీకములుగ గ్రహించి వానియందును అపరిచ్ఛిన్నతత్త్వమును భావనజేసి, పూజించి ఆరాధించి చిత్తశుద్ధిని పొందుటకు లేక తన యభీష్టముల దెలిపిఫలప్రాప్తి పొందుటకు ఈ ప్రతీకోపాసన లేక విగ్రహారాధన నిర్దేశింపబడినది.

ఇటుల ప్రవర్తింపబడిన ఆరాధనా విధానమునందు కాలక్రమేణ అపరిచ్ఛిన్న సర్వవ్యాపక పరమాత్మతత్త్వము విస్మరింపబడి, చిత్తశుద్ధి యను లక్ష్యము మరుగుపడి, విగ్రహము పరమాత్మకు ప్రతీకగాక అతీత మానవభావముతో మన్నింపబడుచు, ఆయనకు కల్యాణము, పవళింపుసేవ, సదా జాగరుడగువానికి సుప్రభాత సంకీర్తనలతో భోగలాలస విలాసములతో జేయబడుచున్న పూజాప్రక్రియలు పరమాత్మను మానవునిస్థాయికి దించుటకు సాధనములగునా ? లేక మానవుని దివ్యస్థితికి అధిగమింప జేయ సహకరించునో ? అను అంశము విచారణీయము. కాలము పరిభ్రమించి సాగిపోవుచుండ, మానవుని విజ్ఞానము వికసించి పరిధులు దాటుచుండ, పరిస్థితులయందు మార్పు అనివార్యముగ గలుగుచుండ ఆరాధనా విధానములను వ్యవస్థలను సంస్కరింపకున్న మానవుని యాధ్యాత్మిక ప్రగతి కుంటుపడునేమోయను విషయము పెద్దలగు మతకర్తలకు విచారణీయము. తన కాలపు పరిస్థితుల పరిశీలించియేగదా శంకరులు షణ్మతములకును సామరస్యమునుజూపి అంగికరించెను. క్షణిక విజ్ఞానమును, శూన్యవాదమును అపవదించి బౌద్ధమును మన్నించెను. అవతార దశకమున బుద్ధునకుస్థానము లభించెను. గతమున పరిస్థితుల సమీక్షించియే

గదా శ్రీ శంకరులు షణ్మతములకు సామరస్యమును జూపి వానినంగీకరించెను! క్షణిక విజ్ఞాన, శూన్యవాదముల నపవదించి బౌద్ధమును సంస్కరించి మన్నించెను. అవతార దశకములో బుద్ధునికి స్థానము ప్రాప్తించెను. కాలపరిభ్రమణమును సంస్కారముల కావశ్యకత నిది సూచించుటలేదా? భారతమున, ప్రకృతము, మతవ్యవస్థయందు కొన్నిమార్పులు ప్రయోజనాత్మకములని శాస్త్రకారుల భావించునెడల కృతకృత్యుడనగుదును.

ప్రకృతము :— అష్టమూర్తులుగ జగత్తునందు స్ఫూర్తినిచ్చుచున్ననుకూడ అపరిచ్ఛిన్నుడగు పరమాత్మకంటె లేశమైనను భిన్నములుగావు అనుభావము ననుసరించియే సగుణోపాసనయను ప్రక్రియ జనసామాన్యమునకు నిర్దేశింపబడినది. ఇప్పుడు మనము విమర్శించి గ్రహించవలసిన అష్టమూర్తులు మూలప్రకృతికి క్రిందిభూమికయందలివారు. ఇంతకుపూర్వపుశ్లోకములవలన మనకు బోధింపబడినది నిర్గుణచైతన్య భూమికలు. వీటిని భువర్లోక, సువర్లోక, మహాలోక, జనలోక, తపోలోక, సత్యలోకములని వ్యవహరించుచున్నారు. ఆ చిత్‌శక్తియొక్క ఇచ్ఛా, క్రియా, జ్ఞానశక్తులకు ప్రసక్తిగల భూమికలు. ఇందు యోగమాయ యనబడు చిత్‌శక్తి నాద (ఆద్య అనాఘాతపూర్వకమగు నాదము **(primordeal creative stress)** బిందు (సృష్టికార్యమున కనువగు పదార్థస్థితియొక్క విశేషము) కల = సూక్ష్మాతిసూక్ష్మ పూర్వకమగు అనుద్భూతమగు **(unmanifest creation)** సృష్టికి కారణరూపము. ఇందు సత్వరజస్తమోగుణముల ప్రసక్తియుండదు. కనుక నీ నాద, బిందు కళలకు పూర్వస్థితియందుండు బ్రహ్మపదార్థము నిర్గుణము. మూలప్రకృతి నుండి దిగువకు పరిణమించు భూమికలు **(States of consciousness)** సగుణములని నా అల్పబుద్ధికి ఉపపత్తిపూర్వకముగ స్ఫురించినది. శాస్త్రహృదయ మదియేనని విశ్వసింతును. ఏలనన ఐశ్వర్యము (భగవద్విభూతి)

రెండువిధములుగ నున్నది. 1) సర్వాత్మకుడగు ఈశ్వరుడుగా అనగా అష్టమూర్తులుగ భాసించు అవ్యక్తతత్త్వము. 2) నిష్కలము నిష్క్రియము, అఖండము, అద్వితీయము నగు బ్రహ్మను అపరోక్షముగ నెరింగి అనుభూతిపొందుట యొకటి. "యస్సాక్షాద పరోక్షాద్బ్రహ్మ" పరమాత్మ అపరోక్షముగ మాత్రమే నెరుగదగినవాడు అని. ఈ విచారణచే మొదటిది సత్వరజస్తమో గుణాత్మక సగుణబ్రహ్మ రెండవది త్రిగుణము లున్నూ పరాశక్తియందు లయించి ఆ శక్త్యధిష్ఠానమునందు కారణరూపముగ ప్రభావరహితముగ విలీనమై అనన్యముగనుండు నిర్గుణస్థితి, కనుక మనము ఈ సగుణనిర్గుణ స్థితులయందు పరమాత్మ అధిష్ఠానమే యని గ్రహించినగాని ఈ యష్టమూర్తులయందువలె సర్వమునందునూ పరమాత్మసత్తదప్ప ఆయన విభూతిదప్ప అన్యమగునది యత్కించతు లేదనికూడ దెలియగలము. * స్వరూపమునుబట్టి నిర్గుణము స్వభావమును బట్టి సగుణము, స్వరూపస్వభావములు ఒకే వస్తువుయగునుగాని భిన్నములుగాజాలవు.

సగుణమగు అష్టమూర్తులను, మూర్తిపూజతోడనో, ఉపాసనతోడనో అర్చించి వారియందలి అంతర్యామిగనుండి స్ఫూర్తినిచ్చు నిర్గుణమును దర్శించి తన ప్రత్యగాత్మత్వమును దృఢీకరించుకొని, సర్వాత్మత్వ విభూతితో గూడిన ఈశ్వరత్వము స్వతః ఉపలబ్ధి పొందగలరని బోధించు సద్గురు దక్షిణామూర్తికి నమస్కారము.



10. శ్లో॥ సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం
యస్మాదముష్మిన్ స్తవే
తేనాఽస్య శ్రవణా త్తదర్థమననా
ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతి సహితం
స్యాదీశ్వరత్వం స్వతః
సిధ్యేత్తత్పు నరష్టధాపరిణతంచై
శ్వర్యమవ్యాహతమ్॥

టీక :— ఇతి = ఈ విధముగా; అముష్మిన్ స్తవే = ఈ స్తోత్రమున; సర్వాత్మత్వం = సర్వమూ ఆత్మస్వరూపము; యస్మాత్ = ఎందువలననో; తేన = ఆ కారణముచేత; అస్య = ఈ (స్తోత్రముయొక్క) శ్రవణాత్ = వినుటవలనను; తదర్థమననాత్ = దానియర్థమును యుక్తులతో మననముజేయుటవలనను; ధ్యానాత్ చ = భావముల ధ్యానము జేయుటవలనను; సంకీర్తనాత్ = చక్కగా (పెద్దలయెదుట) చెప్పుటవలనను; సర్వాత్మత్వ మహావిభూతి సహితం = సర్వాత్మత్వభావము అను ఉత్తమస్థితితో కూడిన; ఈశ్వరత్వం = పరమేశ్వరభావము; స్వతః = స్వయముగా; సిధ్యేత్ = సిద్ధించును; పునః = (మఱియు) అష్టధా = ఎనిమిది విధములుగ; పరిణతం = పరిణామమునొందిన; తత్ = ఆ (ప్రసిద్ధమగు); అవ్యాహతం = అడ్డులేని; ఐశ్వర్యంచ = ఈశ్వరభూతి లేక దివ్యస్థితి; స్యాత్ = అగును.

తా॥ ఈ దక్షిణామూర్తి స్తోత్రమున "సర్వాత్మభావము" వివరింపబడినది. దీనిని శ్రద్ధతో వినుటవలనను, మననము జేయుటవలనను, ధ్యానించుటవలనను, సంకీర్తనము జేయుటవలనను, సర్వాత్మభావసిద్ధితో

స్వతస్సిద్ధ సత్యజ్ఞానానంద పరమేశ్వరభావము ప్రాప్తించును. 'అణిమా గరిమాచైవ, మహిమా లఘిమాతథా, ప్రాప్తిః ప్రాకామ్యమీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః' అను నష్టసిద్ధులుకూడ సాధకేచ్ఛానుసారము అప్రతిహతముగ గలుగునని యొక సంప్రదాయము. ఈ సిద్ధులు యోగులకు షట్చక్రములయందు గుప్తముగనున్న శక్తులవశీకరణచే ప్రాప్తింపగలవు. ఐననునివి పరమార్థముగావు, అష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్ అను వాక్యమునకు అష్టమూర్తులుగ స్ఫూర్తినిచ్చుచున్న పరమేశ్వర సర్వశక్తిమత్త్వముగా గ్రహించుట ఉపపన్నమగును.

వివరణ :— ఈ శ్లోకమున "సర్వాత్మత్వము" అనునదే నాలుగు మహావాక్యముల లక్ష్యమగు భావము. ఇదియే ఈ స్తోత్రహృదయము. కను కనే ఫలశ్రుతియందు ప్రసక్తికి వచ్చినది. ఈ సత్యమును విపులీకరించి బోధించుటకే ఈ స్తోత్రము చెప్పబడినది. సర్వాత్మత్వమన ప్రపంచమున చరాచరరూపములగు సర్వజీవజడములయందునుగల చైతన్యము, ఏకము మాత్రమే. ఏకాత్మకము అనగా జీవకోటి ఉపాధిభేదములచే భిన్నభిన్నముగ స్ఫూర్తినిచ్చుచున్నను ఆత్మల ఏకత్వమే, అభిన్నతయే; జడములు జీవులు, (జీవజగత్తులు) సర్వము పరమాత్మయందు అజ్ఞాన పరిణామముచే తమోగుణ ప్రాబల్యముచే ఆరోపితములుగ తెలిసికొన్నందున ప్రబోధనొంది, ఆత్మజ్ఞానములభించి, అజ్ఞాన పరిణామ స్వరూపమగు వివర్తమిట్టిదని గ్రహించినయెడల, జీవులు ఏకాత్మక, అఖండస్వరూపమగును. జడములు ఆ సర్వాత్మనే అధిష్ఠానముగగలిగి, భాసించుచున్నందునను, అష్టమూర్తులుగ స్ఫురణనిచ్చుచు, సాపేక్షికభూమికయందు (**Relative plane**) అనగా ప్రాకృతిక ప్రపంచమునందు సత్వరజస్తమోగుణముల ప్రభావముచే, వ్యవహారమునకు వచ్చిన సగుణబ్రహ్మమేయని, విచారణచే గ్రహించి నిర్ధారించుకొంటిమి. కనుక విమర్శించినయెడల ఆత్మకంటె

నన్యమగునని అపలేశమైనను లేదని వేదాంతశాస్త్రానుసారముగ ఏకైక సిద్ధాంతముగ చెప్పబడినది. జీవజగత్తులకు రెంటికిని ఆరోపకారణమజ్ఞాన మనియే చెప్పబడినది. అజ్ఞానముకూడ ఆరోపితమేయని చెప్పబడినది. అగు. ఆరోపములన్నిటికి మూలకారణమై భ్రాంతిజ్ఞానము నొసంగు అజ్ఞానము ఎట్లు ఆరోపమని చెప్పవీలున్నదని శంక. అందుకు: అజ్ఞానము తనకధిష్ఠానమగు మాయయందు లీనముకాగా ఆమాయ పరమాత్మయందు మిధునభావముతో యోగముకలిగియున్నట్లు అందుచే అజ్ఞానము కార్య రూపమునకు వచ్చినప్పుడు ఆరోపమైనట్లు మనము గ్రహించవచ్చు. అజ్ఞానమునకు మూలమగు మాయ పరమాత్మయందు నిజాంతర్గతమే. కనుకనే జీవజగత్తులు ఆత్మాధిష్ఠానముగ స్ఫూర్తినొందుచున్నవి. ఇందుచే సర్వాత్మత్వభావము ప్రాప్తప్రాప్తము.

అనాదియగు అజ్ఞానము తనకు ఆధారమగు (మూలమగు) మాయ యందుండుననియు, నిర్గుణభూమికను పోవునప్పటికి, మూలప్రకృతి స్వరూపస్వభావములగు సత్వరజస్తమో గుణములుకూడ అపరాప్రకృతి స్థాయినధిగమించి, పరాప్రకృతిస్థాయికి పోవుటచే అందే లయమయి, స్వరూపరహిత, ప్రభావరహితస్థితినొంది, మాయాశక్తి రూపమునొంది, ఆ బ్రహ్మయందే మిధునరూపమున నుండునని గ్రహించిననే అద్వయ సిద్ధాంతము ఉపపత్తిలో గ్రహింపననువగును. ఈ స్థితియందు పానువట్టము మాయా శక్తికి, లింగము నిర్గుణపరమాత్మకు **(both as consciousness as stasis)** ప్రతీకములై ఆరాధ్యయోగ్యములగును గాని—సృష్టిక్రియ సమర్థములుగ, మహాశక్తిసంపన్నములుగ * ప్రకృతము జనసామాన్యముచే గ్రహించి మన్నింపబడుచున్న స్త్రీ, పురుష మర్మావ యవములకు ప్రతీకములనుభావము అంగీకారయోగ్యముగ లేదుగనుక అనాదరణీయము. జ్ఞానికి సర్వాత్మత్వభావము సిద్ధించిన జీవన్ముక్త

డగును. తరువాత విదేహము క్తి తగును. అప్పుడు. ఆ బ్రహ్మాకార వృత్తియూ బ్రహ్మయందే లయమగును. అప్పుడు మాత్రమే సర్వ ప్రపంచము మిథ్యగా, జాగ్రత్ రూపమగు సర్వాత్మాధిష్ఠాన స్వప్నస్థితిగ, సత్వరజ స్తమములనబడు గుణరహిత నిర్గుణముగ, కేవల ఆత్మానంద రూపమగు పరమాత్మానుభూతి మాత్రమే యుండును. ఇదియే సత్య లోకము. (The true State of the consciousness real.) అప్పుడు.

శ్లో॥ చిదేవ దేహాస్తు, చిదేవలోకాః,
చిదేవభూతాని, చిదింద్రియాణి ।
కర్తాచిదంతః కరణంచిదేవ,
చిదేవసత్యం, పరమార్థరూపమ్॥

(స్వాత్మప్రకాశిక : శంకర)

"సర్వాత్మత్వ" భావము నిట్లు స్ఫుటీకరించి బోధించు నీ దక్షిణా మూర్తి స్తోత్రమును గురుముఖమున శ్రవణముజేసినను, ఉపనిషద్భావము లతో, యుక్తు లవల్ల, ఉదాహరణలవల్ల సమన్వయము జేసికొనుచు మననముజేసికొన్నను, ఆ బోధయందలి భావసారములను అవిచ్ఛిన్నమగు సజాతీయభావమున ధ్యానించినను సంకీర్తనముగ నితరులకు వినిపించి సను సర్వాత్మత్వవిభూతి (మోక్షము) ప్రాప్తప్రాప్తముగ దెలియబడి— అష్టమూర్తులును తన స్వరూపవిభూతులు మాత్రములుగనే భాసింపబడు చున్నవనుభావ మహదైశ్వర్యముగలిగి తన ఈశ్వరత్వస్థితిని ప్రత్యగాత్మ తెలియును. ఇట్లు ప్రపంచమును ఆత్మగా దర్శింపగలవానికి మాత్రమే తాత్త్వికమున "జగన్మిథ్య". గృహస్థులకుగాదు. సంపూర్ణ విరక్తునికే పరమహంసకే జగన్మిథ్య అనదగు అధికారము. సర్వులకుగాదు అట్లైన శ్రవణాత్తదర్థ మననాత్ ధ్యానాచ్చ సంకీర్తనాత్—సర్వాత్మత్వ మహా

విఖ్యాతిసహితం సాదీశ్వరత్వం స్వతః అని యేలజెప్పబడినదని ప్రశ్న : ఇది అర్థవాదవాక్యమా (obiter dicta) ప్రయోజనాత్మక ఫలశ్రుతియో యన్న, అజ్ఞానులకు అర్థవాదవాక్యముగ నుపకరించును. ఉత్తమ విజ్ఞానులకు ధ్యానసంకీర్తనా రూపమగు సాధనప్రక్రియగ నుపకరించును.

అభ్యాసవైరాగ్య సాధనలే ప్రధానము, ప్రయోజనాత్మకమని, సర్వేంద్రియ మౌనవ్యాఖ్యాసిద్ధమగు సమాధిస్థితి ప్రదర్శకభంగిమతో, జీవేశ్వర ఐక్యసూచకమగు రేఖారూపచిన్ముద్రతో, తత్త్వోపదేశముజేయు సద్గురు శ్రీ దక్షిణామూర్తికి, ఆయన మా బుద్ధులను ప్రేరేపించి ప్రబోధించి సర్వాత్మత్వస్థితి నొసంగుగాకయని ఈ నమస్కారము.

9వ శ్లోకమున సగుణబ్రహ్మ స్వరూపము ఆరాధ్యవిధానము సగుణ నిర్గుణములకు సామరస్యము తెలుపబడి ఈ చరమశ్లోకము సగుణ నిర్గుణపూర్వమగు సాధనలకు అందుచే ప్రాప్తించు జ్ఞానమునకు ఫలశృతి పూర్వకముగ బోధింపబడినది.

ఓం తత్ సత్